# ఆచార్యకైంకర్యం

**శ్రీరంగామృతకవి రాహ రంగిభృత్యః తచ్ఛిష్యో యతిపతివైభవానుబంధమ్ ।**
**అంతాదిద్రమిడగిరా మహాప్రబంధం గాథానామమృతముచాం యుతం శతేన ॥**
**(దివ్యసూరిచరితమ్)**

జగదాచార్యులైన భగవద్రామానుజులను కీర్తిస్తూ తిరువరంగత్తముదనార్ అనుగ్రహించిన ద్రావిడప్రబంధం **"ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది"**. శ్రీరామానుజులను స్తుతించే కృతులు ఎన్ని ఉన్నా, శ్రీవైష్ణవసాహిత్యంలో, సంప్రదాయంలో నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధానికి గల ప్రాధాన్యం అసమానం. ఆ*ழ*్వార్ల దివ్యసూక్తులతో సమానంగా ఆదరించబడి, సర్వత్ర అనుసంధింపబడే అతిశయం ఈ ఒక్క కృతికి మాత్రమే దక్కింది.

శ్రీరామానుజుల జ్ఞానభక్తి వైరాగ్యాలను సర్వతోముఖంగా కీర్తించే ఈ అన్దాదిప్రబంధం శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రపన్నగాయత్రిగా వ్యవహరింపబడుతూ నిత్యానుసంధేయంగా విరాజిల్లుతున్నది. నాలాయిర దివ్యప్రబంధవాఙ్మయంలో చరమపర్వనిష్ఠను పూర్ణంగా ప్రతిపాదించే ప్రబంధాలు రెండు. వాటిలో ఒకటి నమ్మా*ழ*్వార్ల విషయంగా మధురకవులు అనుగ్రహించిన ప్రబంధం కణ్ణినుణ్ శిఱుత్తామ్బు కాగా, ఇంకొకటి శ్రీరామానుజుల విషయంగా అముదనార్ అనుగ్రహించిన ఈ ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది.

ఈ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధం ద్వయమంత్రవాక్యద్వయార్థయాథాత్మ్య జ్ఞానప్రతిపాదకం. ద్వయమంత్రంలోని పూర్వవాక్యం శ్రీమన్నారాయణుని చరణాలే ప్రాపకమని తెల్పుతూ ఉండగా, ఉత్తరవాక్యం శ్రీమన్నారాయణుని కైంకర్యమే ప్రాప్యమని తెల్పుతున్నది- అనే విషయం ప్రసిద్ధం. ఈవిధంగా పూర్వవాక్యం ప్రపన్నుని స్వరూపానురూపమైన ఉపాయాన్ని, ఉత్తరవాక్యం స్వరూపానురూపమైన ప్రాప్యాన్ని నిష్కరిస్తున్నవి. ఇది ద్వయమంత్రవాక్యద్వయార్థజ్ఞానం. ఇక, ప్రపన్నుని స్వరూపనిష్కర్షను చేసినపుడు దాని యాథాత్మ్యజ్ఞానం ఏమంటే- **"తచ్ఛేషత్వముమ్ పుఱవిత*ழ*్ ఎన్నుమ్బడి తదీయశేషత్వమే వడివాయిరుప్పతు"** అనే శ్రీవరవరమునుల సూక్త్యనుసారం తదీయశేషత్వమే. **"అన్ద తదీయరిల్ వైత్తు క్కొణ్డు ముతలడియిలే తన్నై అఙ్గీకరిత్తు తత్త్వజ్ఞానప్రదానత్తై ప్పణ్ణిన మహోపకారకనాన స్వాచార్యనుక్కే శేషమాయిరుక్కై సమస్తభాగవతరుడైయ ఉకప్పుమాయ్, తన్ స్వరూపత్తినుడైయ ఎల్లై నిలమాయిరుక్కుమ్"** అనే

శ్రీవరవరమునిసూక్తి చొప్పున తదీయశేషత్వానికి పరమావధి అయిన ఆచార్య శేషత్వమే ప్రపన్నుని నిష్కృష్ట స్వరూపమని గ్రహించడం ఆత్మయాథాత్మ్య జ్ఞానం. అందువల్ల ద్వయమంత్రంద్వారా తెలుపబడ్డ ఉపాయోపేయాల స్వరూపనిష్కర్ష ఏమంటే - ఆచార్యులే ఉపాయం, వారి సేవే ప్రాప్యం- అని. ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో ఈ ద్వయమంత్రార్థసారం అముదనార్‌చేత జగదాచార్యులైన భగవద్రామానుజుల పరంగా అన్వయించి, వివరింపబడింది. ఈవిషయం నూఱ్ఱన్దాది ప్రబంధంలోని **"పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, ఆప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱు మిల్లై మఱ్ఱచ్చరణన్ఱి"** ఇత్యాదిగా పలు పాశురాలలో వ్యక్తం కావడాన్ని గమనించవచ్చు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే శ్రీవరవరమునులు **"ఇవ్వర్థత్తై తత్త్వయాథాత్మ్య జ్ఞానత్తాలే విశ్వసిత్తిరుక్కుమవర్‌కళుక్కుమ్"** అని పల్కడం గమనార్హం. ఈ విషయంలోనే మఱికొన్ని విశేషాలు విన్నపింపబడుతున్నాయి.

ద్వయంలోని పూర్వవాక్యఘటితమైన నారాయణ శబ్దాన్ని వివరిస్తూ శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ఈపదం ద్వారా ఆశ్రయణసౌకర్యాపాదకాలైన వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్యాలనే నాల్గు గుణాలు, ఆశ్రితకార్యాపాదకాలైన, జ్ఞానం, శక్తి, ప్రాప్తి, పూర్తి, కారుణికత్వం ఔదార్యాలనే గుణషట్కం ప్రకరణవశంచేత వ్యక్తమవుతున్నవని అన్నారు. ఈ గుణాలు అన్నీ నూఱ్ఱన్దాది ప్రబంధంలో భగవద్రామానుజుల పరంగా అన్వయించి పలుకబడ్డాయి- అనే అంశం సంగ్రహంగా విన్నపింపబడుతున్నది. **"ఇప్పడియై త్తొడరుమ్"** అని, **"అవర్‌పిన్ పడరుమ్ కుణన్"** అని రామానుజుల వాత్సల్యగుణం తెలుపబడింది. **"అణ్ణల్ ఇరామానుశన్"** అని, **"పల్లుయిర్‌క్కుమ్ వీడళిప్పాన్ విణ్ణిన్‌తలై నిన్ఱు"** ఇత్యాదిగా స్వామిత్వం, **"ఎన్నరువినైయిన్ తిఱఱ్జెఱ్ఱిరవుమ్ పకలుమ్ విడాతు ఎన్ఱన్ శిన్దైయుళ్ళే నిఱైన్దొప్పఱ విరున్దాన్"** అని పొఱ లేకుండా కలిసే సౌశీల్యం, **"ఎన్ కణ్ణుళ్ళుమ్ నెఞ్జుళ్ళుమ్ నిన్ఱ"** అని సౌలభ్యం -ఈవిధంగా ఆశ్రయణసౌకర్యాపాదకగుణాలు నాల్గు తెలుపబడ్డాయి. అదే రీతిలో **"మెయ్‌ఞ్ఞానత్తిరామానుశన్"** అని, **"కతి రామానుశన్"** అని, **"ఉణ్మైనన్ ఞాన ముఱైత్త ఇరామానుశన్"** అని జ్ఞానం. **"ఎన్‌పెయ్ వినై తెన్పులత్తిల్ పొఱిత్త అప్పుత్తకచ్చుమ్మై పొఱుక్కి"** అని పాపవిమోచకత్వరూపశక్తి, **"శలియాప్పిఱవి త్తవమ్ తరుమ్ తీవినై పాఱ్ఱి త్తరుమ్ పరన్దామమెన్నుమ్ తివమ్ తరుమ్"** అని విరోధినిరసన పూర్వకమైన భగవత్ప్రాప్తిని కల్గించే శక్తి, భగవద్విషయాన్ని స్వాధీనం చేసికొన్న పూర్తి, **"ఎన్నై యిరామానుశన్ వన్దెడుత్తననిన్ఱెన్నై"** అని ప్రాప్తి, **"కారేయ్ కరుణై ఇరామానుశ"** అని కారుణికత్వం, **"కొణ్డలనైయ వణ్మై"**, **'ఉన్‌వణ్మై యెన్పాల్ ఎన్ వళర్‌న్దతువే"** అని అపేక్షానిరపేక్షంగా ఉపకారం చేసే స్వభావమైన ఔదార్యం- ఈ విధంగా ఆశ్రితకార్యాపాదకగుణాలన్నీ భగవద్రామానుజులలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయని అముదనార్ తమ నూఱ్ఱన్దాదిలో స్తుతించారు. పైన ఉదాహరింపబడ్డ నూఱ్ఱన్దాది పాశురాలను వ్యాఖ్యానిస్తూ శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ ఆయా గుణాలు వాటిలో ప్రకటితమయ్యాయని నిరూపించడాన్ని సహృదయులు గమనించగలరు. ఇవి అన్నీ వివరణసాపేక్షాలు. ఆచార్యసన్నిధిలో అవగంతవ్యాలు. కనుక వివరింపబడలేదు.



ఇటువంటి తత్త్వయాథాత్మ్యజ్ఞాన ప్రతిపాదకమైన ఈప్రబంధానికి గల శ్రీవరవరమునుల ఉరై, శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యలు సుప్రసిద్ధాలు. గత శతాబ్దిలో శ్రీవైష్ణవసంప్రదాయ ప్రచారధురంధరులై, పండిత ప్రకాండులై జగద్విఖ్యాత కీర్తులై విలసిల్లిన **కాంచీమహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారు** నాతివిస్తృతమైన, మధురమైన దివ్యార్థదీపికావ్యాఖ్యను ఇప్పటికి సుమారు 90 సంవత్సరాల క్రితం వెలయించారు. ప్రపన్నజనసేవ్యమైన ఈ వ్యాఖ్యను ఈ ఏడు జరిగే **శ్రీమాన్ అణ్ణాస్వామివారి ద్విషష్ట్యబ్ద పూర్త్యుత్సవ శుభ సందర్భంగా** ఆంధ్రదేశంలోని ఆస్తిక సహృదయపాఠకులకు అందించాలనే ఆశతో దాసుడు ఆంధ్రీకరించగా, ఈ ఆంధ్రీకరణను ముద్రించడానికి కావలసిన ఆర్థికవ్యయాన్ని భరించడానికి ముందుకు వచ్చినవారు పరమపదవాసులు, విద్వత్తల్లజులు ఉ.వే. **శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి శిష్యులు, విజయనగర వాస్తవ్యులు,** ప్రపన్నాగ్రేసరులైన **శ్రీమాన్ మట్టపల్లి రామానుజంగారు, శ్రీమతి యశోదమ్మ దంపతులు.** వీరి ఆచార్యభక్తికి, సంప్రదాయ సేవానిరతికి అనేక మంగళాశాసనాలను చేస్తున్నాను. ఈ ముద్రణను శ్రీమాన్ రామానుజం గారు తమ సప్తత్యుత్సవ శుభవేళ చేయించడం విశేషం. వీరిని ఈ ప్రయత్నంలో ప్రోత్సహించిన విదుషీమణి **శ్రీమతి కె.వి. జానకమ్మగారికి** హార్దికంగా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను. అభినవ భూతపురిగా ప్రసిద్ధి చెందిన నరసాపురంలో (ప.గో. జిల్లా) శ్రీ ఆదికేశవ ఎమ్బెరుమానార్ స్వామివార్ల కోవెల సమీపంలోని గల తి.తి.దేవస్థానం **కల్యాణమండపంలో ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్టు (తి.తి.దే) వారిద్వారా "ఇరామానుశనూఱ్ఱన్దాది"** ప్రబంధంపై ఈ ఏడు మార్చి 25వ, 26వ, 27వ తేదీలలో నిర్వహింపబడే ఉభయవేదాంత సభల సందర్భంగా ఈగ్రంథప్రకాశనం

చేయబడడం, ఆ సభలలోనే ఆవిష్కరింపబడడం అత్యంతం సముచితం. శ్రీఆదికేశవస్వామి, ఎమ్బెరుమానార్‌స్వామివార్ల దివ్యకటాక్షాలు శ్రీమాన్ **మట్టపల్లి రామానుజం,** శ్రీమతి **యశోదమ్మ** దంపతులపై పరిపూర్ణంగా ప్రసరించి, ఇతోధికమైన సర్వతోముఖాభివృద్ధి వారికి కలగాలని కోరుకొంటున్నాను. నా ఈ ప్రయత్నంలో అన్నివిధాల ప్రోత్సహించి నన్ను ఆశీర్వదించిన **పితృచరణులు న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి** సన్నిధిలో, మంగళాశాసనాలను అనుగ్రహించిన **మాతులపాదులు, పండితరత్న, ఉభయవేదాంతవాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారి** సన్నిధిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను. శ్రీమాన్ అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికా ద్రావిడవ్యాఖ్యను ఆంధ్రీకరించి ప్రచురించడానికి సహృదయతతో అనుమతించిన వారి పౌత్రులు **శ్రీమాన్ పి.బి. రాజహంసస్వామి (కాంచీపురం) వారికి,** వారి కుటుంబసభ్యులకు అనేక కృతజ్ఞతాపూర్వక నమస్సుమనస్సులను సమర్పించుకొంటున్నాను. సకాలంలో డి.టి.పి. చేసి సహకరించిన **శ్రీమతి జయలక్ష్మిగారికి, మరియు శ్రీ చంద్రశేఖర్‌గారికి,** అందంగా ముద్రించిన సి.ఎన్. ప్రింటర్స్, శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలు. **"అడైయార్ కమలత్తు"** అనే 33వ పాశుర వ్యాఖ్యలో శ్రీ అణ్ణాస్వామివారు చేసిన విస్తృతమైన విచారం మాత్రం ఆర్థిక పరిమితులవల్ల ఇందులో పొందుపరచడం వీలుకాలేదు. ఈ అనువాదంలోని లోటు పాట్లను సహించి ఆశీర్వదించవలసినదిగా విజ్ఞులైన సహృదయ పాఠకులను ప్రార్థిస్తున్నాను. స్వస్తి.

ప్రకాశకౌ కృతేరస్యాః వేంకటార్యపదాశ్రయౌ ।
భాగ్యవంతౌ యశోదాంబారామానుజసమాహ్వయౌ ॥

ఇట్లు నివేదించు
చరమావధిదాసుడు

తిరుపతి,

20-2-2001

**ఈ.ఏ. శింగరాచార్యులు**



## ఇరామానుశనూఱ్ఱన్దాది
## కాంచీ మహావిద్వాన్ శ్రీమాన్ ప్ర.భ. అణ్ణంగాచార్యస్వామివారి దివ్యార్థ దీపికావ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం

# ఉపోద్ఘాతం

**"ఇరామానుశనూఱ్ఱన్దాది"** అనే సమస్త పదానికి **"ఇరామానుశనతు నూఱ్ఱన్దాది"** (శ్రీరామానుజుల నూఱ్ఱన్దాది) అనే విగ్రహవాక్యాన్ని చెప్పాలి. శ్రీరామానుజుల విషయంగా అన్దాదిక్రమంలో పాడబడిన, నూఱు కొచ్చకమ్ పాశురాలను కల్గిన ఒక ప్రబంధం అని ఈ సమాసం యొక్క అర్థం. ఈ సమస్తపదంలో సమసించిన షష్ఠీవిభక్తియొక్క అర్థమైన సంబంధం ఏమంటే- విషయంగా ఉండడం (విషయ-విషయిభావసంబంధం ఇచటి షష్ఠీవిభక్తియొక్క అర్థం), విష్ణుపురాణం, శడకోపర్ అన్దాది మొదలైనవానిలోవలె (ఇక్కడకూడా షష్ఠీవిభక్తికి విషయ-విషయిసంబంధం అర్థం) శ్రీరామానుజులనుగూర్చిన నూఱ్ఱన్దాది అని వివరిస్తే (**"రామానుజ ముద్దిశ్య కృత అన్దాది ప్రబంధః"**) ద్వితీయావిభక్తి, దాని అర్థం. సమసించిన రూపంగా గ్రహించవచ్చు. ఇరామానుశ + నూఱ్ఱన్దాది అనే పదాల సంధిలో **"శిల వికారమా ముయర్త్తిణై"** (నన్నూల్) (మహద్వాచకాలకు సంధిలో కొన్ని వికారాలు కల్గుతాయి) అనే సూత్రం వల్ల పూర్వపదంలోని చివరి వర్ణం **"న్"** అనే హల్లు లోపించింది. **"కమ్బరామాయణమ్", "నీల వెణ్బా"** ఇత్యాదులు ఇటువంటివి. **"ఇరామానుశ నూఱ్ఱన్దాది"** అని కూడా ఈ పదాన్ని కొందఱు నిర్దేశిస్తారు. (ఇచటి **"నూ"** అనే అక్షరం తమిళ వర్ణమాలలోని వర్ణాక్షరాలకు చెందిన అనునాసికం కాదు, యరలవల క్రమంలోని వేఱే వర్ణం)

**"ఇరామానుశన్"** అనే పదం **"రామ, అనుజన్"** అనే రెండు పదాలు కలసినపుడు సవర్ణదీర్ఘసంధివల్ల ఏర్పడింది. శ్రీరామునకు పిమ్మట జన్మించినవాడని అర్థం. శ్రీరామావతారసమయంలో ఈ నామం లక్ష్మణునకు వ్యవహరింపబడింది. తరువాత, తిరుమలైనమ్బి నియమనానుసారం శ్రీవైష్ణవదర్శననిర్వాహకులుగా అవతరించిన ఉడైయవర్‌కు పెట్టబడింది. **"ఇళైయాళ్వార్"** అనేది ద్రావిడ తిరునామం. లక్ష్మణముని ఇత్యాది తిరునామాలుకూడా వీరి పర్యాయనామాలే. ఆ ఆచార్యవర్యులను గూర్చిన అన్దాదిప్రబంధం ఇది.

**"అన్దాది"**- అంతాన్ని ఆదిగా కల్గినది అని అర్థం. ఇది బహుప్రీహిసమాసం. సంస్కృత సమస్తపదం. సవర్ణదీర్ఘసంధి. **"అన్త+ఆది"** అని విడదీయాలి. **"అన్దాది**

**(అన్దాది)"** అంటే- ముందున్న పాశురంలో చివరగల అక్షరంకాని, వర్ణంగాని, గణం కాని, పాదంకాని తరువాత వచ్చే పాశురంలో మొదట ఉండేటట్లు పాడబడినది. ఈ విధంగా రచింపబడ్డ గ్రంథంలోని చివరి పాశురంలోని అంతమే మొదటి పాశురంలో ఆదిగా ఉండేటట్లు కూర్చడం **"మణ్డలిత్తల్"** అని అనబడుతుంది. ఇది తొంబై ఆఱు విధాల ద్రావిడ ప్రబంధాలలో ఒకటి. పది*ఱ్ఱ*న్దాది, నూ*ఱ్ఱ*న్దాది అనే క్రమంలో ఈ ప్రబంధం నూ*ఱ్ఱ*న్దాది. అంటే -నూఱు వెణ్బా పాశురాలతో కాని, నూఱు కట్టళైక్క లిత్తుఱై పాశురాలతోకాని అన్దాది ప్రక్రియలో రచింపబడినది. ఈ దివ్యప్రబంధం నూఱు పాశురాలకు మించి అధికంగా ఎనిమిది పాశురాలను కల్గి ఉన్నా నూ*ఱ్ఱ*న్దాది అని అనడంలో అడ్డు లేదు. నూఱు, వేయి మొదలైన సంఖ్యలకు పది, ఎనిమిది తక్కువగా ఉన్నా, ఎక్కువగా ఉన్నా వాటిని నూఱు, వేయి అని అనడం తగినదే. పదకొండువందల రెండు పాశురాలను కల్గిన తిరువాయ్‌మొ*ழ*ిని **"తిరువాయ్‌మొ*ழ*ి ఆయిరమ్"** అని, వేయి ఎనభై నాల్గు పాశురాలను కలపెరియ తిరుమొ*ழ*ిని **"తిరుమొ*ழ*ి ఆయిరమ్"** అని అనడాన్ని గమనించవచ్చు. **"యతిరాజవింశతి, వరవరమునిశతకమ్"** అనే సంస్కృతగ్రంథాలలోకూడా అధికంగా నాల్గైదు శ్లోకాలు, ఏడెనిమిది శ్లోకాలు ఉండడం గమనించవచ్చు. ఈ విధంగా అధికంగా ఉన్నట్లే, తక్కువగా ఉన్నవికూడా ఉన్నాయి. **"వాణనాయిరన్తోళ్ తుణిత్త"** అని ఆ*ழ*్వార్లు పలు సందర్భాలలో అనుగ్రహించారు. పరమశివుని ప్రార్థనను అంగీకరించి భగవానుడు బాణుని నాల్గు బాహువులతో, ప్రాణాలతో విడిచిపెట్టినట్లుగా పురాణాలు పల్కడాన్ని గమనించాలి. **"నాలాయిరదివ్యప్రబంధమ్"** అనే వ్యవహారంయొక్క తత్త్వంకూడా ఇటువంటిదే అన్నది గమనార్హం.

ఈ ప్రబంధంలో నూట ఎనిమిది పాశురాలు కూర్చబడి ఉండటానికి, ప్రతిపాశురంలోను శ్రీరామానుజుల తిరునామం తప్పకుండా అనుసంధింపబడడానికి పెద్దలు ఒక కారణాన్ని తెలుపుతారు. "భగవద్రామానుజుల శ్రీచరణాలలో భక్తిని కల్గినవారికి ఈ ప్రబంధం సావిత్రివలె నిత్యానుసంధానం కావాలి''- అని ప్రతి పాశురంలోను తిరునామాన్నిగూర్చి, నూట ఎనిమిది పాశురాలుగా అముదనార్ అనుగ్రహించారు- అని. **"ప్రపన్నసావిత్రి"** అని, **"ప్రపన్నగాయత్రి"** అని దీనిని మన పూర్వాచార్యులు వ్యవహరిస్తారు.

ఈ ప్రబంధం భగవద్రామానుజుల కాలంలో అవతరించినది అయినా, శ్రీరంగ నాథుడు అముదనార్‌కు ఆజ్ఞాపించి, ఈ ప్రబంధాన్ని రచింపజేసినందువల్ల, దీనిని ఎమ్బెరుమానార్ స్వయంగా ఆలకించినందువల్ల ఇది ఆ*ழ*్వార్ల అరుళిచ్చెయల్



(శ్రీసూక్తుల)తో చేర్చి అనుసంధింపబడుతున్నది. తిరుక్కార్తికై తరువాత ఆ*ழ*్వార్ల దివ్యప్రబంధాలకు ఏర్పడిన అనధ్యయననియమం దీనికికూడా అన్వయిస్తుంది.

మొదటి ఆయిరం **(ముదల్ ఆయిరమ్)**, పెరియ తిరుమొ*ழ*ి, తిరువాయ్‌మొ*ழ*ి, ఇయఱ్పా- అనే నాల్గు ఆయిరాలలో నాల్గవ వేయి అయిన ఇయఱ్పాలో చరమ ప్రబంధంగా కూర్చబడిన ఈ అన్దాది, ప్రవణవార్థాన్ని విశదీకరించే ముదల్ ఆయిరమ్ చివరలో నమ్మా*ழ*్వార్ల విషయంగా భాగవతశేషత్వాన్ని ప్రతిపాదించే కణ్ణినుణ్ శిఱుత్తామ్బును చేర్చినట్లే, కైంకర్యంలో విరోధిని తొలగించే ఇయఱ్పాతో దీనిని చేర్చి అనుసంధించడం యుక్తమైనదే.

## తిరువరఙ్గత్తముదనార్ వైభవం

తిరువరఙ్గత్తముదనార్ పంగుని మాసం (ఫాల్గుని మాసం)లో హస్తానక్షత్రంలో మూఙ్గిల్‌కుడిలో అవతరించారు, శ్రీరంగం కోవెలలో నిర్వాహకులుగా ఉండడంచేత వీరు **'పెరియకోయిల్ నమ్బి"**అనే ప్రసిద్ధిని పొందారు. (అష్టప్రబంధం రచించినవారు, భట్టర్ శ్రీపాదాలను ఆశ్రయించినవారైన **"పిళ్ళైప్పెరుమాళ్ అయ్యఙ్గార్"** కు వీరు తండ్రి అని కొందఱు, ముత్తాత అని కొందఱు అంటారు)

వీరు సర్వశాస్త్రాలను అభ్యసించి, మహావిద్వాంసులై, తమకు కులక్రమంగా వచ్చిన శ్రీరంగాలయపురోహితవృత్తిని, పురాణపఠనకైంకర్యాన్ని నిర్వహిస్తూ, చాలా రాజసగుణం కలవారై, గర్వంతో ఉండేవారు. అపుడు, లోకోద్ధరణకోసం ఆదిశేషుని అంశతో అవతరించిన భగవద్రామానుజులు తమ సహజమైన పరమకృపతో వీరిని సంస్కరించి, వీరివల్ల కైంకర్యాన్ని స్వీకరించాలని తలచి, ఆ పనికోసం కూరేశులను నియమించారు. కూరేశులు అముదనార్‌ను అనువర్తిస్తూ, వారికి స్వరూపజ్ఞానదీపాన్ని వెలిగించి, శ్రీరామానుజుల శ్రీచరణసన్నిధికి తీసికొని వచ్చి చేర్చగా, భగవద్రామా నుజులుకూడా వారిని తమ చల్లని కరుణాదృక్కులతో కటాక్షించి, కూరేశులను వారు ఆశ్రయించేటట్లుగా నియమించారు. ఆ రీతిలోనే అముదనార్ కూరేశులను ఆశ్రయించి, వారివద్ద తత్త్వహితపురుషార్థాలను భ్రమ సందేహాదిదోషరహితంగా గ్రహించి, ఆత్మ- ఆత్మీయాలను ఆ ఆచార్యుల సన్నిధిలో సమర్పించి, కూరేశుల విషయంలో పరమప్రావణ్యాన్ని పొందారు. ఈ విధంగా ప్రవర్తించే సమయంలో, స్వాచార్యుల ముఖోల్లాసంకోసం తమకు ప్రాచార్యులైన భగవద్రామానుజుల విషయంలో ఒకటి, రెండు ప్రబంధాలను రచించి, వాటిని శ్రీరామానుజుల సన్నిధిలో తీసికొని వచ్చి సమర్పించగా, భగవద్రామానుజులు వానిని తెఱచి చూచి, అవి తమ మనస్సుకు

నచ్చకపోవడంవల్ల, వాటిని ప్రక్కకు గెంటివేసి, అముదనార్‌ను చూచి "ఏదయినా ప్రబంధాన్ని రచించాలనే ఉద్దేశ్యం మీకు ఉంటే మీకు ఉద్దేశ్యులైన గౌరవనీయులైన కూరేశులనుగూర్చి కాని, మాకు గౌరవనీయులైన ఆఴ్వార్లను ఉద్దేశించికాని, దివ్యదేశాలనుగూర్చికాని సంబంధం స్ఫురించేటట్లు ఏదయినా ఒక ప్రబంధాన్ని రచించండి'' అని నియమించగా, అముదనార్ "ఆవిధంగానే చేస్తాను'' అని వారి ఆజ్ఞను శిరసా వహించి, భగవద్రామానుజుల శ్రీచరణాలలో భక్తిప్రపత్తులను కలవారికి నిత్యానుసంధానం అయే రీతిలో ప్రతిపాశురంలోను **'ఇరామానుశ"** అనే తిరునామాన్ని కూర్చి నూట ఎనిమిది పాశురాలు అనుగ్రహించి (రచించి) భగవద్రామానుజుల సన్నిధికి తీసికొనివచ్చి నమస్కరించి, "దీనిని దేవరవారు కటాక్షించాలి'' అని ప్రార్థించారు. శ్రీరామానుజుల అనుమతిని పొంది కూరేశులు మొదలైన ఆచార్యులు అందఱు వేంచేసి ఉండే సభలో అముదనార్ తామే ఈ ప్రబంధాన్ని విన్నపించారు. భగవద్రామానుజులు మిగిలిన ఆచార్యులతో పాటు ఈ ప్రబంధాన్ని విని, ఆనందంతో శిరస్సు ఊగించి, చాలా తృప్తి చెంది, తమ శ్రీచరణాలలో సంబంధాన్ని కల్గినవారికి అందఱికీ ఆ ప్రబంధం అప్పటినుండి నిత్యానుసంధేయం- అయేటట్లుగా కల్పించడమేకాక, అముదనార్ వాక్కు అమృతవాక్కు అయినందువల్ల వారికి **"అముదన్"** అనే పేరు ప్రసిద్ధం అయే రీతిలో కటాక్షించారు. అందువల్ల అప్పటినుండి **"పెరియకోయిల్ నమ్బి"** అనే తిరునామం మాఱి **"తిరువరజ్గత్తముదనార్"** అనే తిరునామం వీరికి ప్రసిద్ధవ్యవహారంలోకి వచ్చింది. ఈ ప్రబంధానికి **"ప్రపన్నగాయత్రి"** అనే తిరునామంకూడా అప్పటినుండి వ్యవహరింపబడుతున్నది.

ఈ వృత్తాంతం కొద్దిపాటి మార్పుతోకూడా అనుసంధింపబడుతున్నది. అముదనార్ భగవద్రామానుజుల నియమనాన్ని పొంది ఈ ప్రబంధాన్ని రచించడం కోసం అడైయవళైన్దాన్ ప్రాకారానికి ఈవలి వైపున ఉండే ఒక మండపంలో వేంచేసి ఉండి, రచనను చేస్తూ ఉండగా, భగవద్రామానుజులు కూరేశులు, ముదలియాణ్డాన్, ఎమ్బార్ మొదలైన అంతరంగశిష్యులతో అక్కడకు వేంచేశారట. ఆ సమయానికి **"శెఴున్దిరైప్పాఱ్కడల్"** అనే నూట అయిదవ పాశురం పూర్తి అయినది. **"ఇరుప్పిడమ్ వైకున్దమ్"** అనే నూట ఆఱవ పాశురం రచించవలసిన సమయం. ఆ పాశురంనుండి చివరి మూడు పాశురాలు భగవద్రామానుజుల సమక్షంలో రచింపబడ్డాయని, తర్వాత ఈ ప్రబంధం యొక్క **"అరజ్గేఱ్ఱమ్"** (ఆవిష్కరణం) అయిన పిమ్మట, "భగవద్రామానుజుల సమక్షంలో ఈ మూడు పాశురాలు రచించినందుకు గుర్తుగా



ఈ ప్రబంధానికి మాత్రం శాఱ్ఱుముఱై పాశురాలు మూడుగా ఉండాలి'' అని కూరత్తాఴ్వాన్ నియమించారని, అందువల్లనే మిగిలిన ప్రబంధాలకు అన్నిటికి చివరి రెండు పాశురాలు సమాపన **(శాఱ్ఱు)** పాశురాలు కాగా, ఈ ప్రబంధానికిమాత్రం చివరి మూడు పాశురాలు సమాపన పాశురాలుగా ఏర్పడ్డాయని కోయిల్ కస్తూరి జీయర్ తెలిపారని శ్రీప్ర.భ. అణ్ణాస్వామి వారు తమ దివ్యార్థదీపికలో తెలిపారు.

అన్ని విధాలుగా ఈ దివ్యప్రబంధ వైభవం వాచామగోచరం. ఈ నూఱ్ఱన్దాది ప్రబంధాన్ని అభ్యసించి తెలిసినవారే శ్రీవైష్ణవులు. దీనిని ఒక్కటినిమాత్రం అభ్యసించినా చాలు, **"మీట్చి యిన్ఱి వైకున్దమానకర్ మఱ్ఱతు కైయతువే"** అనే రీతిలో పరమపదంతో పాటు అన్నీ కైవసాలు కాగలవు. ఇటువంటి వైభవాన్ని కల్గిన ఈ దివ్యప్రబంధానికి శ్రీమణవాళమహామునులు సంగ్రహంగా ఒక ప్రతిపదార్థరూపమైన టీకను, శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ కొంత విశదంగా ఒక వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఈ రెండిటిని స్పృశించి, ఇంకా కొన్ని ఆవశ్యక విషయాలను చేర్చి, అందఱికీ సులభంగా ఉండేటట్లు దాసునిచే వ్రాయబడే **"దివ్యార్థదీపిక"** అనే ఈ వ్యాఖ్యానంలోని లోటు పాట్లను గమనించకుండా గుణలేశాన్నే పెద్దలు చూచి ఆనందిస్తారని నమ్ముతున్నాను.



శ్రీమతే రామానుజాయ నమః



# ఇరామానుశ నూఱ్ఱన్దాది

## (దివ్యార్థదీపికా వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం)

### వేదప్పిరాన్ భట్టర్ అనుగ్రహించిన తనియన్

1. మున్నై వినై యకల మూఙ్గిఱ్కుడి యముదన్,
పొన్నమ్ కழుఱ్కమల ప్పోతిరణ్డుమ్, - ఎన్నుడైయ
శెన్నిక్కణియాక చ్చేర్త్తినేన్, తెన్పులత్తార్క్కు
ఎన్ను క్కడవుడైయేన్ యాన్.

మున్నై=పూర్వంచేసిన (ప్రాక్తన), వినై = కర్మలన్నీ, అకల = తొలగిపోవడంకోసం (నశించిపోవడంకోసం), మూఙ్గిల్ కుడి అముదన్ = "మూఙ్గిల్ కుడి" అనే కులంలో అవతరించిన తిరువరఙ్గత్తముదనార్‌యొక్క, పొన్ అమ్ కழల్ = బంగారువలె అందమైన, అభిలషించదగిన పాదారవిందాలను, ఇరణ్డుమ్ = రెండిటిని, ఎన్నుడైయ= నాయొక్క, శెన్నిక్కు = శిరస్సుకు, అణి ఆక = ఆభరణం అయేటట్లుగా, శేర్త్తినేన్ = చేర్చుకొన్నాను. (ధరించాను), యాన్ = ఈ విధంగా అముదనార్‌ల శ్రీచరణ పద్మాలను రెండిటిని శిరస్సుపై ధరించగల్గిన నేను, తెన్ పులత్తార్క్కు = దక్షిణ దిక్కులో ఉండేవారైన యమకింకరులకు, ఎన్నుక్కు = ఎందుకోసం, కడవు ఉడైయేన్ = (ప్రసక్తిని) ప్రాప్తిని కల్గి ఉంటాను ? (వారి వశంలో ఎందుకు ఉంటాను? ఉండను- అని భావం).

చిరకాలంగా నేను చేస్తూ వచ్చిన కర్మలు తొలగి, ఆ కర్మఫలాల అనుభవం నాకు సంభవించకుండా ఉండడంకోసం ఒక గొప్ప ఉపాయాన్ని గమనించి అనుష్ఠించాను. అది ఏమంటే- "మూఙ్గిల్ కుడి" అనే గొప్ప కులంలో అవతరించిన తిరువరంగత్తముదనార్‌యొక్క శ్రీచరణపద్మాలను నేను శిరోభూషణంగా అలంకరించుకొన్నాను. అందువల్ల నా సకలకర్మలు నిప్పులో పడిన దూదివలె రూపుమాసిపోయాయి. ఇక, యముడుకాని, యమభటులుకాని నా దగ్గరకు రావడానికి ఏప్రసక్తి లేదు- అని భావం.



(మున్నై వినై యకల చ్చేర్త్తినేన్) - అని అన్వయించాలి. "మూఙ్గిల్ కుడి"- "వేయర్ కులమ్, ఆసూరి కులమ్, కూర కులమ్" అనే రీతిలోనే "మూఙ్గిల్ కుడి" అనే ఒక కులం ఉన్నది. "అముదన్" -వీరికి (ఈ ప్రబంధకర్తకు) "పెరియ కోయిల్‌నమ్బి" అనేది పూర్వం వ్యవహరింపబడ్డ తిరునామం. వీరు అనుగ్రహించిన నూఱ్ఱన్దాదిని ఆలకించిన భగవద్రామానుజులు వీరి వాక్కు అమృతవాక్కుగా ఉన్నదని తలచి "అముదన్" అనే తిరునామాన్ని వీరికి అనుగ్రహించారు.

"కమలప్పోదు" - తామరపూవు. 'అణి' - ఆభరణం. "శేర్త్తినేన్" -చేర్చాను- అని భావం. ఈ పదంలోని "ఇన్" ఊతపదం. అవ్యయం. "ఎన్నుక్కు కడవుడైయేన్" - "ఎన్ను క్కడవుడైయేన్" సంధిలోని పూర్వపదంలో చివర గల వర్ణాలకు (క్కు) లోపం వచ్చింది. "ఎన్నుక్కు" -ఎందుకోసం ? అని భావం "ఎన్నుక్కవళైవిట్టిఙ్గు వన్దాయ్" అని కులశేఖరప్పెరుమాళ్‌కూడా ప్రయోగించారు. "కడవుడైయేన్" -"కడవు" ప్రాప్తి -అంటే సంబంధం.

2. నయమ్ తరు పేరిన్బమెల్లామ్ పழుతెన్ఱు నణ్ణినర్‌పాల్,
శయమ్ తరు కీర్త్తి యిరామానుశముని తాళిణైమేల్,
ఉయర్న్ద కుణత్తు త్తిరువరఙ్గత్తముతోఙ్గు మన్బాల్
ఇయమ్బుమ్ కలిత్తుఱై, యన్దాతి యోత ఇశై నెఞ్జమే.

నెఞ్జమే = ఓ మనసా! నయమ్ తరు =లౌకికవిషయాల చేత కల్గింపబడే (పొందే), పేర్ ఇన్బమ్ = అల్పానందాలు అన్నీ, పழుతు ఎన్ఱు = వ్యర్థాలు అని వాటిని విడచి పెట్టి, నణ్ణినర్ పాల్ = తమను ఆశ్రయించినవారికి, శయమ్ తరు కీర్త్తి = సంసారభీతిని కల్గించే కీర్తిని కలవారైన, ఇరామానుశ ముని = భగవద్రామా నుజుల, తాళ్ ఇణై మేల్ = రెండు శ్రీచరణాలపై (శ్రీచరణాల విషయంగా), ఉయర్న్ద = గొప్ప, కుణత్తు తిరువరఙ్గత్తు అముదు = గుణశాలి అయిన తిరువరఙ్గత్తముదనార్, ఓఙ్గుమ్ అన్బాల్ = పైపైకి వృద్ధిచెందే భక్తిచే, ఇయమ్బుమ్= అనుగ్రహించిన, కలి త్తుఱై అన్దాది = కట్టళైక్కలిత్తుఱై అనే ఛందస్సుతో కూర్చిన అన్దాదిని, ఓత = అధ్యయనం చేయడానికి, ఇశై = అంగీకరించు.

"విషయాంతరాల అనుభవంవల్ల కలిగే అల్పానందాలు అన్నీ క్షుద్రాలని, హేయాలని భావించి గర్హించి, వాటిలో ఆశను, ఆసక్తిని విడచి, తమను ఆశ్రయించి సేవించే మహానుభావులకు సంసారబంధాన్ని ఛేదించి మోక్షాన్ని ఇచ్చేవారు, ఇటువంటి గొప్ప వ్యాప్తమైన కీర్తిని కలవారు అయిన భగవద్రామానుజుల

విషయంగా భగవద్భాగవతభక్తి మొదలైన మహాగుణాలు నిండిన తిరువరఙ్గత్త ముదనార్ పరమభక్తి తల ఎత్తి పల్కిన నూ*ఱ్ఱ*న్దాది అనే దివ్యప్రబంధాన్ని అనుసంధించడానికి ఓ మనసా ! నీవు అంగీకరించు"- అని అంటున్నారు. సన్మార్గ-దుర్మార్గాలలో సంచరించడానికి మనస్సే మూలకారణం కనుక, ఆ మనస్సుయొక్క ఆనుకూల్యాన్ని పొందడంకోసం ఇందులో (ఈ పాశురంలో) అముదనార్ ప్రయత్నిస్తున్నారు.

**"నయమ్"** - విషయాంతరాలు. **"నాణామై నళ్ళేన్ నయమ్"** (ముదల్ తిరువన్దాది) అనే ప్రయోగంలో **"నయమ్"** అనే పదానికి విషయాంతరాలు అనే అర్థం తెలుపబడడాన్ని గమనించవచ్చు. **"పేరిన్బమ్"** -గొప్ప ఆనందం. అల్పానందం (**"శి*ఱ్ఱి*న్బమ్"**) అని అనవలసిన సందర్భంలో **"పేరిన్బమ్"** అని ప్రయోగించడం విపరీతలక్షణ ద్వారా. "నల్ల పాము" (మంచి పాము) అని అన్నట్లే ఇదికూడా. లేక, **"పేరిన్బమ్"** అనే ప్రయోగాన్ని భ్రమించినవారి అభిప్రాయానుగుణంగా పల్కుతున్నారని చెప్పవచ్చు.

**"ఆయి*ఝ్ఱై*యార్కొజ్ఞై తఙ్గుమ్ అక్కాతల*ఱ్ఱఝు*న్ది మాయు మెన్నావియై వన్దెడుత్తా నిన్ఱు"** అని పల్కిన ఈ అముదనార్వాక్కు, **"మదనకదనైః న క్లిశ్యంతే యతీశ్వరసంశ్రయాః"** అని శ్రీదేశికులు, **"కామాదిదోషహర మాత్మపదాశ్రితానామ్"** అని పెరియజీయర్ పల్కిన సూక్తులు ఈ పాశురంలోని మొదటి మూడు పాశురాలకు అనుగుణంగా అనుసంధేయం.

**"....ప*ఝు*దిన్ఱి నణ్ణినమ్పాల్"** అని **"ప*ఝు*తిన్ఱి నణ్ణినన్పాల్"** అని పాఠభేదాలు. **"శయమ్"** సందేహం. **"నావలిట్టు*ఝి* తరుకిన్ఱోమ్ నమన్దమర్తలైకళ్ మీదే"** అని మీసం మెలిసివేసి పలికేటట్లు చేస్తుంది. ఈ ప్రబంధం అన్దాది క్రమంలో రచింపబడిన ప్రబంధం కనుక, శాబ్దికమైన అన్దాది, ఆర్థికమైన అన్దాది- అనే రెండు విధాలైన అన్దాది ప్రబంధాలలో ఇది శాబ్దికమైన అన్దాది. ఈప్రబంధంలోని చివరి పాశురంలో చివరి ప్రయోగం (**"పూ మన్నవే"** అనే శబ్దసందర్భం మొదటి పాశురం ఆరంభంలోని పదంగా కూర్చడంవల్ల ఇది మణ్డల అన్దాది ప్రబంధం.

**3.** శొల్లిన్ తొకై కొణ్డునతడిప్పోతుక్కు త్తొణ్డు శెయ్యుమ్,
నల్లన్బరేత్తు మున్నామ మెల్లామ్, ఎన్దన్ నావినుళ్ళే
అల్లుమ్ పకలు మమరుమ్పడి నల్కు, అఱుశమయ
వెల్లుమ్ పరమ ఇరామానుశ ! ఇతెన్ విణ్ణప్పమే.



అఱు శమయమ్ = అప్రమాణాలైన ఆఱు మతాలను, వెల్లుమ్ = నిరసించిన, పరమ = ఆచార్యులైన, ఇరామానుశ = భగవద్రామానుజా !, ఉనతు అడి పోతుక్కు = నీ పాదారవిందాలలో, తొణ్డు శెయ్యుమ్ = వాచికకైంకర్యాన్ని చేసే, నల్ అన్బర్ = పరమభక్తులు, శొల్లిన్ తొకై కొణ్డు = శబ్దసందర్భాలను ప్రయోగించి, ఏత్తుమ్ = స్తుతిస్తున్న, ఉన్ నామమ్ ఎల్లామ్ = నీ తిరునామాలను అన్నిటిని, ఎన్తన్ నావిన్ ఉళ్ళే = నా నాలుకలో, అల్లుమ్ పకలుమ్ = ఆహో రాత్రాలు, అమరుమ్బడి = పొందికగా ఉండేటట్లు, నల్కు = కృపజేయాలి, ఇతువే= ఇంతమాత్రమే, ఎన్ విణ్ణప్పమ్ = దాసుడు చేసే విజ్ఞాపనం.

**"కూఱుమ్ శమయఙ్గళ్ ఆఱుమ్ కులైయ కువలయత్తే"** అనే రీతిలో అసారాలు, అప్రమాణాలు అయిన ఆఱు మతాలను ఖండించి ఉపకారం చేసిన ఓ స్వామీ ! దేవరవారి శ్రీచరణసన్నిధిలో **"శీల మిల్లా చ్చిఱియన్"** అన్నట్లు ఏమాత్రం శీలం లేని అల్పుణ్ణి అయిన దాసుడు చేసిన విన్నపం ఇది ఒక్కటే. అది ఏమంటే-దేవరవారి విషయంలో పరమభక్తిని కలవారు **"తఙ్గళ్ అన్బార త్తమతు శొల్ వలత్తాల్ తలైత్తలై చ్చిఱన్దు పూశిప్ప"** అనేటట్లు తమ తమ శక్తికి తగినట్లుగా శబ్దసందర్భాలను ప్రయోగించి తమ తిరునామాలను కీర్తిస్తారుకదా ! ఆ తిరునామాలు నిరంతరం నా జిహ్వపై ప్రకాశించేటట్లుగా అనుగ్రహించాలి. అది ఒక్కటే నేను చేసే ప్రార్థన- అని భావం.

**"తొకై"** -అనే పదానికి సంఖ్య అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. భగవద్రా మానుజుల విషయంగా నూట ఎనిమిది పాశురాలు కీర్తించాలి - అని ఒక సంఖ్యను మనస్సులో భావించి, భక్తిపరవశులైన అముదనార్ అనుగ్రహించిన దేవరవారి తిరునామమాల అయిన నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధం ఎల్లప్పుడు నా జిహ్వపై పొందికగా ఉండేటట్లు మీరే అనుగ్రహించాలి- అని అంటున్నారనికూడా చెప్పవచ్చు. **"ఎఙ్గళ్ కతియే ! ఇరామానుశమునియే ! శఙ్కై కెడుత్తాణ్డ తవరాశా ! పొఙ్గు పుక*ఝ్* మఙ్గైయర్కోనీన్ద మఱై యాయిరమనైత్తుమ్ తఙ్గు మనమ్ నీ ఎనక్కు త్తా"** అనే రీతిలో ప్రస్తుతసూక్తి అనుగ్రహింపబడింది.

**4.** ఇని యెన్ కుఱై నమక్కెమ్బెరుమానార్ తిరునామత్తాల్
మునితన్ద నూ*ఱ్ఱె*ట్టు చ్చావిత్తిరి యెన్నుమ్ మణ్పొరుళై
క్కలితన్ద శెఞ్జొఱ్కలిత్తుఱై యన్దాది పాడి త్తన్దాన్
పునితన్ తిరువరఙ్గత్తముదాకియ పుణ్ణియనే.

సర్వేశ్వరుడు ఆదిలో సంకల్పపూర్వకంగా జగత్తును సృష్టించి, మొదట చతుర్ముఖ బ్రహ్మకు సావిత్రీమంత్రాన్ని ఉపదేశించాడు. ఈ అముదనార్ ఆ సావిత్రియొక్క సారార్థాన్ని ఉద్ధరించి **"ఇరామానుశన్"** అనే తిరునామంతో మేళవించి, కట్టళైక్కలి త్తుఱైలో కూర్చి, తాము అనుభవించిన అనుభవంయొక్క పరీవాహరూపంగా ఈ నూ*ఱ్ఱ*న్దాదిని పాడి అనంతరకాలానికి చెందినవారమైన మనకు ఉపకారం చేశారు. ఇక మనకు ఐహికాముష్మికాలలో ఏ లోటు లేదు- అని భావం. **"తిరునామత్తాల్"** అనేచోట **"తిరుప్పెయరాల్"** అనే పాఠం ఉండి ఉంటే గణానుగుణంగా ఉంటుంది.

# ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది

## దివ్యార్థదీపికా వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం

### అవతారిక

సకలశాస్త్రాలకు సంగ్రహం అష్టాక్షరి. ఆ మంత్రంయొక్క పరమతాత్పర్యమై, ఆ*ళ్వా*రుల దివ్యప్రబంధాల సారార్థమై, శ్రీమధురకవుల సూక్తిద్వారా, అనుష్ఠానం ద్వారా ప్రకాశింపజేయబడినదై, మన పూర్వాచార్యుల ఉపదేశపరంపరచేత ప్రాప్తమై, చేతనులందఱికి అత్యంతావశ్యకమైన స్వరూప - ఉపాయ - పురుషార్థాలలో నిష్కృష్ట రూపమై, పరమరహస్యార్థమైనది చరమపర్వనిష్ఠ. ఆ నిష్ఠ ఉండే తీరును తిరువరఙ్గత్త ముదనార్‌కు భగవద్రామానుజులు తమ నిర్హేతుకకృపతో కూరేశుల శ్రీచరణాలలో తమను ఆశ్రయింపజేసి, వారిద్వారా ఉపదేశింపజేశారు. ఆ విధంగా ఉపదేశపరంపరా ప్రాప్తమైన ఆ మహార్థాన్ని అముద నార్ తాము నిత్యం భావించి, భగవద్రామానుజుల శ్రీచరణాలను అనవతరం సేవించేవారై, వారి కల్యాణగుణాలను తమ భక్తిరూపమైన ప్రేమాతిశయంయొక్క వ్యక్తీకరణరూపంగా పల్కి, అనుభవించి తీరవలసిన స్థితి తమకు కల్గినందువల్ల, చరమపర్వనిష్ఠే గొప్పది- అనే పరమార్థాన్ని చేతనులకు సులభంగా తెలియజేయాలనే కృపామూలకమైన అభిప్రాయంవల్ల తాము శ్రీరామానుజుల దివ్యగుణచేష్టితాదులను తమ ప్రేమకు తగినట్లు పలికే క్రమంలో ఆ శ్రీరామానుజుల వైభవాలను, అందఱికి తెలియజేస్తూ, పూర్వం ఆ*ళ్వా*ర్ల శ్రీచరణాలకే విధేయులైన మధురకవులు తమ చరమపర్వనిష్ఠను తెలియజేయడం ద్వారా, ఇతరులకు ఉపదేశించడంద్వారా ఉజ్జీవనానికి ఉపయుక్తమైన అర్థాన్ని లోకంలో ప్రకాశింపజేసినట్లే, వీరు కూడా ఆ రీతులతో ఆచార్యాభిమానులకు



తెలియదగిన అర్థాలను అన్నిటిని చాలా సంగ్రహంగా కాని, చాలా విస్తృతంగా కాని కాకుండా నూట ఎనిమిది పాశురాలను కల ఈ దివ్యప్రబంధంద్వారా అనుగ్రహించారు.

**1. పూమన్ను మాతు పొరున్దియ మార్బన్, పుక*ళ్* మలిన్ద**
**పామన్ను మాఱనడి పణిన్దుయ్‌న్దవన్, పల్‌కలైయోర్**
**తామ్ మన్న వన్ద ఇరామానుశన్ శరణారవిన్దమ్**
**నామ్ మన్ని వా*ళ*, నెఞ్జే! శొల్లువోమ్ అవన్ నామఙ్గళే.**

నెఞ్జే = ఓ మనసా!, పూ మన్ను మాతు = తామరపూవులో పొందికగా వేంచేసి ఉండే స్త్రీ అయిన లక్ష్మీదేవి, పొరున్దియ మార్బన్ = ఆ పూవును విడచి స్థిరంగా నిలువగల్గడానికి తగిన భోగ్యతను కల వక్షఃస్థలాన్ని కల్గిన స్వామియొక్క, పుక*ళ్* = కల్యాణగుణాలతో, మలిన్ద = నిండిన, పా = ద్రావిడపాశురాలలో (పాశురాలను అనుగ్రహించడంలో), మన్ను మాఱన్= ఊనికను (ఆసక్తిని) కల నమ్మా*ళ్వా*ర్ల యొక్క, అడి = శ్రీచరణాలను, పణిన్దు = ఆశ్రయించి, ఉయ్‌న్దవన్= ఉజ్జీవించినవారు, పల్ కలైయోర్ తామ్ = పలు పలు శాస్త్రాలను అభ్యసించిన మహాత్ములు, మన్న వన్ద = స్థిరంగా మన్నికగా ఉండేటట్లు ఈ లోకంలో అవతరించినవారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, శరణ అరవిన్దమ్ = శ్రీచరణపద్మాలను, నామ్ = మనం, మన్ని = స్థిరంగా ఆశ్రయించి, వా*ళ* = ఉజ్జీవించడంకోసం, అవన్ నామఙ్గళే = ఆ భగవద్రామానుజుల తిరునామాలను, శొల్లువోమ్ = సంకీర్తనం చేద్దాం (రా !).

"తామరపూవులో అవతరించిన పెరియపిరాట్టియార్ (లక్ష్మీదేవి) ఆ పూవును కూడా విడచి **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణంకూడా విశ్లేషించలేను) అని వచ్చి, చాలా ఆశతో నివసించే వక్షఃస్థలాన్ని కలవాడైన శ్రియఃపతియొక్క దివ్యగుణచేష్టితాలను పూర్ణంగా వర్ణించే తిరువాయ్‌మొ*ళి* మొదలైన దివ్యప్రబంధాలను అనుగ్రహించిన నమ్మా*ళ్వా*ర్ల శ్రీచరణాలను ఆశ్రయించి సేవించి సత్తను పొందినవారు, పలు పలు శాస్త్రాలను అభ్యసించినా ఉజ్జీవనోపాయంలో దృఢమైన అధ్యవసాయాన్ని (నమ్మకాన్ని) లేకుండా, సంశయవిపర్యయ జ్ఞానాన్ని పొంది తడబడేవారికి ఒక స్థిరమైన నిశ్చయజ్ఞానాన్ని కల్గించి, ఉజ్జీవింపజేయడంకోసం ఈ లోకానికి వచ్చి అవతరించినవారైన భగవద్రామానుజుల శ్రీచరణాలను మనం

ఆశ్రయించి ఉజ్జీవించేటట్లుగా వారి తిరునామాలను నోరార పల్కుదాం రా''- అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి అముదనార్ ఇందులో పల్కుతున్నారు.

గ్రంథాలన్నీ మంగళాచరణపూర్వకంగా ఆరంభించాలి అనేది సంప్రదాయం కనుక, **"పూ"** అనే పదంతో ఈ ప్రబంధాన్ని అముదనార్ ప్రారంభించారు. ఈ పదం, తిరుచ్ఛందవిరుత్తంలో శబ్దశక్తితోమాత్రం మంగళవాచకం; ఇక్కడ అర్థశక్తితో కూడా మంగళవాచకమనే విశేషాన్ని గ్రహించాలి. తిరుచ్ఛన్దవిరుత్తంలో **"పూ"** అంటే భూమి (భూ అనే పదం యొక్క వికృతి).

శ్రీరామానుజులకు అతిశయాన్ని కల్గించే వైభవాలు పలు వేలు ఉన్నా, ఆళ్వార్ల శ్రీచరణాలలోని తమకు కల ప్రావణ్యాన్నే వారు తమకు గొప్ప వైభవంగా అధ్యవసించారు (విశ్వసించారు) కనుక, వారి ఆ అధ్యవసాయానికి అనుగుణంగా **"మాఱన్ అడి పణిన్దు ఉయ్న్దవన్"** అనే విశేషణం ప్రయోగింపబడింది. దీనిని అనుసరిస్తూ శ్రీవరవరమునులు- **"శ్రీమాధవాంఘ్రిజలజద్వయనిత్యసేవా ప్రేమావిలాశయపరాంకుశపాదభక్తమ్"** అని యతిరాజవింశతి ఆరంభంలో ప్రయోగించారు.

**"పామన్ను మాఱన్"** -ఆళ్వార్లు తాము అనుగ్రహించిన పాశురాల మాధుర్యాన్ని చూచి తాము వాటిలో చాలా ఊనికను కలవారని భావం. **"తన్ శీర్ యాన్ కర్రు మొழிపట్టోడుమ్ కవియుముత నుకర్చ్చి యుఱుమో ముழுతుమే"** అని, **"తొణ్డక్కుముదుణ్ణ చ్చొన్ మాలైకళ్ శొన్నేన్"**అని, **"కేట్టు ఆరార్ వానవర్కళ్ శెవిక్కినియ శెఞ్జొల్లే"** అని తామే స్వయంగా పలికారుకదా ! **"మాఱన్"** -ఆళ్వార్లు అవతరించినప్పటినుండి ఏడవడం, పాలు తాగడం మొదలైన లోకరీతిలోని ప్రవర్తనలు ఏమీ లేకుండా తద్భిన్నంగా ఉన్నందువల్ల, వీరికి **"మాఱన్"** అనే పేరు కల్గింది. బలమైన కర్మలకు మాఱుగా ఉన్నందువల్ల, అన్యమతస్థులను అణచి, వారికి శత్రువై (నిరసించినవారై) ఉన్నందువల్ల, పాండ్యదేశంలో ప్రధానులై అవతరించినందువల్ల ఈ పేరు వచ్చిందనికూడా అంటారు.

**"పల్కలైయోర్తామ్ మన్న"** -నానాశాస్త్రాలను అధ్యయనం చేసి, సమర్థులైన కూరేశులు, ముదలియాణ్డాన్, ఎమ్బార్ మొదలైన మహాత్ములు సుప్రతిష్ఠితులు అయేటట్లు- అనికూడా భావం. శ్రీరామానుజుల చరణారవిందప్రాప్తికి సాధనం- వారి తిరునామసంకీర్తనమే అనేది ఈ పాశురంవల్ల వ్యక్తమైనది.



2. **కళ్ళార్ పొழிల్ తెన్నరఙ్గన్, కమలప్పతఙ్గళ్ నెఞ్జిల్**
**కొళ్ళా మనిశరై నీఙ్గి, క్కుఱైయల్ పిరానడిక్కీழ்**
**విళ్ళాత వన్బనిరామానుశన్ మిక్క శీల మల్లాల్**
**ఉళ్ళాతెన్నెఞ్జు, ఒన్ఱఱియేన్ ఎనక్కుర్ర పేరియల్వే**

కళ్ ఆర్ పొழிల్ = తేనె నిండిన పూదోటలను కల, తెన్ అరఙ్గన్ = దక్షిణ దేశంలోని శ్రీరంగంలో పరుండి ఉండే శ్రీరంగనాథుని, కమలమ్ పతఙ్గళ్= తామరలవంటి శ్రీచరణాలను, నెఞ్జిల్ = తమ మనస్సులో, కొళ్ళా = గ్రహించని, మనిశరై = మానవులను, నీఙ్గి = విడచిపెట్టి, కుఱైయల్ పిరాన్ = తిరుమంగై ఆళ్వార్ల, అడి క్కీழ் = శ్రీచరణాలలో, విళ్ళాత = ఏనాడూ విడువని, అన్బన్ = భక్తిని కలవారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, మిక్క శీలమ్ అల్లాల్ = గొప్ప శీలాన్ని తప్ప, ఒన్ఱు = వేఱు దేనినీ, ఎన్ నెఞ్జు =నా మనస్సు, ఉళ్ళాతు = భావించదు, (ఈవిధంగా), ఎనక్కు ఉర్ర = నాకు సిద్ధించిన, పేర్ = ఒక గొప్ప, ఇయల్వు = స్వభావానికి, ఒన్ఱు = ఏకారణాన్ని, అఱియేన్ = తెలియలేను.

**"నెఞ్జే ! శొల్లువోమ్ అవన్ నామఙ్గళే"** (ఓ మనసా ! అతని తిరునామాలను అనుసంధానం చేద్దాం) అని అనగానే నా హృదయం ఆ రామానుజుల శీలంలో ఆసక్తిని పొందిన ఆశ్చర్యాన్ని ఏమని చెప్పను ?'' అని అంటూ అముదనార్ విస్మయాన్ని చెందుతున్నారు'' శ్రీరంగనాథుని శ్రీచరణాపద్మాలను మనస్సుతో కూడా భావించని పాపిష్ఠివారితో చిరకాలం సహవాసాన్ని చేసిన నా మనస్సు ఈ నాడు ఆ పాపులతో గల సంబంధాన్ని తెంచుకొని, తిరుమంగై ఆళ్వార్ల శ్రీచరణాలనే అనవరతం సేవించేవారైన భగవద్రామానుజుల గొప్ప శీలగుణాన్ని ఒక్కటినే చింతిస్తున్నది. అటువంటి ఒక గొప్పతనం నాకు కలగడానికి కారణం ఆ శ్రీరామానుజుల నిర్హేతుక కటాక్షమే తప్ప వేఱొకటి ఉన్నదని నేను భావించను- అని భావం.

శ్రీరామానుజులకు నమ్మాళ్వార్ల శ్రీచరణాలలో భక్తి ఉండే తీరునుగూర్చి అముదనార్ మొదటి పాశురంలో ప్రస్తావించారు. **"మాఱన్ పణిత్త తమిழ்మఱైక్కు మఱైయర్ కోన్ అఱఙ్గమ్ కూఱ అవతరిత్త"** అనే రీతిలో ఆళ్వార్ల తమిళవేదానికి అంగభూతాలుగా ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించిన తిరుమఙ్గైయాళ్వార్ శ్రీచరణాలలో శ్రీరామానుజులకు కల ప్రావణ్యాన్నిగూర్చి ఇందులో పల్కుతున్నారు. తిరుమఙ్గై ఆళ్వార్ల అవతారస్థలానికి **"తిరుక్కుఱైయలూర్"** అని పేరు. **"మణ్ణియిల్**

నీర్ తేఙ్గుమ్ కుఱైయలూర్ శీర్ కలియన్ తోన్టియ ఊర్" అని ఉపదేశరత్తినమాలై సూక్తి. **"కుఱైయల్‌పిరాన్ అడిక్కీఴ్ విళ్ళాత అన్బన్"** -అనే విశేషణం సార్థకం అయేటట్లుగా తిరువారి తిరునగరి దివ్యదేశంలో వేంచేసి ఉండే తిరుమఙ్గై మన్నన్ అర్చామూర్తి పాదారవిందాల కిందిభాగంలో భగవద్రామానుజుల అర్చారూపం వేంచేపు చేయబడి ఉండడాన్ని ఇప్పటికీ గమనించవచ్చు.

**"శీలమ్"**- మహానుభావుడు మందమతులతో కూడా భేదం ఏమీ చూప కుండా కలసి వర్తించడానికి శీలగుణమని పేరు. భగవద్రామానుజులు మహాత్ములైనా తమను ఒక నీచునిగా భావించిన ఈ అముదనార్ తమతో కలసి వర్తించే మహాగుణానికి జితులై పలికే సూక్తి ఇది. **"ఉళ్ళుతల్"** - చింతించడం. **"పేరియల్‌వు"** అనే పదాన్ని షష్ఠీవిభక్త్యంతరూపంగాకూడా గ్రహించవచ్చు; ప్రథమావిభక్త్యంత రూపంగాను గ్రహించవచ్చు. "ఇది నాకు సిద్ధించిన గొప్ప ఉపాయం'' అనికూడా భావం. **"ఒన్టు"** అనే పదాన్ని కాకాక్షిన్యాయంలో ముందు వెనుకలలో అన్వయించ వచ్చు; **"మిక్క శీల మల్లాల్ ఒన్టు ఉళ్ళాతు, ఎనక్కుఱ్ఱ పేరియల్‌వు ఒన్టు అటియేన్"** అని.

3. **పేరియల్ నెఞ్జే! అడిపణిన్దేనున్నై, ప్పేయ్‌ప్పిఱవి**
**ప్పూరియరోడుళ్ళ శుఱ్ఱమ్ పులర్‌ఱ్ఱి, ప్పొరువరుమ్ శీర్**
**ఆరియన్ శెమ్మై యిరామానుశమునిక్కు అన్బుశెయ్యుమ్**
**శీరియ పేఱుడైయార్, అడిక్కీఴ్ ఎన్నై చ్చేర్‌త్తదఱ్కే.**

పేర్ ఇయల్ = మిక్కిలి గంభీరమైన, నెఞ్జే = ఓ మనసా !, ఉన్నై అడి పణిన్దేన్ = నిన్ను ప్రణమిల్లుతున్నాను (నన్ను సేవించడం ఎందుకోసం ? అని అంటే), పేయ్ పిఱవి = ఆసురజన్మను కలవారైన, పూరియరోడు ఉళ్ళ = నీచులతో (నాకు) ఉన్న, శుఱ్ఱమ్ = చుట్టరికాన్ని (సంబంధాన్ని) పులర్త్తి = పోగొట్టుకొని, పొరువు అరుమ్ శీర్ = సాటి లేని గుణాలను కలవారు, ఆరియన్ = (ఆచార్యులు) గొప్ప అనుష్ఠానాన్ని కలవారు, శెమ్మై = (ఆశ్రితులలో) వర్తించడంలో ఋజు స్వభావాన్ని కలవారైన, ఇరామానుశమునిక్కు = భగవద్రామానుజులపట్ల, అన్బు శెయ్యుమ్ = భక్తిని కల్గి ఉండడమే, శీరియ పేర్ ఉడైయార్ = పరమపురుషార్థంగా ఉండేవారైన కూరత్తాழ்వాన్ మొదలైనవారి, అడిక్కీఴ్ = శ్రీచరణాలకింద, ఎన్నై = (పరమనీచుడను అయిన) నన్ను, శేర్‌త్తదఱ్కే = తీసికొనివచ్చిన మహోపకారానికే (నీకు ప్రణమిల్లుతున్నాను).



**"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"** అనే రీతిలో మంచి చెడ్డలకు మూలకారణం మనస్సే కనుక, **"నెఞ్జే! శొల్లువోమ్ అవన్ నామఙ్గళే"** అనే ఆశకు ఆ మనస్సు అంగీకరించి, తమ అభీష్టానుగుణంగా వర్తించినందువల్ల కల్గిన సంతోషంచేత ఆ తమ మనస్సుకు నమస్కరిస్తున్నట్లు అముదనార్ ఇందులో పల్కుతున్నారు. ఈ విధంగా మనస్సును తనకంటే వేఱు చేసి పల్కడం కవిసమయానికి చెందిన ఒక విధమైన వాక్చమత్కృతి. "ఆసురప్రకృతిని కలవారైన నీచులతో నాకున్న సంస్కారాన్ని పోగొట్టుకొని, సాటి లేని గుణశాలి అయిన భగవద్రామానుజుల శ్రీచరణాలలో ప్రావణ్యమనే పరమపురుషార్థాన్ని పొందిన కూరేశులవంటివారి శ్రీచరణాల మోల నన్ను కొనిపోయి చేర్చిన ఓ మనసా!, ఈ మహోపకారాన్ని చేసిన నీకు నేను ఏమి ప్రత్యుపకారాన్ని చేయగలను ? **"తలైయల్లాల్ కైమ్మాఱు ఇలేన్"** అనే రీతిలో నీకు శిరసా అభివాదం చేయడంతప్ప వేఱొక ప్రత్యుపకారాన్ని నేను చేయలేను''- అని అన్నట్లయినది.

**"పూరియర్"** -నీచజన్మను కలవారు. **"పులర్‌త్తుతల్"** -ఎండగట్టడం. అంటే- పోగొట్టుకోవడం. **"పొరువు"**- ఒప్పు. **"ఆరియన్"**- **"కర్తవ్య మాచరన్ కామ మకర్తవ్య మనాచరన్, తిష్ఠతి ప్రకృతాచారే స తు ఆర్య ఇతి స్మృతః"** అని ఆర్యశబ్ద నిర్వచనం. **"శెమ్మై యిరామానుశముని"** -ఋజుత్వాన్ని కల్గిన భగవద్రామానుజముని అని అర్థం. **"శెమ్మై"** గుణం సంస్కృతంలో ఆర్జవగుణం అని అనబడుతుంది. అంటే - ఋజువుగా ఉండే స్వభావం. దీనికి విరుద్ధమైన గుణం కౌటిల్య మనబడుతుంది. ఒకడు ఇంకొకనిని చూచి - "నాయనా ! నీది ఏ ఊరు ?'' అని అంటే, "నేనిపుడు ఉన్నది ఈ ఊరు'' అని ఈ రీతిలో వంకరగా బదులివ్వడం కౌటిల్యగుణకార్యం. ఉన్నది ఉన్నట్లు పల్కడం, చెప్పినట్లు చేయడం ఋజుత్వగుణకార్యం. శ్రీరామ చంద్రుడు పంచవటిలో వేంచేసి ఉన్నపుడు శూర్పణఖ అక్కడకు వచ్చి **"ఆగత స్త్వ మిమం దేశం కథం రాక్షససేవితమ్, కిమాగమన కృత్యం తత్త్వ మాఖ్యాతు మర్హసి"** - రాక్షసులు నివసించే ఈ ప్రదేశానికి నీవు ఏవిధంగా వచ్చావు? వచ్చిన కారణమేమి?'' అని ప్రశ్నించగా, దానికి శ్రీరాముడు కుటిలంగా సమాధానం చెప్పి ఉండవచ్చు; కాని, ఋజువుగా సమాధానాన్ని చెప్పాడు. ఆ సందర్భంలో వాల్మీకి భగవానుడు- **"ఋజుబుద్ధితయా సర్వ మాఖ్యాతు ముపచక్రమే"** అని అన్నాడు. ఇదే ఆర్జవగుణం.

**"ఇరామానుశమునిక్కన్బు శెయ్యుమ్ శీరియ పేఱుడైయార్"** అనే ప్రయోగం శ్రీరామానుజ భక్తులను అందఱిని ఉద్దేశించి పల్కబడిందని కాని, కూరేశులను ఉద్దేశించి పల్కబడిందని కాని అనడం ఒప్పుతుంది.

**4. ఎన్నై ప్పువియిల్ ఒరుపొరుళాక్కి, మరుళ్ శురన్ద**
**మున్నై ప్పులవినై వేరఱుత్తు, ఊ*ళ్గి*ముతల్వనైయే**
**పన్న ప్పణిత్త ఇరామానుశన్ పరన్ పాతము మెన్**
**శెన్ని త్తరిక్క వైత్తాన్, ఎనక్కేతుమ్ శితైవిల్లైయే.**

ఊ*ళ్గి* ముతల్వనైయే = కాలం మొదలైన సకలపదార్థాలకు కారణభూతుడైన భగవానుని, పన్న = (అందఱు వివేకించి) అనుసంధించేటట్లు, పణిత్త = (శ్రీభాష్యరచనపూర్వకంగా) అనుగ్రహించిన, పరన్ ఇరామానుశన్ = సర్వోత్కృష్టులైన భగవద్రామానుజులు, పువియిల్ = ఈ భూమిలో, ఎన్నై = (అపదార్థంగా ఉన్న) నన్ను, పొరుళ్ ఆక్కి = ఒక పదార్థంగా చేసి, మరుళ్ శురన్ద = అజ్ఞానమూలకంగా కల్గిన, మున్నై ప*ళ్గ* వినై = చాలా అనాదియైన ప్రాక్తనకర్మలను, వేర్ అఱుత్తు = సమూలంగా పోగొట్టి, పాతముమ్ = తమ శ్రీచరణాలను కూడా, ఎన్ శెన్ని = నా శిరస్సుపై, తరిక్క వైత్తాన్ = నేను ఆనందించి ధరించేటట్లుగా పెట్టారు. (ఇంతటి మహాప్రసాదాన్ని పొందిన తరువాత), ఎనక్కు = దాసునకు, ఏతుమ్ శితైవు ఇల్లై = ఏవిధమైన హాని ఇక కలిగే అవకాశం లేదు.

భగవద్రామానుజుల నిర్హేతుకకటాక్షానికి లక్ష్యం అయిన నేను ఇక ఏనాడూ ఏవిధమైన హానిని పొందను- అని ఇందులో అముదనార్ అంటున్నారు. పదార్థకోటిలోకి చేరకుండా (అస్తిత్వాన్ని లేకుండా) తుచ్ఛుడనై ఉండే నా కర్మలను అన్నిటిని సమూలంగా తొలగించి, తమ పాదారవిందాలను నా తలపై భగవద్రామానుజులు పెట్టారు. ఈ మహాఫలాన్ని పొందిన నాకు ఇక ఏకొఱత లేదు- అని భావం.

**"మరుళ్ శురన్ద"**- అజ్ఞానంవల్ల చేయబడినవి -అని భావం. అజ్ఞానంచేత పెల్లుబికిన - అని భావం. (**"శురన్ద"** -పెల్లుబికిన). **"ఊ*ళ్గి*ముతల్వనైయే పన్న ప్పణిత్త"**- కాలాది సకలపదార్థాలకు నిర్వాహకుడైన భగవానునే కీర్తించేటట్లుగా అముదనార్ అయిన తమను చేసిన- అని అర్థం కాదు. భగవద్విముఖులై ఉన్నవారిని అందఱిని ఉపదేశాదిరూపంతో భగవత్ప్రావణ్యాన్ని కల్గి ఉండేటట్లుగా చేసినవారని సాధారణంగా చెప్పిన తీరు ఇది. **"ఊ*ళ్గి* ముతల్వన్"**- ప్రళయకాలంలో ఆదిదేవుడై ఉన్నవాడనికూడా భావం.

**"పరన్"** అనే పదాన్ని భగవద్రామానుజులకు విశేషణంగా చేయకుండా నిర్వహించే తీరుకూడా ఉన్నది. అది ఏమంటే -**"పరన్"** అనే పదం పరమపురుషుడైన భగవానుని నిర్దేశిస్తున్నదని పల్కి, అతని శ్రీచరణాలను నా శిరస్సుపై పెట్టారు



అనికూడా భావాన్ని చెప్పవచ్చు. **"పరన్ పాద మెన శెన్ని త్తరిక్కవైత్తాన్"** అని కూడా ఒక పాఠం ఉన్నది. ("ఎన" -నాయొక్క)

**5. ఎనక్కు*ఱ్ఱ* శెల్వ మిరామానుశ నెన్ఱు, ఇశైయ కిల్లా**
**మనక్కు*ఱ్ఱ* మాన్దర్ ప*ళ్గి*క్కిల్ పుక*ళ్గ్*, అవన్ మన్నియ శీర్**
**తనక్కు*ఱ్ఱ*వన్బరవన్ తిరునామజ్గళ్ శా*ఱ్ఱు*మెన్బా**
**ఇనక్కు*ఱ్ఱ*మ్ కాణకిల్లార్, పత్తియేయ్న్ద ఇయల్వితెన్ఱే.**

ఎనక్కు ఉ*ఱ్ఱ* శెల్వమ్ = నాకు ప్రాప్తమైన సంపద, ఇరామానుశన్ ఎన్ఱు= భగవద్రామానుజులే అని, ఇశైయ కిల్లా = అంగీకరించలేని, మనక్కు*ఱ్ఱ*మ్ మాన్దర్= దుష్టమైన హృదయాన్ని కల మానవులు (మందబుద్ధులు), ప*ళ్గి*క్కిల్ = (ఈ కృతిని) నిందించిన వారైతే, పుక*ళ్గ్* = (అటువంటివారి నిందయే దీనికి) పొగడ్త అవుతుంది, అవన్ = ఆ శ్రీరామానుజుల, మన్నియ శీర్ తనక్కు = నిత్యసిద్ధమైన గుణాలకు, ఉ*ఱ్ఱ* = తగిన, అన్బర్ = భక్తిని కలవారైన మహాత్ములు, పత్తి ఎయ్న్ద ఇయల్వితు ఎన్ఱు = (ఈ గ్రంథం) భక్తితో కూడిన ప్రవృత్తిని కల్గినదని భావించి, అవన్ తిరు నామజ్గళ్ = ఆ శ్రీరామానుజుల కల్యాణగుణాలనుగూర్చి, శా*ఱ్ఱు*మ్ ఎన్ పా ఇనమ్ = (కీర్తించే) పలికే నా పాశురమాలికలలో ఉండే, కు*ఱ్ఱ*మ్ = దోషాలను, కాణకిల్లార్ = చూడలేరు.

లోకంలో ఏదైనా ఒక కృతి రచింపబడితే దానిని దూషించేవారు ఎక్కువమంది, పొగడేవారు తక్కువమంది ఉండడం సహజం. నిజానికి దోషాలు లేకపోయినా, ఏదో ఒక దోషాన్ని ఆరోపించి నిందించి తీరుతారు. నిజంగా దోషాలు కనుక ఉన్నట్లయితే ఇక దూషించేవారి ఉత్సాహాన్నిగూర్చి అడుగవలసిన పనిలేదు. జ్ఞానశూన్యుడనైన నేను రచించే ఈ కృతిలో దోషాలు చాలా ఎక్కువగానే ఉంటాయి. వాటిని చూచి అందఱు నిందిస్తారే ! అని తామే శంకిస్తూ, దానికి సమాధానాన్నికూడా తామే ఇందులో అముదనార్ అనుగ్రహిస్తున్నారు. భగవద్రామానుజులనే సర్వస్వంగా భావించే మహాత్ములు ఈ కృతిని కటాక్షిస్తే, నా పల్కులలో ఉండే దోషాలలో వారు దృష్టి పెట్టకుండా "ఆహా ! భక్త్యతిశయం అంతరంగంలో ఇముడలేక వెలువడిన శబ్దసందర్భంకదా ఇది'' అని ఆనందిస్తారు. ఎందుకు? అని అంటే, వారు భగవద్రామానుజుల కల్యాణగుణాలలో నిజంగానే అభినివేశాన్ని పొందినవారు కనుక, వారి తిరునామాలను వర్ణించడంకోసం పుట్టిన కృతి ఎటువంటి స్వభావాన్ని కల్గినది అయినా గ్రంథకర్తయొక్క హృదయ

పరిపాకాన్ని ఒక్కదానిని మాత్రమే గమనించి, **"పిత్తర్ శొన్నవుమ్ పేతైయర్ శొన్నవుమ్ పత్తర్ శొన్నవుమ్ పన్నప్పెఱుపవో?"** అని తలచి భక్తిని చూచి సంతోష పడతారు. భగవద్రామానుజులపట్ల అటువంటి భక్తి - (అంటే -వారే మనకు సర్వస్వం- అనే నమ్మకం) లేని కల్మషబుద్ధులైన మానవులు గుణాలను తెలియలేని, కేవలం దోషైకదృక్కులు కనుక, ఏవైనా లేని దోషాలను ఆరోపించిగాని, ఉన్న చిన్న దోషాలను పెద్దవిగా చేసి చెప్పిగాని నిందిస్తే, వారి దూషణాలు మనకు భూషణాలే- అని అంటున్నారు. **"అలకైములైశువైత్తాఱ్కక్కన్బరడి క్కన్బర్, తిలత మెన త్తిరివార్తమ్మై, ఉలకర్ పఴి తూఱ్ఱిల్ తుతియాకుమ్"** అని అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్కూడా అన్నారు కదా!

ఇక్కడ ఒక సందేహం కలిగే అవకాశం ఉన్నది. "ఇతరుల నింద మనకు అప్రయోజకమ్'' (ఇతరుల నిందతో మనకు పనిలేదు) అని చెప్పవలసి ఉండగా, వారి నిందే మనకు పొగడ్త- అని అనడంలో ఉద్దేశ్యం ఏమి? వారి నింద వీరికి ఏ విధంగా పొగడ్త అవుతుంది? అని కొందరు శంకించవచ్చు. వారికి తెలియజెప్పేది ఏమంటే? - నిందించేవారు ఏమని నిందిస్తారు? అని ఆలోచిస్తే, **"అముతనార్"** అనే ఒకరున్నారట. ఆయన **ఇరామానుశనూఱ్ఱన్దాది** అనే ఒక ప్రబంధం రచించారట. అందులోని ఒక్కొక్క పాశురంలోను భగవద్రామానుజులు, భగవద్రామానుజులు- అని పల్కిన మాటనే పల్కుతున్నారట. అంతేకాక, శాస్త్రాలలో పురుషార్థంగా చెప్పబడిన ఐశ్వర్యం మొదలైనవానిని నిందిస్తున్నారట. సకల పురుషార్థాలు తమకు భగవద్రామానుజులేనట. భగవానునికూడా వారు కన్నెత్తికూడా చూడరట''- అని ఈ రీతిలో కొన్ని సంగతులను పల్కుతూ నిందిస్తారు. వాస్తవానికి ఇవి అన్నీ గుణాలే కనుక గుణకీర్తనంలోకే చేరి, పొగడ్తగా పర్యవసించడంలో ఏ కొఱత లేదు- అని భావం. భగవానుని నిందించిన శిశు పాలాదులుకూడా ఇంకొక రీతిలో (వ్యతిరేక ముఖంగా) గుణకీర్తనం చేసినవారైకదా ఉజ్జీవించారు. **"కఱ్ఱినమ్ మేయ్క్కలుమ్ మేయ్క్కప్పెఱ్ఱాన్ కాడువాఴ్ శాదియు మాకప్పెఱ్ఱాన్, పఱ్ఱియురు విడైయాప్పు ముణ్డాన్"** అని పాపులు నిందించడం అంతా భక్తిని కలవారికి గుణ కీర్తనమవుతున్నది కదా ! పెరియతిరుమొఴిలో **"మాన మరు మెన్నోక్కి"** అనే తిరుమొఴిలో (నిపాశురాలలో) దూషణపరంగా పలికే ఉత్తరార్ధభాగాలను గమనించి తెలియవచ్చు. **"ఊరవర్కవ్వై ఎరువిట్టు"** అనే తిరువాయ్మొఴి యొక్క అంతరార్థం నిశితంగా గమనించాలి.



ఉత్తమాధికారుల అధ్యవసాయం అంతా సామాన్యజ్ఞానం కలవారికి నిందాపాత్రం అవుతుందని సారార్థం.

**"పత్తి యేయ్న్ద ఇయలిదెన్టే"** అనే పాఠాంతరం ఉన్నది. "ఇది భక్తిపూర్ణమైన సూక్తి'' -అని భావం. **"ఇయల్"** - అంటే పలుకు (సూక్తి).

**6. ఇయలుమ్ పొరుళు మిశైయ త్తొడుత్తు, ఈన్కవికళన్బాల్**
**మయల్ కొణ్డు వాఴ్త్తు మిరామానుశనై, మతి యిన్మైయాల్**
**పయిలుమ్ కవికళిల్ పత్తి యిల్లాత ఎన్ పావినెఞ్జాల్**
**ముయల్కిన్డనన్, అవన్దన్ పెరుఞ్కీర్త్తి మొఴిన్దిడవే.**

ఈన్ కవికళ్ = విలక్షణులైన కవులు, అన్బాల్ = ప్రీతితో, ఇయలుమ్ పొరుళుమ్ = శబ్దం, అర్థం, ఇశైయ = చక్కగా పొందికగా ఉండేటట్లు, తొడుత్తు= కవిత్వాన్ని చెప్పి (కూర్చి), మయల్ కొణ్డు = వ్యామోహం తల ఎత్తి, వాఴ్త్తుమ్= స్తుతించేటట్లుగా ఉండే, ఇరామానుశనై = భగవద్రామానుజులను, పయిలుమ్ = వర్ణించే, కవికళిల్ = పాశురాలలో, పత్తి ఇల్లాత = భక్తి లేని, ఎన్ పావి నెఞ్జాల్ = నా పాపిష్ఠి మనస్సుతో, అవన్తన్ = ఆ శ్రీరామానుజుల, పెరు కీర్త్తి = అంతు లేని గొప్ప కీర్తినిగూర్చి, మొఴిన్దిడ = పలుకడానికి, మతి = బుద్ధి, ఇన్మైయాల్ = లేనందువల్ల, ముయల్కిన్డనన్ = ప్రయత్నిస్తున్నాను.

**"పత్తియేయ్న్ద ఇయల్విదెన్టే"** అని గడచిన పాశురంలో పల్కిన అముదనార్, అటువంటి భక్తి తమకు ఉన్నదా ? అని పరిశీలించి చూచారు. ఆ విషయానికి తగిన భక్తి తమకు లేదని తెలిసికొన్నారు. "అయ్యో ! మనమా ఆ శ్రీరామానుజులకు స్తుతించాలని ప్రయత్నించినది !'' అని తమను తామే గర్హించుకొంటున్నారు ఇందులో. **"ఇన్కవి పాడుమ్ పరమకవికళ్"** (మధురమైన కవిత్వాన్ని చెప్పే గొప్ప కవులు) అయిన కొంతమంది మహాత్ములు శబ్దమాధుర్యం, అర్థగాంభీర్యం చక్కగా కల్గి ఉండేటట్లు కవిత్వాన్ని రచించి, ఆంతరమైన భక్తితో వ్యామోహాన్ని పొంది శ్రీరామానుజులకు మంగళాశాసనం చేస్తారు. అటువంటి మహనీయుల భక్తిపరీవాహరూపమైన కవిత్వాలలో ఆదరం లేని పాపిష్ఠిమనస్సుతో ఆ భగవద్రామా నుజుల మిక్కిలి గొప్ప కీర్తిని అంతటినీ కీర్తించడంకోసం నేను ప్రయత్నంచేస్తున్నానే! ఇది ఏమి నా బుద్ధిహీనత !- అని అంటూ తమను చూచి తామే నొచ్చు కొంటున్నారు.

"కవికళ్.... వాళ్త్తు మిరామానుశనై" - కవులచే మంగళాచరణం చేయబడే శ్రీరామానుజులను- అని భావం. "మయల్" అని అన్నా, "మైయల్" అని అన్నా పొసగుతుంది. వ్యామోహమని అర్థం. జ్ఞానహీనత- అని భావం. మంగళాశాసనాన్ని చేసేటపుడు జ్ఞానం కోల్పోయి ఉండాలికదా ! జ్ఞానం యథాతథంగా ఉన్నట్లయితే "వాళ్ి, పల్లాణ్డు, జయ విజయీభవ" ఇత్యాది శబ్దాలు నోటినుండి వెలువడే అవకాశం లేదుకదా !'' "మతియిన్మైయాల్" అనే ప్రయోగాన్ని నాల్గవ పాదంలో అన్వయించాలి. "మతి" -ఇది సంస్కృతపదం. "ఇన్మై" -రాహిత్యం.

7. మొళ్ియై క్కడక్కుమ్ పెరుమ్ పుకళ్ాన్, వఞ్జ ముక్కుఱుమ్బామ్
కుళ్ియై క్కడత్తుమ్ నమ్కూరత్తాళ్వాన్ శరణ్ కూడియ పిన్,
పళ్ియై క్కడత్తు మిరామానుశన్ పుకళ్ పాడియల్లా
వళ్ియై క్కడత్తల్, ఎనక్కిని యాతుమ్ వరుత్త మన్టే.

మొళ్ియై కడక్కుమ్ = వాక్కులతో వర్ణించడానికి సాధ్యం కాని రీతిలో వాచామగోచరమైన, పెరు పుకళ్ాన్ = గొప్ప కీర్తిని కలవారు, ముక్కుఱుమ్బు ఆమ్ = విద్యామదం, సంపన్మదం, ఆభిజాత్యమదం- అనే, కుళ్ియై = (మూడు విధాలైన) గోతులలో పడకుండా, కడక్కుమ్ =(వాటిని) దాటినవారు, నమ్ =మనకు నాథులు అయిన, కూరత్తు ఆళ్వాన్ = కూరేశుల, శరణ్ = శ్రీచరణాలను, కూడియ పిన్ = నేను ఆశ్రయించిన తరువాత, పళ్ియై కడత్తుమ్ = సర్వపాపనివర్తకులైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, పుకళ్ పాడి = కల్యాణగుణాలను పాడి, అల్లా వళ్ియై = స్వరూపానికి తగని చెడ్డదారులనుండి, కడత్తల్ = తప్పి, బ్రతికి బయటపడడం అనేది, ఎనక్కు = దాసుడనైన నాకు, ఇని = ఇకపైగల కాలం అంతా, యాతుమ్ వరుత్తమ్ అన్టు = కొంచెంకూడా అసాధ్యం కాదు.

భగవద్రామానుజులను స్తుతించడానికి తాము యోగ్యతను కలవారం కాము - అని వెనుకంజ వేయాలని చూచిన అముదనార్, తమకు ఆళ్వాన్ శ్రీచరణాలతో గల సంబంధాన్ని తలచి, ఆ సంబంధం ఉన్నపుడు నాకు అసాధ్యం అయినది ఏదీ లేదు- అనే నిశ్చయాన్ని పొందుతున్నారు. "వాచామగోచర మహాగుణ దేశికాగ్ర్యకూరాధినాథ" అనే రీతిలో వాక్కుతో వర్ణించడానికి సాధ్యం కాని రీతిలోని గొప్ప కీర్తిని పొందినవారు, విద్య, ధనం, కులం - అనే మూడు విధాలైన సంపదలను మిక్కుటంగా కలవారైనా, వాటివల్ల ఈషత్తు అయినా అహంకారాన్ని పొందనివారు అయిన కూరేశుల చరణారవిందాలను ఆశ్రయించి కృతకృత్యుణ్ణి అయిన నాకు



భగవద్రామానుజుల కల్యాణగుణాలను పాడడం (కీర్తించడం), ఆ కారణంగా అర్చిరాదిగతిని తప్ప మిగిలిన గతులలో పోకుండా, ఆ గతిలోనే పయనించడం చాలా సులభమైనది -అని అన్నట్లయినది.

మన పూర్వాచార్యులు అందఱు గొప్ప కీర్తిని కలవారే అయినా, వారి అందరిలో కూరేశుల కీర్తి చాలా విలక్షణమైనది- అనేది ప్రసిద్ధమైన విషయం. మన దర్శనానికి గొప్ప ద్రోహానికి ఒడిగట్టిన నాలూరాన్‌కు క్రూరనరకాలను ఇవ్వాలని భగవత్సన్నిధిలో ప్రార్థించవలసి ఉండగా, "పేరరుళాళన్ (వరదరాజస్వామి) సన్నిధిలో వరదరాజస్తవాన్ని విన్నపించి నేత్రాలను పొందాలనే వరాన్ని ప్రార్థించండి'' అనే స్వాచార్యనియమనాన్ని సైతం అతిక్రమించి, "నాన్ పెఱ్ఱ పేఱు నాలూరానుమ్ పెఱవేణుమ్" (నేను పొందిన ఫలం నాలూరాన్ కూడా పొందాలి) అని వరాన్ని వేడి పొందే విశాలమైన హృదయాన్ని కల్గిన కూరేశుల కీర్తినిగూర్చి మనం ఏమని పలుకగలం! "మొళ్ియై క్కడక్కుమ్ పెరుమ్ పుకళ్ాన్" అని పల్కడం తప్ప వేఱు వాక్కు ఏదీ లేదు కదా!

(వఞ్జముక్కుఱుమ్బామ్- ఇత్యాది) - "కులం రూపం వయో విద్యా ధనం చ మదయంత్యముమ్" అనే రీతిలో మదాన్ని కల్గించగల్గినవి అయిదు ఉన్నా, విద్యామదం, ధనమదం, కులమదం- అనే ఈ మూడు అహంకారాలు చాలా క్రూరమైనవి. వీటిని దాటడం ఎవరికైనా అరుదే. వీటిని దాటినవారు అనే అతిశయం కూరేశులకు ఒక్కరికే అసాధారణం-అని భగవద్రామానుజుల కాలంలోనే ప్రసిద్ధమైనది. తిరువాయ్‌మొళ్ిలోని "పలరడియాల్ మున్బు అరుళియ పామ్బణైయప్పన్" అనేచోట ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యలో కూరేశుల విషయంగా తెలుపబడ్డ ఐతిహ్యం స్మరణీయం. ఇంకా ఇటువంటి ఐతిహ్యాలు చాలా ఉన్నాయి. వివరిస్తే ఒక మహాభారతమే అవుతుంది.

8. వరుత్తుమ్ పుఱవిరుళ్ మాఱ్ఱ, ఎమ్‌పొయ్‌కైప్పిరాన్ మఱైయిన్
కరుత్తిన్ పొరుళైయుమ్ శెన్దమిళ్ తన్నైయుమ్ కూట్టి, ఒన్ఱ
త్తిరిత్తన్ఱెరిత్త తిరువిళక్కై త్తన్ తిరువుళ్ళత్తే
ఇరుత్తుమ్ పరమన్, ఇరామానుశ నెమ్మిఱైయవనే.

వరుత్తుమ్ = దుఃఖాలను కల్గించ గల్గిన, పుఱమ్ ఇరుళ్ = బాహ్యవిషయాలను గూర్చిన అజ్ఞానమనే అంధకారాన్ని, మాఱ్ఱ= పోగొట్టడంకోసం, ఎమ్ పొయ్‌కై ప్పిరాన్ = మన కులనాథులైన పొయ్‌కై ఆళ్వార్, అన్టు = పూర్వకాలంలో,

మఱైయిన్ కరుత్తిన్ పొరుళైయుమ్ = వేదాంతాలలో ఇమిడి ఉండే అర్థాలను, శెమ్ తమిழ் తన్నైయుమ్ కూట్టి = అందమైన ద్రావిడసూక్తులనుకూర్చి, ఒన్ఱ తిరిత్తు = రెండిటిని ఒకటిగా చేర్చి ఒక వత్తిని చేసి, ఎరిత్త తిరు విళక్కై = జ్వలింపజేసిన (ముదల్ తిరువన్దాది అనే) మంగళదీపాన్ని, తన్ తిరు ఉళ్ళత్తే = తమ మనస్సులో, ఇరుత్తుమ్ = ప్రతిష్ఠించుకొన్న, పరమన్ ఇరామానుశన్ = మహావైభవశాలి అయిన భగవద్రామానుజులు, ఎమ్ ఇఱైయవన్ = మనకు స్వామి.

భగవద్భాగవతవిషయం అంతరంగవిషయమని, శబ్దాదివిషయాలు బాహ్యవిషయాలని చెప్పబడతాయి. ఆ బాహ్యవిషయాలనుగూర్చిన అజ్ఞానాంధకారం బాహ్యాంధకార మనబడుతుంది. (బాహ్యాలైన విషయాలనుగూర్చిన తమస్సు బాహ్యతమస్సు). ఆ అంధకారం మొదట సుఖరూపంగా తోచినా, తరువాత చాలా దుఃఖాలను కల్గించగలవు. అటువంటి క్రూరతమస్సును తొలగించుకోవడంకోసం పొయ్‌కైఆழ்వార్ **"వైయమ్ తకళియా వార్ కడలే నెయ్యాక వెయ్య కతిరోన్ విళక్కాక"** అని ప్రారంభించి ముదల్ తిరువన్దాది దివ్యప్రబంధం అనే ఒక దీపాన్ని వెలిగించారు. ఆ దీపానికి దేనిని వత్తిగా చేశారు? అని అంటే, వేదాంతాలలో ఇమిడి ఉండే సారార్థాలను, మధురాలైన ద్రావిడశబ్దాలను ఒకటిగా చేర్చి ఒత్తిగా చేశారు. అటువంటి మంగళదీపాన్ని భగవద్రామానుజులు తమ మనస్సులోపల ఎప్పటికీ ఆరిపోని రీతిలో స్థాపించారు. వారే దాసుడనైన నాకు స్వామి - అని భావం.

తమస్సును పోగొట్టుకోవడంకోసం దీపం ఆవశ్యకం కనుక, పొయ్‌కై ఆழ்వార్ల దివ్యప్రబంధం ఆంతర తమస్సును పోగొడుతుంది కనుక, అది ఒక దీపంగా రూపించబడినది. **"మఱైయిన్ కరుత్తు"**- వేదాల నిర్ణయరూపమైన వేదాంతం. **"అన్ఱు"**- తిరుక్కోవలూర్‌లోని చావడిలో **"నీయుమ్ తిరుమకళుమ్ నిన్ఱాయాల్"** అనే పాశురం ప్రకారం సమ్మర్దాన్ని పొందిన ఆ సమయంలో -అని భావం. పొయ్‌కై ఆழ்వార్లు వెలిగించిన దీపాన్ని తమ చిత్తంలో ప్రతిష్ఠించుకోవడం అంటే- వారి శ్రీసూక్తులను ఎల్లప్పుడు అనుసంధించడమే.

**9.** **ఇఱైవనై క్కాణు మిదయత్తిరుళ్ కెడ, ఞాన మెన్నుమ్**
**నిఱైవిళక్కేఱ్ఱియ పూతత్తిరువడి తాళ్కళ్, నెఞ్జ**
**త్తుఱైయ వైత్తాళు మిరామానుశన్ పుకழோదుమ్ నల్లోర్**
**మఱైయినై క్కాత్తు, ఇన్ద మణ్ణకత్తే మన్న వైప్పవరే.**



ఇఱైవనై = సర్వస్వామి అయిన భగవానుని, కాణుమ్ = సాక్షాత్కరించడానికి ఉపకరణం అయిన, ఇదయత్తు = హృదయంలోఉండే, ఇరుళ్ = అజ్ఞానమనే అంధకారం, కెడ = నశించేటట్లు, ఞానమ్ ఎన్నుమ్ = జ్ఞానమనే, నిఱై విళక్కు = పూర్ణమైన దీపాన్ని, ఏఱ్ఱియ = వెలిగించిన (ప్రకాశింపజేసిన) (ఇరణ్డామ్ తిరువన్దాది- అనే ప్రబంధాన్ని అనుగ్రహించిన), పూత త్తిరువడి = పూదత్తాழ்వార్ల యొక్క, తాళ్కళ్ =శ్రీచరణాలను, నెఞ్జత్తు = తమ మనస్సులో, ఉఱైయ వైత్తు= శాశ్వతంగా స్థాపించి, ఆళుమ్ = వాటినే అనుభవించే (దర్శించే), ఇరామానుశన్= భగవద్రామానుజుల, పుకழ் = దివ్యగుణాలను, ఓదుమ్ = నిరంతరం అనుసంధిస్తున్న, నల్లోర్ = విలక్షణులైన పురుషులే (సత్పురుషులే), ఇన్ద మణ్ అకత్తే = ఈ భూమండలంలో, మఱైయినై = వేదాలను, కాత్తు = రక్షించి, మన్న వైప్పవర్ = ఏనాటికీ నాశం లేని రీతిలో ప్రతిష్ఠాపనాన్ని చేయగలవారు.

**"శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యులు"** అనే బిరుదు భగవద్రామానుజుల సంబంధాన్ని కలవారికే తగును- అని అంటున్నారు, అముదనార్ ఇందులో. సర్వస్వామి అయిన భగవానుని సాక్షాత్కరింపజేసికోవడానికి అందఱికి సాధనమై ఉండే హృదయం అజ్ఞానాంధకారంతో నిండి పాడుకాకుండా ఉండేటట్లు పరజ్ఞానమనే పూర్ణదీపాన్ని వెలిగించినవారైన పూదత్తాழ்వార్లయొక్క శ్రీచరణాలను తమ మనస్సులో నిరంతరం ప్రతిష్ఠించుకొని, వాటినే అనుభవించే భగవద్రామానుజుల గుణకీర్తనమే కాలక్షేపంగా కల్గి ఉండే విలక్షణులైన వారెవరో వారే వేదాన్ని బాగా రక్షించి, ఈ భూలోకంలో సుస్థాపన చేయగల మహాత్ములు- అని భావం. **"ఞాన మెన్నుమ్ నిఱై విళక్కేఱ్ఱియ"** అనేచోట- **"ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్ నారణఱ్కు"** అనే పూదత్తాழ்వార్ల శ్రీసూక్తి భావించదగినది. **"ఇదయమ్"**-ఇది హృదయం అనే సంస్కృతశబ్దవికృతి. పూదత్తాழ்వార్లు వెలిగించిన జ్ఞానమనే పూర్ణమంగళదీపం ఏది? అంటే, ఇరణ్డామ్ తిరువన్దాది అనే వారి శ్రీసూక్తి. **"పూదత్తిరువడి"** -**"తిరువడి"** అనే పదం ఇక్కడ స్వామికి వాచకం. పూదత్తాழ்వార్ అనే స్వామి -అని అర్థం. **"తిరువడి తన్నామమ్ మఱన్దుమ్ పుఱన్తొழா"**, **"నమరుమ్ పెఱలడికళ్"**, **"ఎన్‌పిழைత్తాళ్ తిరువడియిన్ తకవినుక్కు"** ఇత్యాది దివ్యప్రబంధ ప్రయోగాలను గమనించాలి.

**(ఇన్ద మణ్ణకత్తే మఱైయినై క్కాత్తు మన్న వైప్పవరే)** భగవద్రామానుజులు సంబంధాన్ని పొందని అన్యులు. 'వేదం ప్రమాణమే కాదు'' అని పలికేవారై, దానిని

ప్రమాణంగా అంగీకరించినా అపార్థాలను పలికేవారై ఉన్నందువల్ల, వారు వేదమార్గ విధ్వంసాన్ని చేసేవారు కనుక, భగవద్రామానుజుల సంబంధాన్ని కలవారే శ్రీమద్వేద మార్గప్రతిష్ఠాపనాచార్యులు- అని భావం.

**10.** మన్నియ పేరిరుళ్ మాణ్డపిన్, కోవలుళ్ మామలరాళ్
తన్నొడు మాయనై క్కణ్డమై కాట్టుమ్, తమిళ్త్తలైవన్
పొన్నడి పోఱ్ఱు మిరామానుశఱ్కన్బుపూణ్డవర్తాళ్
శెన్నియిల్ శూడుమ్, తిరువుడైయార్ ఎన్ఱుమ్ శీరియరే.

మన్నియ =ఎవరికీ పోగొట్టడానికి వీలులేనట్లు నిలచి ఉండే, పేర్ ఇరుళ్ = అజ్ఞానమనే దట్టమైన చీకటి, మాణ్డ పిన్ = తమకు ముందున్న ఆళ్వార్ల ఇరువురు వెలిగించిన మంగళదీపంవల్ల బాగా (నశించిన) తొలగిన తరువాత, కోవలుళ్ ఆయనై = తిరుక్కోవలూర్‌లోని ఆయనార్‌ను, మా మలరాళ్ తన్నొడుమ్ = లక్ష్మీదేవితో కూడ, కణ్డమై = తాము సేవించిన రీతిని, కాట్టుమ్ = ("తిరుక్కణ్డేన్" ఇత్యాది ప్రబంధంద్వారా) వ్యక్తం చేసిన, తమిళ్ తలైవన్ = ద్రావిడభాషకు స్వామి అయిన పేయాళ్వార్లయొక్క, పొన్ అడి = అందమైన శ్రీచరణాలనే, పోఱ్ఱుమ్ = కీర్తించేవారైన, ఇరామానుశఱ్కు = భగవద్రామానుజులపట్ల, అన్బు పూణ్డవర్ = భక్తిని కలవారియొక్క, తాళ్ = శ్రీచరణాలను, శెన్నియిల్ శూడుమ్ తిరు ఉడైయార్ = శిరోభూషణంగా ధరించే సంపదను కలవారు, ఎన్ఱుమ్ శీరియర్ = ఏనాటికి అయినా శ్రీమంతులే.

పొయ్‌కైఆళ్వార్లు, పూదత్తాళ్వార్లు వెలిగించిన రెండు దీపాలవల్ల చీకటి తొలగిపోగా, "తిరు క్కణ్డేన్ పొన్ మేని కణ్డేన్" అని తిరుక్కోవలూర్ ఆయనార్‌ను పిరాట్టితో పాటు సేవించగలిగారు. పేయాళ్వార్లు, తాము ఆ విధంగా సేవించినట్లుగా మూన్ఱామ్ తిరువన్దాదిద్వారా వ్యక్తం చేసిన ఆ ఆళ్వార్ల శ్రీచరణాలను స్తుతించే వారైన భగవద్రామానుజుల విషయంలో భక్తిని కలవారెవరో, వారి శ్రీచరణాలను శిరోభూషణంగా ధరించడమే నశించని సంపదగా తలచి, శ్రీరామా నుజ భక్తుల శ్రీచరణాలను శిరస్సుపై ధరించేవారే నిత్యశ్రీమంతులు- అని భావం. "**అరశమర్న్దానడిశూడు మరశై యల్లాల్ అరశాక ఎణ్ణేన్ మఱ్ఱరశుతానే**" అని కులశేఖ ప్పెరుమాళ్‌కు ప్రథమపర్వంలో కల్గిన నిష్ఠ అముదనార్‌కు చరమపర్వంలో కల్గినది. (ప్రథమపర్వం -భగవద్విషయం, చరమపర్వం భాగవతవిషయం).

**(కోవలుళ్ మామలరాళ్)** - తిరుక్కోవలూర్‌లోని స్వామి శ్రీకృష్ణావతారంలోని తన ఆశ్రితపారతంత్ర్య పూర్ణంగా స్ఫురించేటట్లు సేవను అనుగ్రహించే రీతిని



బట్టి "ఆయన్" అనే తిరునామాన్ని పొందాడు. "తిరుక్కోవలూర్ ఆయనార్" అని ఆ స్వామికి ప్రసిద్ధి. ఈ పాశురంలో పేయాళ్వార్లు "**తమిళ్ తలైవన్**" - అని గొప్పగా నిర్దేశింపబడ్డారు. "శీరియర్'- "శీర్మై" (సంపదను) కలవారు "శీర్మై"- అంటే శ్రీమంతుడై ఉండే స్థితి.

**11.** శీరియ నాన్మఱై చ్చెమ్బొరుళ్, శెన్దమిళాలళిత్త
పారియలుమ్ పుకళ్ ప్పాణ్ పెరుమాళ్, శరణామ్పతుమ
త్తారియల్‌శెన్ని యిరామానుశన్ఱన్నై చ్చార్న్దవర్తమ్
కారియ వణ్మై, ఎన్నాల్‌శొల్లొణాతు ఇక్కడలిడత్తే.

శీరియ = గొప్పవైన, నాల్ మఱై =నాల్గు వేదాలలోని, శెమ్ పొరుళ్ = ఋజువైన అర్థాలను, శెమ్ తమిళాల్ = అందమైన ద్రావిడపాశురాలతో, అళిత్త = అనుగ్రహించినవారు, పార్ ఇయలుమ్ పుకళ్= భూమి అంతట వ్యాప్తి చెంది కీర్తిని కలవారైన, పాణ్ పెరుమాళ్ = తిరుప్పాణ్ ఆళ్వార్ల, శరణ్ ఆమ్ = శ్రీచరణాలు అనే, పతుమమ్ తార్ = తామరపూలతో, ఇయల్ = అలంకరింపబడిన, శెన్ని= శిరస్సును కలవారైన, ఇరామానుశన్ తన్నై = భగవద్రామానుజులను, శార్న్దవర్ తమ్= ఆశ్రయంగా చేరినవారియొక్క, కారియమ్ వణ్మై = అనుష్ఠాన వైలక్షణ్యం, ఇక్కడల్ ఇడత్తు = సముద్రపరివేష్ఠితమైన ఈ భూమిలో, ఎన్నాల్ శొల్ల ఒణ్ణాతు = "ఇటువంటి వైభవాన్ని కలవారు'' అని నాచే చెప్పి వర్ణించడానికి సాధ్యం కాదు.

భగవానుని స్వరూపరూపగుణవిభూతులను అన్నిటిని విశదంగా పల్కడం వల్ల గొప్పవైన నాల్గు వేదాలలో ఇమిడి ఉండే మహార్థాలను "**అమలనాదిపిరాన్**" అనే దివ్యప్రబంధంలో సంగ్రహంగా అనుగ్రహించినవారై, లోకం అంతా వ్యాపించిన కీర్తిని కలవారైన తిరుప్పాణ్ ఆళ్వార్లయొక్క శ్రీచరణారవిందాలతో అలంకరింప బడ్డ శిరస్సును కలవారైన భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారి ఆచారవైలక్షణ్యం ఇంతటిది అని వాక్కుతో వర్ణించి పలుకడానికి సాధ్యం కాని రీతిలో చాలా గొప్పది-అని తాత్పర్యం.

"**శరణ్**"- ఇది సంస్కృతంలోని చరణశబ్దానికి వికృతి. "**పతుమమ్**'- పద్మమనే సంస్కృతశబ్దవికారం. "**తార్**"-ఇది పూమాలికకు, పూవుకు పేరు. ఇక్కడ పూవును నిర్దేశిస్తుంది. నాల్గవ పాదంలో "**కారియల్ వణ్మై**" అనే పాఠంకూడా ఉన్నది. "**కార్**" -అంటే మేఘం. జలస్థలవిభాగం లేకుండా మేఘాలు లోకం అంతా విస్తరించి తిరిగి చల్లని నీటిని వర్షించి, ఉపకరించేటట్లుగానే, లోకం అంతా తిరిగి రహస్యాలైన

అర్థాలను వర్ణించి సదుపదేశాలను చేసేవారు భగవద్రామానుజుల శిష్యులు - అని (దీనిద్వారా) తెలిపినట్లయినది.

**12.** ఇడఙ్గొణ్ణ కీర్త్తి మழிశైక్కిఱైవన్, ఇణైయడిప్పోదు
అడఙ్గు మితయత్తిరామానుశన్, అమ్ పొఱ్పాత మెన్ఱుమ్
కడఙ్గొణ్డిఱైఞ్జుమ్ తిరుమునివర్క్కన్ఱి క్కాతల్ శెయ్యా
త్తిడఙ్గొణ్డ ఞానియర్క్కే, అడియే నన్బు శెయ్వతువే.

ఇడమ్ కొణ్డ కీర్త్తి = భూమి అంతా వ్యాపించిన కీర్తిని కలవారైన, మழிశైక్కు ఇఱైవన్ = తిరుమழிశైప్పిరాన్‌యొక్క, ఇణై అడి పోతు = రెండు పాదారవిందాలు, అడఙ్గుమ్ = నివాసం చేసే, ఇతయత్తు = మనస్సును కలవారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, అమ్ పొన్ పాతమ్ = చాలా అందమైన శ్రీచరణాలను, ఎన్ఱుమ్ = ఏకాలంలో అయినా, కడమ్ కొణ్డు ఇఱైఞ్జుమ్ తిరు = ఇదే మనకు స్వరూపమనే బుద్ధితో ఆశ్రయించడమనే సంపదను కలవారైన, మునివర్క్కు అన్ఱి = మహాత్ములకు తప్ప, మిగిలినవారిపట్ల, కాతల్ శెయ్యా = భక్తిని కల్గి ఉండని, తిడమ్ కొణ్డ ఞానియర్క్కే = మిక్కిలి నిశ్చయాన్ని కలవారైన జ్ఞానులకే, అడియేన్ అన్బు శెయ్వతు = దాసుడు (నేను) భక్తుడనై ఉంటాను.

లోకం అంతా వ్యాపించిన కీర్తిని కలవారైన తిరుమழிశై ప్పిరాన్‌యొక్క పాదారవిందాలు స్థిరంగా ప్రతిష్ఠింపబడ్డ మనస్సును కలవారైన భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలను స్వరూపప్రాప్తత్వబుద్ధితో అనవరతం ఆశ్రయిస్తున్న మహాభాగవతులకు తప్ప ఇంకొకరికి విధేయులు కాని మహాజ్ఞానులపట్లనే నేను భక్తిని కలవాడనై ఉంటాను- అని అంటున్నారు. ఈ పాశురంలో. "శ్రీరామానుజ భక్తుల భక్తుల భక్తులకు భక్తుడను'' అని అముదనార్ అంటున్నారు.

**13.** శెయ్యుమ్ పశున్తుళవ త్తొழிల్‌మాలైయుమ్, శెన్దమిழிల్
పెయ్యుమ్ మఱైత్తమిழ்మాలైయుమ్, పేరాతశీరరఙ్గ
త్తైయన్ కழలుక్కణియుమ్ పరన్ తాళన్ఱి యాతరియా
మెయ్యన్, ఇరామానుశన్ శరణే కతి వేఱెనక్కే.

శెయ్యుమ్ = (తొణ్డరడిప్పొడి యాழ்వార్ అయిన తమచే) నిర్మింపబడ్డ, పశుమ్ = పచ్చని, తుళవమ్ = తులసీ, మదుమై తొழிల్ =నిర్మాణకౌశలాన్ని కల్గినదైన, మాలైయుమ్ = పూమాలికలను, శెమ్ తమిழிల్ = అందమైన ద్రావిడ భాషలో, పెయ్యుమ్ = నిర్మింపబడినదై, మఱై = వేదసదృశం అయిన, తమిழ்

మాలైయుమ్ = తిరుమాలై, తిరుప్పళ్ళియెழுచ్చి అనే దివ్యప్రబంధాల రూపంలోని వాఙ్మాలికలను, పేరాత శీర్ = (తొలగిపోని) నిత్యసిద్ధమైన, శీర్ = కల్యాణగుణాలను కలవాడైన, అరఙ్గత్తు ఐయన్ = శ్రీరంగనాథుని, కழలుక్కు అణియుమ్ = శ్రీచరణాలకు అలంకరించేవారైన, పరన్ = తొణ్డరడిప్పొడి ఆழ்వార్ అనే మహాత్ముల, తాళ్ అన్ఱి ఆతరియా = శ్రీచరణాలను తప్ప వేఱొక దానిని ఆదరించని, మెయ్యన్ = సత్యసంధులైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, శరణే = శ్రీచరణాలే, ఎనక్కు = దాసునకు, వేఱు కతి = విలక్షణమైన ప్రాప్యవస్తువు.

తొణ్డరడిప్పొడియాழ்వార్ల శ్రీచరణాలలో తప్ప వేఱొక దానిలో ఆదరం లేని ఎమ్బెరుమానార్ శ్రీచరణాలే నాకు శరణమని ఇందులో అంటున్నారు.

తొణ్డరడిప్పొడి యాழ்వార్లు శ్రీరంగనాథుని శ్రీచరణాలలో రెండు మాలికలను నిర్మించి సమర్పించారని చాటూక్తిగా అముదనార్ పల్కుతున్నారు. **"తుళపత్తొణ్డాయ తొల్ శీర్ తొణ్డరడిప్పొడి"** అని, **"తొడై యొత్త తుళపముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడి"** అని తామే అనుగ్రహించిన రీతికి తగినట్లుగా తులసీమాలలను, తిరుమాలై, తిరుప్పళ్ళి ఎழுచ్చి అనే దివ్యప్రబంధాల రూపంలోని వాఙ్మాలికలను శ్రీరంగనాథుని శ్రీచరణాలకు సమర్పించినవారుకదా తొణ్డరడిప్పొడి యాழ்వార్లు.

**"తుళప త్తొழிల్ మాలైయుమ్"**- అని కూడా పాఠాన్ని అనుసంధిస్తారు. **"తుళపత్తు"**- తులసితో నిర్మింపబడిన, **ఎழிల్** మాలై - అందమైన మాలిక - అని అర్థం. ఈ పాఠం అందమైనదే అయినా వ్యాఖ్యానంలో ఆదరింపబడిన పాఠం కానందువల్ల ఉపేక్షింపదగినది.

**14.** కతిక్కు ప్పతఱి, వెఙ్గా నముమ్ కల్లుమ్ కడలు మెల్లామ్
కొతిక్క త్తవమ్ శెయ్యుమ్ కొళ్కై యఱ్ఱేన్, కొల్లికావలన్ శొల్
పతిక్కుమ్ కలైక్కవి పాడుమ్ పెరియవర్పాతఙ్గళే
తుతిక్కుమ్ పరమన్, ఇరామానుశ నెన్నై చ్చోర్విలనే.

కొల్లి కావలన్ = కులశేఖరప్పెరుమాళ్‌చే అనుగ్రహింపబడినదై, కలై శొల్ పదిక్కుమ్ = శాస్త్రీయ వచనాలు- చోటు చేసికొన్న, కవికళ్ = పెరుమాళ్ తిరుమొழி పాశురాలను, పాడుమ్ పెరియార్ = పాడే మహాత్ముల, పాదఙ్గళే = శ్రీచరణాలనే, తుతిక్కుమ్ = స్తుతించేవారై, పరమన్ = ఉత్కృష్టులైన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్నై శోర్విలన్ = నన్ను విడచి వెళ్ళడం లేదు. (అందువల్ల)

కతిక్కు పతఱి = ప్రాప్యలాభంకోసం తొందరపడి, వెమ్ కానముమ్ కల్లుమ్ = మిక్కిలి వేడిమిని కల అడవులలోను, పర్వతాలలోను, కడలుమ్ = సముద్రాలలోను (నివసిస్తూ), ఎల్లామ్ కొతిక్క = అన్ని అవయవాలు తప్తమయే రీతిలో, తవమ్ శెయ్యుమ్ = తపస్సును చేసే, కొళ్కై = స్వభావాన్ని, అఱ్ఱేన్ = విడచిపెట్టాను.

సకలశాస్త్రాల సారార్థాలను సంగ్రహించి శ్రీకులశేఖరాళ్వార్ అనుగ్రహించిన పెరుమాళ్ పెరుమొళ్ళి అనే దివ్యప్రబంధాన్ని అనుసంధించే పెద్దల శ్రీచరణాలనే కీర్తించే స్వభావాన్ని కల్గిన భగవద్రామానుజులు స్వయంగా తామే వచ్చి నన్ను స్వీకరించారు. కనుక, ఇక ఏనాడూ నన్ను వారు విడచిపెట్టరు. అందువల్ల మనకు ప్రాప్యం అనేది వేఱు ఇంకొకటి లేదు కాబట్టి, వనపర్వతసముద్రతీరాలలో ఉంటూ కఠినంగా చేసే తపస్సులతో ఇక నాకు సంబంధం లేదు- అని భావం.

**"ఎల్లామ్ కొతిక్క త్తవమ్ శెయ్యుమ్ కొళ్కై"** -అనే దానికి ఇతని తపస్సులోని కాఠిన్యాన్ని చూచి అరణ్యం, పర్వతాలు, సముద్రాలు పరితపించేటట్లుగా ఆయా స్థలాలలో ఉంటూ తపస్సు చేసే స్వభావం- అనే అర్థం చెప్పేవారున్నారు. **"శోర్వు ఇలన్"** -విశ్లేషించను- అని అర్థం.

15. **శోరాత కాతల్ పెరుమ్ శుళ్ళిప్పాల్, తొల్లైమాలై యొన్టుమ్**
**పారాతవనై ప్పల్లాణ్డెన్టు కాప్పిడుమ్, పాన్మైయన్తాళ్**
**పేరాత వుళ్ళత్తిరామానుశన్తన్ పిఱజ్గియశీర్**
**శారా మనిశరై చ్చేరేన్, ఎనక్కెన్న తాళ్ళ్వినియే.**

శోరాత కాతల్ = ఏనాడూ కొఱత చెందిన భక్తి (ప్రేమ)లోని, పెరుమ్ శుళ్ళిప్పాల్ = గొప్ప సుడిగుండంలో చిక్కుకున్నందువల్ల, తొల్లై మాలై ఒన్టుమ్ పారాతు = నిత్యుడైన భగవానుని స్వరూపాన్ని కొంచెంకూడా గమనించకుండా, అవనై = ఆ భగవానుని ఉద్దేశించి, పల్లాణ్డు ఎన్టు కాప్పిడుమ్ = **"పల్లాణ్డు పల్లాణ్డు"** అని మంగళాశాసనం చేయడాన్నే, పాన్మైయన్ = నిత్యస్వభావంగా కలవారైన పెరియాళ్వార్లయొక్క, తాళ్ పేరాత ఉళ్ళత్తు = శ్రీచరణాలను విడచి ఉండని మనస్సును కలవారైన, ఇరామానుశన్ తన్= భగవద్రామానుజుల, పిఱజ్గియ శీర్= గొప్ప కల్యాణగుణాలను, శారా = తమకు అనుభావ్యంగా గ్రహించని, మనిశరై = మానవులను, శేరేన్ = ఆశ్రయించను, ఇని = ఇటువంటి నిశ్చయం కల్గిన తరువాత, ఎనక్కు = దాసుడనైన నాకు, ఎన్న తాళ్ళ్వు = ఏమి కొఱత?



పాండ్యరాజుపండితసభలోకి వేంచేసి "శ్రీమన్నారాయణుడే పరతత్వం" అనే తత్త్వాన్ని స్థాపించి, వాదశుల్కధనాన్ని పొందగా, ఆ పాండ్యప్రభువు తమను ఏనుగు పైకి ఎక్కించి ఊరేగింపు జరిపేటపుడు తమ వైభవాన్ని కళ్ళార చూడడంకోసం ఆకాశంలో గరుడవాహనారూఢుడై వేంచేసిన శ్రియఃపతిని సేవించి, ఆ భగవానుని పట్ల గల గొప్ప భక్తివల్ల రక్ష్యభూతులైన తమను రక్షకులుగా, రక్షకుడైన భగవానుని రక్ష్యభూతునిగా తలచి అతనికి **"పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు"** అని ప్రారంభించి మంగళాశాసనాన్ని చేసిన పెరియాళ్వార్ల శ్రీచరణాలనే నిరంతరం ధ్యానించే భగవద్రామానుజుల గుణాలను చింతించలేని, మానవులతో నేను సహవాసాన్ని చేయలేను. ఈ భావన కల్గిన తరువాత ఇక నాకు ఏ కొఱత లేదు- అని భావం.

పూర్వార్ధంలో ప్రస్తుతింబడ్డ వృత్తాంతవివరం పెరియాళ్వార్ల వైభవంలో గమనించవచ్చు. **"పిఱజ్గియ శీర్"** అంతు లేని గుణాలు- అని చెప్పవచ్చు. ప్రకాశించే గుణాలని చెప్పవచ్చు.

16. **తాళ్ళ్వొన్టిల్లా మఱై తాళ్ళ్న్దు, తలముళ్ళుతుమ్ కలియే**
**ఆళ్కిన్ఱ నాళ్వన్దళిత్తవన్ కాణ్మిన్, అరజ్గర్ మౌళి**
**శూళ్ళ్కిన్ఱ మాలైయై చ్చూడిక్కొడుత్తవళ్ తొల్లరుళాల్**
**వాళ్ళ్కిన్ఱ వళ్ళల్, ఇరామానుశనెన్టుమ్ మామునియే.**

అరజ్గర్ = శ్రీరంగనాథుని, మౌళి = కిరీటంలో, శూళ్ళ్ కిన్ఱ = అలంకరింపబడ్డ, మాలైయై = పూమాలికను, శూడి = తన కేశపాశంలో అలంకరించుకొని సువాసితం చేసి, కొడుత్తవళ్ = ఇచ్చిన ఆణ్డాళ్‌యొక్క, తొల్ అరుళాల్ = అవ్యాజమైన అనుగ్రహంచేత, వాళ్ళ్కిన్ఱ = ఉజ్జీవించే, వళ్ళల్ = ఉదారులు అయిన, ఇరామానుశన్ ఎన్నుమ్ = శ్రీరామానుజులనే మునులు (ఎటువంటి వారు ? అని అంటే), తాళ్ళ్వు ఒన్టు ఇల్లా = ఏ కొఱతను లేని, మఱై = వేదం, తాళ్ళ్న్దు = (కుదృష్టులవల్ల - అపార్థాలను చెప్పేవారివల్ల) నైచ్యాన్ని పొంది, తలమ్ ముళ్ళుతుమ్= భూమి అంతటా, కలియే = కలిసామ్రాజ్యమే, ఆళ్కిన్ఱ నాళ్ = పాలించే కాలంలో, అళిత్తవన్ కాణ్మిన్ = ఆ వేదాన్ని ఉద్ధరించి లోకాలను రక్షించినవారు సుమా!.

ప్రమాణాలలో గొప్ప ఉన్నతమైన ప్రమాణం వేదం. అది బాహ్యకుదృష్టివాదుల వల్ల నైచ్యాన్ని పొంది, కలిపురుషుడే పరిపాలనసాగించే సమయంలో ఈ భూలోకంలోకి వచ్చి అవతరించి, ఆ కలిని నశింపజేసి, వేదాన్ని సుప్రతిష్ఠితం చేసిన మహానుభావులుసుమా భగవద్రామానుజులు- అని భావం.

"అరజ్గర్ మౌళి శూఴ్గిన్దమాలైయై చ్చూడి క్కొడుత్త" అని అంటూ ప్రస్తావించిన గోదాదేవివృత్తాంతం గోదాచరిత్రవైభవంలో గమనించాలి. శూడికొడుత్త నాచ్చియార్‌యొక్క గొప్ప కృపకు పాత్రభూతులు అయ్యారు భగవద్రామానుజులు- అన్నది ఉత్తరార్ధసారం.

17. మునియార్ తుయరజ్గళ్ మున్దిలుమ్, ఇన్బజ్గళ్ మొయ్త్తిడినుమ్
కనియార్ మనమ్ కణ్ణమజ్గై నిన్రానై, కలైపరవుమ్
తనియానైయై త్తణ్డమిఴ్ శెయ్త నీలన్దనక్కు లకిల్
ఇనియానై, ఎజ్గళిరామానుశనై వన్దెయ్తినరే.

కలై పరవుమ్ = సకలశాస్త్రాలచేత స్తుతింపబడుతున్న, తని ఆనైయై = అద్వితీయమైన మత్తగజంవంటి, తిరు క్కణ్ణమజ్గై నిన్రానై = తిరుక్కణ్ణమజ్గైలో నిలచి ఉండే పత్తరావి ప్పెరుమాళ్‌నుగూర్చి, ఉలకిల్ = ఈలోకంలో, తణ్ తమిఴ్ శెయ్త = సంసారతాపాన్ని హరించే (ద్రావిడ) దివ్యప్రబంధాన్ని అనుగ్రహించిన, నీలన్ తనక్కు = తిరుమజ్గైయాళ్వార్ విషయంలో, ఇనియానై = ప్రేమను కలవారు, ఎజ్గళ్ = మాకు నాథులు అయిన, ఇరామానుశనై =భగవద్రామానుజులను, వన్దు ఎయ్‌కిన్దనర్ = వచ్చి సేవించే మహానుభావులు, తుయరజ్గళ్ మున్దిలుమ్ మునియార్ = తాపత్రయాలు నిబిడంగా కల్గినా బాధపడరు, ఇన్బజ్గళ్ మొయ్త్తిడినుమ్ కనియార్ = సుఖాలు విరివిగా కల్గినా ఉబ్బి తబ్బిబ్బు కారు.

సకలశాస్త్రప్రతిపాద్యుడైన భగవానుని తమ దివ్యప్రబంధాలలో నిలిపి పాడిన తిరుమజ్గైయాళ్వార్‌కు అంతరంగభక్తులైన భగవద్రామానుజులను ఆశ్రయించిన మహానుభావులు సుఖదుఃఖాలు ఎదురయ్యే కాలంలో మిగిలిన సంసారులవలె హర్షశోకాలను పొందకుండా, ఏవిధమైన వికారం లేకుండా ఉంటారు. ఆ రీతిలోనే మీరుకూడా హర్షశోకాలలో మానసిక వికారాన్ని పొందవద్దు- అని తాత్పర్యం.

**(తుయరజ్గళ్ మున్దిలుమ్ మునియార్, ఇన్బజ్గళ్ మొయ్త్తిడినుమ్ మనమ్ కనియార్) - "కళిప్పుమ్ కవర్వుమఱ్ఱు"** అని నమ్మాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో నిర్వాహకులై ఉన్నవారు- అని భావం. ఒక కాలు అణా (తక్కువ సొమ్ము) చేతికి లభిస్తే తల ఎగురవేగడం, ఒక చిల్లుకానీ పోగొట్టుకొంటే కుప్ప కూలి పోవడం - అనే రీతిలోకదా సంసారుల స్థితి ఉంటుంది. శ్రీరామానుజ భక్తులు ఆ విధంగా ఉండరు. సుఖం కల్గిన కాలంలో, దుఃఖం కల్గిన కాలంలో ఒకే రీతిలోని మానసిక స్థితిని కలవారై ఉంటారని- భావం.



"కణ్ణమజ్గై నిన్రానై" - "తిరుక్కణ్ణ మజ్గై" దివ్యదేశాన్ని గూర్చి పల్కడం మిగిలిన అన్ని దివ్యదేశాలకు ఉపలక్షణం. పలు దివ్యదేశాలలోకి పోయి కవిత్వాన్ని పాడిన కలియన్ -అని భావం. "నీలన్" -ఇది తిరుమజ్గైయాళ్వార్ల తిరునామాలలో ఒకటి.

18. ఎయ్తఱ్కరియ మఱైకళై, ఆయిరమిన్ తమిఴాల్
శెయ్తఱ్కులకిల్ వరుమ్ శడకోపనై, శిన్దైయుళ్ళే
పెయ్తఱ్కిశైయుమ్ పెరియవర్ శీరై యుయిర్‌కళెల్లామ్
ఉయ్తఱ్కుతవుమ్, ఇరామానుశ నెమ్ముఱు తుణైయే.

ఎయ్తఱ్కు అరియ = అధికరించడానికి సాధ్యం కాని, మఱైకళై = వేదాలను, ఇన్ తమిఴ్ = తీయని ద్రావిడభాషలో, ఆయిరత్తాల్ = వేయి పాశురాలలో, శెయ్తఱ్కు = అనుగ్రహించడంకోసం, ఉలకిల్ వరుమ్ = ఈ లోకంలోకి వచ్చి అవతరించిన, శడకోపనై = నమ్మాళ్వార్లను, శిన్దై ఉళ్ళే = తమ హృదయంలోపల, పెయ్తఱ్కు ఇశైయుమ్ = ధ్యానించడానికి అంగీకరించిన, పెరియవర్ = శ్రీమధురకవులయొక్క, శీరై = జ్ఞానాది గుణాలను, ఉయిర్‌కళ్ ఎల్లామ్ = సకలాత్మలు, ఉయ్తఱ్కు = ఉజ్జీవించేటట్లు, ఉతవుమ్ = ఉపకారం చేసే, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎమ్ ఉఱు తుణై = మాకు తగిన శరణం.

భగవద్రామానుజులే మనకు తగిన శరణం. రక్షకులు. వారు ఎటువంటివారు? అని అంటే, శ్రీమధురకవుల కల్యాణగుణాలను విస్తృతంగా వివరించి, సకలాత్మలను ఉజ్జీవింపచేశారు. ఆ మధురకవులు ఎటువంటివారు ? అని అంటే, నమ్మాళ్వార్లనే సర్వకాలం తమ హృదయంలో నిలుపుకొని ధ్యానించేవారు. ఆ ఆళ్వార్లు ఎటువంటి వారు ? అని అంటే, అనంతాలు అయినందువల్ల అధ్యయనం చేయడానికి సాధ్యం కాని వేదాలలో పొందికగా ఉండే సారార్థాలను తీయని ద్రావిడభాషలో వ్యక్తం చేయడంకోసం ఈ లోకంలో అవతరించినవారు.

వేదాలను ద్రావిడీకరించిన నమ్మాళ్వార్లను కీర్తించే శ్రీమధురకవుల భక్తులైన భగవద్రామానుజులు మనకు తగిన శరణం. (రక్షణ) -అని భావం. ఈ పాశురంలో మధురకవులు "పెరియవర్" అని విలక్షణంగా నిర్దేశింపబడడం గమనించదగినది. **"పువియుమ్ మిరు విశుమ్బుమ్ నిన్నకత్త, నీ యెన్ శెవియిన్ వఴి పుకున్దు ఎన్నుళ్ళాయ్, అవి నిన్ఱి, యాన్ పెరియన్ నీ పెరియై యెన్బదనై యారఱివార్? ఊన్ పరుకు నేమియాయ్! ఉళ్ళు"** (పెరియ తిరువన్దాది) అని గొప్పవాడైన

పరబ్రహ్మను తనలోపల ఇముడ్చుకొన్న "పెరియవర్"ను కూడ (నమ్మాఴ్వార్లను కూడ) లోపల ఇముడ్చుకొన్న "పెరియవర్" కదా మధురకవులు.

**19.** **ఉఱు పెరుమ్ శెల్వముమ్ తన్దైయుమ్ తాయుమ్, ఉయర్ కురువుమ్**
**వెఱితరు పూమకళ్ నాతనుమ్, మాఱన్ విళఙ్గియ శీర్**
**నెఱి తరుమ్ శెన్దమిఴారణమే యెన్ఱిన్నీణిలత్తోర్**
**అఱితర నిన్ఱ, ఇరామానుశ నెనక్కారముతే.**

ఉరు పెరు శెల్వముమ్ = గొప్ప అధికమైన సంపద, తన్దైయుమ్ = తండ్రి, తాయుమ్ = తల్లి, ఉయర్ కురువుమ్ = సదాచార్యుడు, వెఱి తరు = సువాసన అతిశయించిన, పూ మకళ్ = తామరపూవును జన్మస్థానంగా కల్గిన లక్ష్మీదేవికి, నాతనుమ్ = వల్లభుడైన సర్వేశ్వరుడు (అనే అన్నీ), మాఱన్ విళఙ్గియ శీర్ = నమ్మాఴ్వార్లు (తమకు) ప్రకాశించిన భగవద్గుణాల రీతిని, నెఱి తరుమ్ = అనుగ్రహించిన, శెమ్ తమిఴ్ ఆరణమే ఎన్ఱు = అందమైన ద్రావిడవేదమే (తిరువాయ్మొఴియే) అని, ఇ నీళ్ నిలత్తోర్ =ఈ విశాలమైన భూమిలోని జనులు అందఱు, అఱియా నిన్ఱ = తెలిసేటట్లుగా ఉండే, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎనక్కు = దాసునకు, ఆర్ అముతు = పరమభోగ్యులు.

భగవద్రామానుజులే మనకు పరమభోగ్యులు. వారు ఎటువంటివారు ? అని అంటే "నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొఴియే మకు సర్వస్వం" అనే అధ్యవసాయాన్ని కలవారు. అటువంటివారిపట్ల దాసుడనైన నేను అనన్యభోగ్యత్వ బుద్ధిని కలవాడను అయ్యాను- అని భావం.

**"మాతా పితా యువతయః"** అనే శ్లోకంద్వారా ఆళవన్దార్ నమ్మాఴ్వార్ల శ్రీచరణాలే సర్వస్వ మనేటట్లు తెలియజేశారు. ఈ పాశురంలో భగవద్రామానుజులు నమ్మాఴ్వార్ల శ్రీసూక్తులను సర్వస్వంగా తలచినట్లు తెలుపబడింది.

**"మాఱన్ విళఙ్గియ శీర్ నెఱితరుమ్ శెన్దమిఴ్ ఆరణమ్"**- తిరువాయ్మొఴిలోని ఒక్కొక్క దశకంలోను భగవానుని ఒక్కొక్క దివ్యగుణాన్ని వ్యక్తం చేశారు. అవి వ్యక్తం చేయబడిన రీతి ఏది? అంటే, భగవానుడు ఆఴ్వార్లకు ఏ క్రమంలో గుణాలను అనుభవింపజేశాడో, ఆ క్రమంలోనే వీరు వ్యక్తం చేశారు.

**20.** **ఆరప్పొఴిల్ తెన్కురుకై ప్పిరాన్, అముతత్తిరువాయ్**
**ఈరత్తమిఴినిశై యుణర్న్దోర్కట్కు, ఇనియవర్తమ్**
**శీరై ప్పయిన్ఱుయ్యుమ్ శీలమ్ కొళ్ నాతమునియై నెఞ్జాల్**
**వారి ప్పరుకుమ్, ఇరామానుశనెన్తన్ మానితియే.**

ఆరమ్ పొఴిల్ = చందనోద్యానాలను కల, తెన్ కురుకై = అందమైన తిరుక్కురుకూర్‌లో (అవతరించిన) పిరాన్ = మహోపకారకులైన ఆఴ్వార్లయొక్క, అముతమ్ = అమృతంవలె పరమభోగ్యమైన, తిరు వాయ్ =పెదవినుండి ఆవిర్భవించిన, ఈరమ్ తమిఴిన్ ఇశై = ఆర్ద్రవచనాలైన తిరువాయ్మొఴియొక్క రాగాన్ని, ఉణర్న్దోర్కట్కు = తెలిసినవారికి, ఇనియవర్తమ్ = ఇష్టులై ఉండేవారియొక్క, శీరై = గుణాలను, పయిన్ఱు = అభ్యసించి, ఉయ్యుమ్ = ఉజ్జీవించే, శీలమ్ కొళ్ = శీలాన్ని కలవారైన, నాతమునియై = నాథమునులను, నెఞ్జాల్ =తమ మనస్సుతో, వారి పరుకుమ్ = గొప్ప అభినివేశంతో పానం చేసే, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్తన్ మానితియే = నాకు అక్షయమైనిధి.

భగవద్రామానుజులే తమకు అక్షయమైన ధనం, వారు ఎటువంటి వారు? అని అంటే, శ్రీమన్నాథమునులను హృదయంలో ప్రతిష్ఠించుకొని, అత్యంతభక్తితో ధ్యానించేవారు. ఆ నాథమునులు ఎటువంటివారు ? అని అంటే, నమ్మాఴ్వార్ల అతిమధురమైన తిరువాయ్మొఴిని, గానం మొదలైన సకలలక్షణాలతోపాటు తెలిసినవారి విషయంలో ప్రీతిని కలవారు ఎవరో, వారి గుణాలను అనుసంధించి ఉజ్జీవించేవారు.

**21.** **నితియై ప్పొఴియుమ్ ముకిలెన్ఱు, నీశర్తమ్ వాశల్ పఱ్ఱి**
**త్తుతి కఱ్ఱులకిల్ తువళ్కిన్ఱిలేనిని, త్తూయ్ నెఱి శేర్**
**ఎతికట్కిఱైవన్ యమునై త్తుఱైవనిణైయడియామ్**
**కతి పెఱ్ఱుడైయ, ఇరామానుశన్ ఎన్నై క్కాత్తననే.**

తూయ నెఱి శేర్ = పరిశుద్ధమైన అనుష్ఠానాన్ని కల్గిన, ఎతికట్కు = యతులకు, ఇఱైవన్ = నాయకులైన, యమునై త్తుఱైవన్ = ఆళవందార్‌యొక్క, ఇణై అడి ఆమ్ కతి = ఉభయపాదాలనే ప్రాప్యాన్ని, పెఱ్ఱు = పొంది (దానివల్ల), ఉడైయ = లోకులకు అందఱికి స్వామి అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్నై కాత్తనన్ = నన్ను రక్షించినవారు. (అయిన తరువాత), ఇని = ఇకపై, నితియై పొఴియుమ్ = నిధులను వర్షించే, ముకిల్ ఎన్ఱు = మేఘుమా! అని, తుతి కఱ్ఱు= స్తోత్రాలను చేసి, ఉలకిల్ = ఈ లోకంలో, నీశర్తమ్ = నీచుల, వాశల్ పఱ్ఱి = వాకిటిని ఆశ్రయించి నిలచి, తువళ్కిన్ఱిలేన్ = బాధపడను.

నిన్నటివరకు నేను కనబడినవారి వాకిటి గడపవద్దకు పోయి నిలచి, నోటిని చూపి, కడుపును చూపి, "మహానిధులను వర్షించే మేఘమా !" అని అసత్యాలైన వారి నరస్తుతులను చేసి బాధపడ్డాను ఈనాటినుండి ఇక ఏనాటికీ నేను ఆ విధంగా క్లేశపడను. ఏ నీచుని వాకిటి గడపను ఆశ్రయించను.

"అముదనార్! ఈనాడు మీకు కల్గిన అతిశయం ఏమి? ఇపుడు మీకు ఏమి మించి ఉన్నది? ఎందువల్ల మీరు ఈవిధంగా గుండెలు తట్టి తట్టి అతిశయంతో పల్కుతున్నారు?" అని అంటే, "ఇపుడు నేను భగవద్రామానుజుల సంరక్షణకు లక్ష్యభూతుడనయ్యాను. ఆ భగవద్రామానుజులు, యతులకు నాథులైన ఆళవన్దార్‌యొక్క సంరక్షణను పొంది ఉజ్జీవించినవారు. అటువంటి శ్రీరామానుజుల చేత రక్షింపబడేవాడను అయిన తరువాత ఇక నేను ఎందుకోసం ఒక నీచుని వాకిటిని ఆశ్రయించి తల్లడిల్లాలి? ఆవిధంగా దుఃఖపడను (అని భావం).

22. **కార్త్తికైయానుమ్ కరిముకత్తానుమ్, కనలుమ్ ముక్కణ్**
**మూర్త్తియుమ్ మోడియుమ్ వెప్పుమ్ ముతుకిట్టు, మూవులకుమ్**
**పూత్తవనే యెన్ఱు పోఱ్ఱిడ వాణన్‌పిழై పొఱుత్త**
**తీర్త్తనై యేత్తుమ్, ఇరామానుశనెన్ఱన్ శేమవైప్పే.**

కార్త్తికైయానుమ్ = సుబ్రహ్మణ్యస్వామి, కరి ముకత్తానుమ్ =గణపతి, కనలుమ్=(వారికి సహాయంగా వచ్చిన) అగ్నిదేవుడు, ముక్కణ్ మూర్త్తియుమ్= శివుడు, మోడియుమ్ =దుర్గ, వెప్పుమ్ =జ్వరదేవత, ముతుకు ఇట్టు = వెన్ను జూపి పారిపోయిన తరువాత (అనన్యగతికుడైన బాణాసురుడు), మూ ఉలకుమ్= ముల్లోకాలను, పూత్తవనే = తిరునాభికమలంలో సృష్టించిన స్వామీ!, ఎన్ఱు పోఱ్ఱిడ= (నన్ను రక్షించు) అని కీర్తించగా, వాణన్ = ఆ బాణాసురుని, పిழై = అపరాధాన్ని, పొఱుత్త = క్షమించిన, తీర్త్తనై = పావనుడైన సర్వేశ్వరుని, ఏత్తుమ్ = నిత్యం స్తుతిస్తున్న, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్ తన్ శేమై వైప్పు = నాకు ఆపద్ధనం.

"ఐశ్వర్యం శంకరాదిచ్ఛేదారోగ్యం భాస్కరాత్తథా" (శివునివల్ల ఐశ్వర్యాన్ని కోరాలి, సూర్యునివల్ల ఆరోగ్యాన్ని కోరాలి) అని సామాన్యంగా కొందఱు అంటారు కదా! దానిని దృష్టిలోపెట్టుకొని ఒకడు అముదనార్‌ను చూచి, "స్వామీ! మీరు భగవద్రామానుజులను ఆశ్రయిస్తే మీకు దారిద్ర్యం తీరుతుందా? శివుని ఆశ్రయిస్తేకదా సంపద మిక్కుటంగా లభిస్తుంది" అని అనగానే ఆ శివుడు పడిన



పరిభవాలను వివరించే ఒక ఇతిహాసాన్ని గూర్చి పల్కుతూ, "భగవద్రామానుజులే నాకు ఆపద్ధనం." అనే దృఢమైన అధ్యవసాయాన్ని నొక్కి వక్కాణిస్తున్నారు- ఇందులో.

బలిచక్రవర్తి వంశంలో జన్మించిన బాణాసురుడు ఒక సమయంలో శివుని నాట్యాన్ని చూచి దానికి అనుగుణంగా తన రెండు చేతులతో మద్దెలను వాయించగా, శివుడు అతనిని అనుగ్రహించి, అతనికి వేయి బాహువులను, అగ్ని ప్రాకారాన్ని, అంతు లేని బలాన్ని, గొప్ప సంపదను, తాను తన పరివారంతో కలసి అతని భవనం వాకిటిలో కావలి కాయడం - మొదలైన వరాలను అనుగ్రహించాడు. ఆ బాణాసురుని పుత్రిక ఉషాదేవి ఒకనాడు ఒక పురుషునితో తాను కలసినట్లు కలకని, అంతకుముందే పార్వతి పల్కిన రీతిలో ఆ పురుషునిపట్ల గాఢమైన ప్రేమను కల్గినదై, తన ప్రాణసఖి అయిన చిత్రలేఖకు ఆ విషయాన్ని తెలిపింది. తాను స్వప్నంలో చూచిన పురుషుడు శ్రీకృష్ణుని పౌత్రుడని, ప్రద్యుమ్నుని కుమారుడై అనిరుద్ధుడని ఆమెవల్ల తెలిసికొని, "అతనిని పొందడానికి ఉపాయాన్ని చేయాలి" అని ఆ సఖిని (చిత్రలేఖను) ప్రార్థించింది. చిత్రలేఖ తన యోగవిద్య మహిమతో ద్వారకకు చేరి, అనిరుద్ధుని తీసికొనివచ్చి, అంతఃపురంలోకి చేర్చింది. ఉష అతనితో భోగాలను అనుభవిస్తూ ఉండగా, కొంతకాలానికి ఈ విషయాన్ని కావలి కాసేవారివల్ల తెలిసికొన్న బాణాసురుడు తన సేనతో అనిరుద్ధుని ఎదిర్చి, మాయతో పోరాడి, నాగాస్త్రంతో అతనిని కట్టి పడవేశాడు. ద్వారకలో అనిరుద్ధుడు కనబడనందువల్ల యాదవులందఱు కలత చెందగా నారదమహర్షివల్ల జరిగిన సంగతిని తెలిసికొన్న శ్రీకృష్ణభగవానుడు గరుడుని స్మరించి, మఱుక్షణమే ప్రత్యక్షమైన ఆ గరుడుని భుజాలపై అధిరోహించి, బలరాముడు మొదలైనవారితో బాణునిపురం శోణితనగరానికి వెళ్ళాడు. ఆ పట్టణసమీపంలో కావలి కాస్తున్న శివుడు, ప్రమథగణాలు భగవానుని ఎదిరించగా వారిని అందఱిని ఓడించాడు. తరువాత, శివునిచే ప్రయోగింపబడ్డ ఒక జ్వరదేవత మూడు కాళ్ళతో, మూడు తలలతో కూడినదై వచ్చి, బాణుని కాపాడడంకోసం శ్రీకృష్ణునితో యుద్ధం చేయగా, భగవానుడు తానుకూడా జ్వరదేవతను సృష్టించి, దానిశక్తితో శివుడు ప్రయోగించిన జ్వరదేవతను తఱిమి కొట్టాడు. తరువాత శివుని అనుచరుడైనందువల్ల, బాణుని కోటను చుట్టి ఉండి రక్షించే అగ్నిదేవతలు అయిదుగురు తనతో యుద్ధం చేయడానికి రాగా వారిని ధ్వంసం చేసి, బాణాసురునితో పోరాడడం ఆరంభించాడు. బాణునకు తోడుగా శివుడు, సుబ్రహ్మణ్యస్వామి మొదలైన పరివారంతో వచ్చి ఎదిరించి పోరాడగా, శ్రీకృష్ణుడు జృంభణాస్త్రాన్ని ప్రయోగించాడు. శివుని నిశ్చేష్టుడై,

ఆవులిస్తూ శక్తివిహీను డయ్యేటట్లు చేసి, సుబ్రహ్మణ్యుని, గణపతిని హుంకారాలతో నిర్జించి, తరువాత పలువేల సూర్యులతో సమానుడైన సుదర్శనుని గ్రహించి ప్రయోగించి, ఆ బాణుని వేయి బాహువులను ఖండించాడు. పరమశివుడు భగవానునివద్దకు వచ్చి పలు రీతులలో ప్రార్థించగా, బాణుని నాల్గు బాహువులను మాత్రం విడచి పెట్టాడు. తరువాత బాణుడు భగవానునకు నమస్కరించి అనిరుద్ధునకు ఉషాదేవిని ఇచ్చి వివాహం జరిపించగా, భగవానుడు చాలా సంతోషించి ద్వారకకు తిరిగి వచ్చాడు. సంగ్రహంగా ఈ కథ పాశురంలో ప్రస్తావింపబడింది.

**23.** **వైప్పాయ వాన్ పొరుళెన్రు, నల్లన్బర్ మనత్తకత్తే**
**ఎప్పోతుమ్ వైక్కు మిరామానుశనై, ఇరునిలత్తిల్**
**ఒప్పారిలాత వరువినైయేన్ వఞ్జనెఞ్జిల్ వైత్తు**
**ముప్పోతుమ్ వాழ்త్తువన్, ఎన్నా మితు అవన్ మెయ్పుకழ்క్కే.**

నల్ అన్బర్ = విలక్షణమైన భక్తిని కలవారు, వైప్పు ఆయ వాన్ పొరుళ్ ఎన్రు = "భగవద్రామానుజులే మనకు ఆపద్రక్షకమైన అక్షయధనం'' అని, మనత్తు అకత్తే = తన హృదయంలో, ఎప్పోతుమ్ వైక్కుమ్ = ఎల్లప్పుడు ధ్యానించడానికి విషయంగా నిలుపుకొనే, ఇరామానుశనై = భగవద్రామానుజులను, ఇరు నిలత్తిల్= ఈ విశాలమైన భూమిలో, ఒప్పార్ ఇలాత = సాటి లేని, ఉఱు వినైయేన్ = మహాపాపి అయిన నేను, వఞ్జమ్ నెఞ్జిల్ వైత్తు = (నా) కృత్రిమ మైన మనస్సులో నిలుపుకొని, ముప్పోతుమ్ వాழ்త్తువన్ = సర్వకాలం స్తుతిస్తున్నాను, ఇతు = చాలా పెద్దవారైన వారిని నేను స్తుతించడం అనే ఇది, అవన్ మెయ్ పుకழ்క్కు = ఆ మహాత్ముని యొక్క గొప్ప కీర్తికి, ఎన్ ఆమ్ = ఏమి అవుతుందో ! ఏమో ! (అవద్యకరమేమో!)

**"వழவేழులకిన్ ముదలాయ"** అనే దశకంలో ఆழ்వార్లు నైచ్యానుసంధానాన్ని చేసినట్లే, ఈ పాశురంలో ఈ అముదనార్ నైచ్యానుసంధానాన్ని చేస్తున్నారు.

''భగవద్రామానుజులు ఎటువంటివారు? అని అంటే, వారినే నిధిగా ఆశ్రయించిన విలక్షణభక్తియుక్తులైన కూరేశులు, ముదలియాణ్డాన్ మొదలైన మహాపురుషులచేత ధ్యానింపబడేవారు. అటువంటి విలక్షణమైన భక్తి నాకు ఉన్నదా? లేదు. మోసం కపటం నిండిన మనస్సును కలవాడను నేను. నావంటి మహాపాపులు ఈలోకంలో లేరు. ఆ భగవద్రామానుజులను చింతిచడానికి నేనా అర్హుడను? సర్వాత్మనా నేను అనర్హుడను ఆ విధంగా ఉన్నా, నన్ను నేను మఱచి వారిని



స్తుతించాలని తలపడ్డాను. వారి గొప్ప కీర్తికి నా స్తుతి అవద్యాన్ని కల్గిస్తుందికదా! అయ్యో! అన్యాయం చేశానే! అని అముదనార్ ఇందులో అలమటిస్తున్నారు. ఈ విధంగా పల్కడంకూడా ఒక విధమైన స్తోత్రప్రణాళి- అని గ్రహించాలి.

**24.** **మెయ్త్త వెమ్ తీవినైయాల్ పల్లుడల్ తొఱుమ్ మూత్తు, అతనాల్**
**ఎయ్త్తొழிన్దేన్ ముననాళ్కళెల్లామ్, ఇన్రు కణ్డుయర్న్దేన్**
**పొయ్త్తవమ్ పోఱ్ఱుమ్ పులైచ్చమయఙ్గళ్ నిలత్తవియ**
**క్కైత్త మెయ్ఞ్ఞానత్తు, ఇరామానుశ నెన్నుమ్ కార్తన్నైయే.**

మున నాళ్కళ్ ఎల్లామ్ = గడచిన అనాదికాలం అంతా, పల్ ఉడల్ తొఱుమ్ = పలు శరీరాలలో అంతా, మెయ్త్త = ఆత్మను ఆవరించి ఉండే, వెమ్ = అతిక్రూరమైన, తీ వినైయాల్ = దుష్కర్మలచేత, మూత్తు = ముసలితనం వచ్చేవరకు వాసం చేసి, అతనాల్ = అందుచే, ఎయ్త్తు ఒழிన్దేన్ = మిక్కిలి పరితాపాన్ని పొందాను, పొయ్ తవమ్ = కపటమైన అనుష్ఠానాలను, పోఱ్ఱుమ్ = అనుష్ఠించే, పులై చ్చమయఙ్గళ్ = నీచమతస్థులను, నిలత్తు అవియ = ఈ భూలోకంలో సమూలంగా నశించేటట్లు, కైత్త = నిరసించిన, మెయ్ ఞానత్తు = యథార్థమైన జ్ఞానాన్ని కల, ఇరామానుశన్ ఎన్నుమ్ కార్తన్నై = భగవద్రామానుజులనే కాలమేఘాన్ని, ఇన్రు కణ్డు = ఇపుడు దాసుడు (నేను) దర్శించి, ఉయర్న్దేన్ = ఉన్నతుడనయ్యాను.

చిరకాలంగా సంసారంలో పడి ఉండి పలు పలు దుష్కర్మలను చేసి, ఆ కర్మల ఫలంగా పలు పలు జన్మలను ఎత్తి, పడరాని పాట్లను పడి, ఈ విధంగానే అనేకమార్లు ఆపన్నుడనై ఉన్నాను. ఇపుడు పరమోదారులైన భగవద్రామానుజులు ఈ భూమిలో అవతరించి పలు దుర్మతాలను సమూలంగా నశింపజేసినట్లే, నా దుష్కర్మలనుకూడా సమూలంగా నశింపజేసి, తమ నిర్హేతుకకృపతో తమను దర్శింపజేయగా, దర్శించి కృతార్థుణ్ణి అయ్యాను.

**(పొయ్త్తవమ్ పోఱ్ఱుమ్ పులైచ్చమయఙ్గళ్)** - రావణసన్న్యాసం, కాలనేమిజపం మొదలైనవానివలె మతాంతరస్థులు కృత్రిమాలైన ఆచారాలను అనుష్ఠిస్తారు.

**(మెయ్ఞ్ఞానత్తిరామానుశన్)** - **"యథార్థంసర్వవిజ్ఞానమ్"** అని స్థాపించినవారు కదా భగవద్రామానుజులు.

25. కారేయ్ కరుణై యిరామానుశ ! ఇక్కడలిడత్తిల్
ఆరే యఱిపవర్ నిన్నరుళిన్ తన్మై, అల్లలుక్కు
నేరే యుఱైవిడమ్ నాన్ వన్దు నీ యెన్నై యుఱ్ఱపిన్ ఉన్
శీరే యుయిర్క్కుయిరాయ్, అడియేఱ్కిన్ఱు తిత్తిక్కుమే.

కార్ ఏయ్ = మేఘంతో పోలిన, కరుణై =కరుణను కల, ఇరామానుశ = భగవద్రామానుజా !, నాన్ =దాసుడనైన నేను, అల్లలుక్కు నేరే = దుఃఖాలను నేరుగా, ఉఱవు ఇడమ్ = వాసస్థానమై ఉన్నాను, ఎన్నై = ఇటువంటి నన్ను, నీ వన్దు ఉఱ్ఱ పిన్ = మీరు స్వయంగానే స్వీకరించిన తరువాత, ఉన్ శీరే = తమ కల్యాణగుణాలే, ఉయిర్క్కు ఉయర్ ఆయ్ = ఆత్మకు ధారకమై, అడియేఱ్కు= దాసుడనైన నాకు, ఇన్ఱు తిత్తిక్కుమ్ = ఇపుడు రుచిస్తున్నవి, నిన్ అరుళిన్ తన్మై= నీకృపయొక్క స్వభావాన్ని, ఇకడల్ ఇ డత్తిల్ = సముద్రపరివేష్ఠితమైన ఈ భూమండలంలో, ఆరే అఱివార్ = తెలియగల్గిన వారెవరూ లేరు.

జలస్థలవిభాగాన్ని గమనించకుండా సర్వత్ర వర్షించే మేఘంవలె, నీచులు, ఉన్నతులు- అనే భేదం చూడకుండా అందఱిపట్ల దయచూపుతున్న ఓ భగవద్రామానుజా! చాలా క్రూరమైన దుఃఖాలకు అన్నిటికీ వాసస్థానం అయిన నన్ను మీరే వచ్చి స్వయంగా అనుగ్రహించిన తరువాత తమ కల్యాణగుణాలే నాకు పరమభోగ్యంగా, ఆత్మధారకంగా అయినవి. తమరు కృపామాత్ర ప్రసన్నాచార్యులనే విషయాన్ని ఈ లోకంలో యథాతథంగా ఎవరూ తెలియలేరు.

26. తిక్కుఱ్ఱ కీర్త్తి యిరామానుశనై, ఎన్శెయ్ వినైయామ్
మెయ్క్కుఱ్ఱమ్ నీక్కి విళఙ్గియ మేకత్తై, మేవుమ్ నల్లోర్
ఎక్కుఱ్ఱవాళర్ ఎతుపిఱప్పేతియల్వాక నిన్ఱోర్
అక్కుఱ్ఱ మప్పిఱప్పు, అవ్వియల్వే నమ్మై యాట్కొళ్ళుమే.

ఎన్ శెయ్ వినై ఆమ్ = నాచే చేయబడ్డ కర్మలు అనే, మెయ్ కుఱ్ఱమ్ నీక్కి = స్థిరమైన దోషాలను పోగొట్టి, విళఙ్గియ = (ఇతని దోషాలను పోగొట్ట గలిగాము కదా! అనే సంతోషంతో) ఉజ్జ్వలులైన, మేకత్తై = (మేఘంవలె) పరమోదారులై, తిక్కు ఉఱ్ఱ కీర్త్తి = అన్ని దిశలలోను విస్తరించిన కీర్తిని కల్గిన వారైన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, మేవుమ్ = (భక్తితో), ఆదరించే, నల్లోర్= సత్పురుషులు, ఎ క్కుఱ్ఱవాళర్ = ఏ దోషాన్ని కలవారైనా, ఎతు పిఱప్పు = ఏ జన్మను కలవారై, ఎతు ఇయల్వు ఆక = ఏ చరిత్రను కల వారై, నిన్ఱోర్ = ఇతః



పూర్వం ఉన్నారో, అ క్కుఱ్ఱమ్ = ఆ దోషం, అ ప్పిఱప్పు = ఆ జన్మ, అ ఇయల్వే = ఆ చరిత్రయే నమ్మై = మనలను, ఆళ్ కొళ్ళుమ్ = దాసులనుగా చేస్తుంది, (శేషభూతులనుగా చేస్తుంది).

నా పాపాలను పోగొట్టి గొప్ప కీర్తిని పొందిన పరమోదారుడైన భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారు, ఆశ్రయించడానికి ముందు ఏ దోషాలను కలవారుగాను, ఏ జన్మను కలవారుగాను, ఏ నడతను కలవారుగాను ఉన్నారో, ఆ దోషమే, ఆ జన్మమే, ఆ నడతయే మనలను శేషభూతులను చేస్తాయి. అనే ఈ సూక్తిలోని తాత్పర్యం ఏమంటే - ఈ విధమైన అధమప్రవర్తన, అధమ కులం, జ్ఞానహైన్యం- అనే వీటిని కల్గిన మనంకూడా వీరివలె భగవద్రామానుజులను ఆశ్రయించి ఉజ్జీవించవచ్చు.'' అని మనవంటివారికి ఒక ధైర్యాన్ని కల్గించడంకోసమే ఆ మహాత్ములు ఆ విధంగా జ్ఞానవృత్తవంశాలతో నిహీనులై ప్రవర్తించారు- అనే అధ్యవసాయ (నమ్మకం) విశేషాన్ని చూపడమే ఈ పాశురం లోని భావం. వారి జాత్యాదులు ఎటువంటివి అయినా, వారు అందఱు ఆ విధంగానే మనకు ఉద్దేశ్యభూతులు- అని తెలిపినట్లయింది.

27. కొళ్ళ క్కుఱైవఱ్ఱిలఙ్గి, క్కొழுన్దు విట్టోఙ్గియ ఉన్
వళ్ళల్తనత్తినాల్ వల్వినైయేన్ మనమ్ నీ పుకున్దాయ్,
వెళ్ళై చ్చుడర్విడు మున్ పెరుమేన్మైక్కిழுక్కితెన్ఱు
తళ్ళుఱ్ఱిరఙ్గుమ్, ఇరామానుశ! ఎన్ తని నెఞ్జమే.

ఇరామానుశ = భగవద్రామానుజా!, కొళ్ళ కుఱైవు అఱ్ఱు ఇలఙ్గి = ఎంత గ్రహించినా ఏమి కొఱత లేకుండా వెలిగి, కొழுన్దు విట్టు ఓఙ్గియ = ఇంకా ఇంకా అభినవంగా వృద్ధి చెందుతున్న, ఉన్ వళ్ళల్తనత్తినాల్ = నీ ఔదార్యస్వభావంచే, వల్ వినైయేన్ మనమ్ = మహాపాపి అయిన నా మనస్సులో, నీ పుకున్దాయ్ = (నీ గొప్పతనాన్ని గమనించకుండా) వచ్చి ప్రవేశించావు, ఇతు = వశిష్ఠుడు ఛండాలగృహంలోకి ప్రవేశించినట్లుగా ఉండే) ఈ ప్రవేశం, శుడర్ విడుమ్ = వెలుగుతున్న, ఉన్ పెరు మేన్మైక్కు = నీ ప్రభావానికి, ఇழுక్కు ఎన్ఱు = అవద్యావహం అని, ఎన్ తని నెఞ్జమ్ = నా నిస్సహాయమైన (అనన్యగతి అయిన) మనస్సు, తళ్ళుఱ్ఱు ఇరఙ్గుమ్ = ఆర్తిచెంది అభినివేశాన్ని పొందుతున్నది.

స్వామీ! నీ గొప్పతనాన్ని, దాసుడనైన నా నైచ్యాన్ని కొంచెంకూడా గమనించకుండా "ఇతడు మన దాసుల విషయంలో చాపల్యాన్ని కలవాడు'' అని ఇంత

మాత్రమే గమనించి, పరమపాపిష్ఠివాడనైన నా హృదయంలో నీవు ప్రవేశించావు. వశిష్ఠుడు ఛండాలుని ఇంటిలోకి ప్రవేశించినట్లుగా నీవు నా మనస్సులో ప్రవేశించడం పరిశుద్ధమై వెలిగే నీ మహిమకు అవద్యాన్ని కల్గిస్తుందో! ఏమో! అని భయపడు తున్నాను.

**28.** **నెఞ్జిల్ కఱై కొణ్డ కఞ్జనై క్కాయ్న్ద నిమలన్, నజ్గళ్**
**పఞ్జిత్తిరువడి పిన్నైతన్ కాతలన్, పాతమ్ నణ్ణా**
**వఞ్జర్క్కరియ ఇరామానుశన్ పుక*ళ్*న్టి యెన్ వాయ్**
**కొఞ్జి ప్పరవకిల్లాతు, ఎన్న వా*ళ్*విన్ను కూడియతే.**

నెఞ్జిల్ = మనస్సులో, కఱై కొణ్డ = కల్మషాన్ని కల్గినవాడైన, కఞ్జనై = కంసుని, కాయ్న్ద = నిరసించిన (సంహరించిన), నిమలన్ = హేయప్రత్యనీకుడై, నజ్గళ్ పఞ్జి తిరువడి = ఆశ్రితులపట్ల అభిమానాన్ని కల్గినదై, దూదివలె సుకుమారాలైన శ్రీచరణాలను కల్గినదైన, పిన్నై తన్ కాతలన్ = నప్పిన్నైపిరాట్టికి వల్లభుడైన శ్రీకృష్ణునియొక్క, పాతమ్ నణ్ణా = శ్రీచరణలను ఆశ్రయించని, వఞ్జర్క్కు = ఆత్మాపహారాన్ని చేసిన చోరులకు, అరియ = దుర్లభులైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, పుక*ళ్* అన్టి = కల్యాణగుణాలను తప్ప (వేఱొక విషయాన్ని) ఎన్ వాయ్ = నా వాక్కు, కొఞ్జి పరవకిల్లాతు = ఆశపడి కీర్తించలేదు, ఎన్న = ఆశ్చర్యకరమైనది.

నిన్నటివరకు పదార్థం కానివాడనై పడి ఉన్న నేను ఈ నాడు సత్తను పొంది ఉజ్జీవించిన అతిశయాన్నిగూర్చి చెప్పడం సాధ్యమా! "ఈనాడు మీకు వచ్చిన అతిశయం ఏమి?" అని ప్రశ్నిస్తున్నారా ? భగవద్రామానుజుల గుణకీర్తనంలో నిన్నటివరకు ఉదాసీనుడనై పడి ఉన్న నా వాక్కు (జిహ్వా) ఇపుడు వారి దివ్యయశస్సులను తప్ప వేఱు దేనిని అనుసంధించకూడదు- అని అందులోనే ఊనికను కల్గి ఉన్నదే! ఇంతకంటే ఆశ్చర్యం ఇంకొకటి ఉంటుందా! అని అంటున్నారు.

భగవద్రామానుజులు ఎటువంటివారు? అని అంటే, భగవానునిపట్ల భక్తిని కలవారికి తప్ప వేఱెవ్వరికీ పొందడానికి సాధ్యం కానివారు. భగవద్భక్తులకు పరమసులభులు- అని భావం.

**(నెఞ్జిల్ కఱై కొణ్డ కఞ్జన్)** - తనను వధించడంకోసం పుట్టిన దేవకీపుత్రుడు యశోదవద్ద రహస్యంగా పెరగడం మొదలైన వృత్తాంతాలను నారదుడు చెప్పగా



విన్న కంసుడు శ్రీకృష్ణునిపట్ల పూర్తిగా మాత్సర్యాన్ని కలవాడై, పలు రీతులో ఆ స్వామిని వధించే దారులను వెదకడానికి ఆరంభించాడు, చివరకు ధనుర్యాగమనే నెపంతో శ్రీకృష్ణుని మధురకు పిలిపించి, చంపాలని చూచాడు. కంసుని సభలో శ్రీకృష్ణుడు వేగంగా పైకి ఎగసి కంసుడుండే వేదిక పైకి ఎక్కి, అతనికి కిరీటం గిరగిర తిరిగి కిందకు పడేటట్లు అతని జుట్టు పట్టుకొని భూమిపైకి తోసివేసి, అతనిపై తాను పడి అతనిని వధించాడు- అనే వృత్తాంతం అనుసంధేయం.

**(నజ్గళ్ పఞ్జిత్తిరువడి పిన్నైతన్ కాతలన్)** - మనకు పురుషకారాన్ని చేయడమే వ్యాపారంగా కల్గినది, పరమసుకుమారాలైన శ్రీచరణాలను కల్గినది అయిన నప్పిన్నైప్పిరాట్టికి నాథుడు- అని భావం.

ఈవిధంగా కంసుని వధించిన, నీళాదేవీనాథుడైన శ్రియఃపతిపట్ల భక్తి లేని పాపులకు దుర్లభులైన భగవద్రామానుజుల కీర్తినే ఈనాడు కీర్తించగల్గిన నేను సాటి లేని ఉజ్జీవనాన్ని పొందాను -అని తాత్పర్యం.

**29.** **కూట్టుమ్ విది యెన్ఱు కూడుజ్గొలో, తెన్కురుకైప్పిరాన్**
**పాట్టెన్నుమ్ వేతప్పశున్దమి*ళ్* తన్నై, త్తన్పత్తి యెన్నుమ్**
**వీట్టిన్కణ్ వైత్త ఇరామానుశన్ పుక*ళ్* మెయ్యుణర్న్దోర్**
**ఈట్టజ్గళ్తన్నై, ఎన్ నాట్టజ్గళ్ కణ్డిన్బమెయ్తిడవే.**

తెన్ కురుకై పిరాన్ = నమ్మా*ళ్వా*ర్ల, పాట్టు ఎన్నుమ్ = పాశురాలు అని ప్రసిద్ధమై, వేదమ్ =వేదరూపమై, పశుమ్ తమి*ళ్*తన్నై = అందమైన ద్రావిడభాషలో ఉండే తిరువాయ్మొ*ళ్*ిని, తన్ పత్తి ఎన్నుమ్ వీట్టిన్ కణ్ = తన భక్తి అనే భవనంలో, వైత్త =స్థాపించిన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, పుక*ళ్* = కల్యాణగుణాలను, మెయ్ ఉణర్న్దోర్ = యథాతథంగా తెలిసినవారి, ఈట్టజ్గళ్ తన్నై =గుంపులను, ఎన్ నాట్టజ్గళ్ కణ్డు = నా నేత్రాలు సేవించి, ఇన్బమ్ ఎయ్తిడ= ఆనందించేటట్లు, కూట్టుమ్ విది = కలుపగల (వారి) కృప, ఎన్ఱు కూడుమ్ కొల్= ఏనాటికి సంభవిస్తుందో కదా (లభిస్తుందో కదా !)

నమ్మా*ళ్వా*ర్లు అనుగ్రహించిన వేదాన్ని భక్తితో అనుసంధించే భగవద్రామానుజుల కల్యాణగుణాలను యథాతథంగా తెలిసి, అభినివేశాన్ని పొందే మహాత్ముల గోష్ఠులను దాసుడనైన నేను సేవించి ఆనందించే భాగ్యం ఏనాటికి లభిస్తుందో కదా!- అని అంటున్నారు.

**(కూట్టుమ్ వితి ఎన్రు కూడుఙ్గొలో)** - విధి అంటే అదృష్టం. భగవద్రామానుజుల అనుగ్రహమే ఇక్కడ **'వితి'** అని అనబడుతున్నదని భావం. **"కూట్టుమ్ వితి"**- అని విశేషణంగా అన్వయించి, ఈ ప్రాప్యాన్ని మనకు పొందించే వారి కృప- అని చెప్పవచ్చు.

**(తన్ పత్తి యెన్నుమ్ వీట్టిన్కణ్ వైత్త)** - వెల ఉన్నతంగా కల మాణిక్యాన్ని భరణిలో దాచుకొనేవారివలె అనర్ఘమైన శ్రీసూక్తిని తమ భక్తి అనే ఉన్నతమైన భవనంలో పెట్టుకొని ఆరాధిస్తున్న శ్రీరామానుజులు- అని భావం. **"నాట్టమ్"** -నేత్రం.

**30.** ఇన్బమ్ తరు పెరువీడు వన్దెయ్‌తిలెన్, ఎణ్ణిఅన్ఱ
తున్బమ్ తరు నిరయమ్ పల శూళ్ిలెన్, తొల్లులకిల్
మన్‌పల్లుయిర్ కట్కు ఇఱైయవన్ మాయనెన మొళ్ిన్ద
అన్బననకన్, ఇరామానుశ నెన్నై యాణ్డననే.

తొల్ ఉలకిల్ = అనాది అయిన ఈ లోకంలో, మన్ పల్ ఉయిర్‌కట్కు = నిత్యులైన జీవాత్మలకు అందటికి, ఇఱైవన్ =శేషి అయిన, మాయన్ = విష్ణువే, ఎన మొళ్ిన్ద = అని (శ్రీభాష్యంమూలంగా) అనుగ్రహించిన, అన్బన్ = పరమకారుణికులై, అనకన్ = నిర్దోషుడైన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్నై ఆణ్డవన్ = నన్ను దాసునిగా స్వీకరించారు, (అందువల్ల) ఇన్బమ్ తరు = ఆనందాన్ని కల్గించే, పెరు వీడు = మోక్షం, వన్దు ఎయ్‌తిల్ ఎన్ = సిద్ధిస్తే మాత్రం ఏమి?, ఎణ్ ఇఅన్ఱ =అంతు లేని (లెక్క లేని) తున్బమ్ తరు = దుఃఖాలను ఇచ్చే, పల నిరయమ్ = పలు నరకాలు, శూళ్ిల్ ఎన్ = చుట్టుముడితే మాత్రం ఏమి?

**"ఇరామానుశన్‌పుకళ్ మెయ్యుణర్‌న్దోర్ ఈట్టఙ్గళ్ తన్నై ఎన్ నాట్టఙ్గళ్ కణ్డు ఇన్బమెయ్‌తిడ - కూట్టుమ్ వితి ఎన్రు కూడుఙ్గొలో !"** (భగవద్రామానుజుల కీర్తిని వాస్తవంగా తెలిసినవారి సమూహాలను నా కన్నులు దర్శించి ఆనందించే టట్లుగా చేసేవారి కృప ఎపుడు కల్గుతుందో కదా !) అని ఆశంసించిన అముదనార్‌ను చూచి "ఏమండీ ! ఇంతమాత్రమే నా మీకు కావలసినది ? ఇక, పరమపద ప్రాప్తి మొదలైనవి ఏవీ మీకు అక్కరలేదా!'' అని ప్రశ్నించగా, "భగవద్రామానుజులు నన్ను తమ దాసునిగా చేసికొన్న తరువాత నాకు మోక్షం లభిస్తే ఏమి ? ప్రబల నరకాలు కల్గితే ఏమి ? నాకు ఏది పరమప్రాప్యమో అది లభించింది, చాలు'' అని నిర్ద్వంద్వంగా పల్కుతున్నారు. **"నిరయమ్"** - ఇది సంస్కృతపదవికృతి. **"అనకన్"**- **"అనఘః"** అనే సంస్కృతపదవికృతి. హేయప్రతిభటుడని అర్థం.



**31.** ఆణ్డుకళ్ నాళ్ తిఙ్గళాయ్, నికళ్ కాల మెల్లామ్ మనమే
ఈణ్డు పల్‌యోనికళ్‌తోఱు ఉళ్ల్వోమ్, ఇన్ఱోరెణ్ణిన్ఱియే
కాణ్డకుతోళణ్ణల్ తెన్నత్తియూరర్ కళ్లిణైక్కీళ్
పూణ్డవన్బాళన్, ఇరామానుశనై ప్పొరున్దినమే.

మనమే = ఓ మనసా!, నాళ్ ఆయ్ = దినాలుగాను, తిఙ్గళ్ ఆయ్ =మాసాలుగాను, ఆణ్డుకళ్ ఆయ్ = సంవత్సరాలుగాను, (ఈ విధంగా), నికళ్ కాలమ్ ఎల్లామ్ = నడిచే కాలాలు అన్నిటిలోను, ఈణ్డు పల్ యోనికళ్ తోఱు = పలు సంఖ్యలో పలు రీతులలోని జన్మలు అన్నిటిలో, ఉళ్ల్‌వోమ్ = పరిభ్రమించిన మనం, ఇన్ఱు ఓర్ ఎణ్ ఇన్ఱియే = ఈ నాడు ఏ భావన లేకపోయినా, (అకస్మాత్తుగా), కాణ్ తకు తోళ్ = కళ్ళార దర్శించదగిన బాహువులను కల, అణ్ణల్ = స్వామి అయిన, తెన్ అత్తియూరర్ = అందమైన హస్తిగిరిలోని వరదరాజస్వామియొక్క, కళ్ల్ ఇణై కీళ్ = శ్రీచరణాలలో, పూణ్డ అన్బు ఆళన్ = భక్తిని కల్గిన, ఇరామానుశనై = శ్రీరామానుజులను, పొరున్దినమ్ = చేరగలిగాము, (ఏమి అదృష్టం!)

ఓ మనసా ! ఈనాటివరకు మనకు గడచిన కాలాలు లెక్కపెట్టలేనివి. సంవత్సరాల లెక్కలో, నెలలలో లెక్కలో, దినాల లెక్కలో నడుస్తున్న కాలం అంతా **"మాఱి మాఱి పలపిఱప్పుమ్ పిఱన్దు"** (మాటి మాటి పలు జన్మలను జన్మించి) తల్లడిల్లితిరిగే మనం ఈనాడు ఏ స్మరణ లేకుండా అకస్మాత్తుగా భగవద్రామానుజుల శ్రీచరణాలను సేవించగలిగాముకదా! మన అదృష్టం ఎటువంటిదో? చూచావా! - అని అంటూ తమ మనస్సుతో అముదనార్ ఆనందంగా పల్కుతున్నారు.

**"ఈణ్డు పల్‌యోనికళ్‌తోఱు"**- **"ఈణ్డుతల్"** - సమూహం కావడం, సమూహమై పలు రీతులలోని జన్మలు అంటే -ప్రత్యేక ప్రత్యేకంగా లెక్కించి, **'ఇన్ని'** అని చెప్పడానికి సాధ్యం కాని రీతిలోనే కాక, గుంపులు గుంపులుగా కూడా లెక్కించి ముగించడం సాధ్యం కాని రీతిలో పలువిధాలైన యోనులు- అని భావం. **"ఉళ్ల్‌వోమ్"** -భూతకాలం ఇక్కడ వివక్షితం. ''ఈనాటి వరకు తడబడి తిరిగిన మనం'' అని అర్థం.

**32.** పొరున్దియ తేశుమ్ పొఱైయుమ్ తిఱలుమ్ పుకళ్లుమ్, నల్ల
తిరున్దియ ఞానముమ్ శెల్వముమ్ శేరుమ్, శెఱు కలియాల్
వరున్దియ ఞాలత్తై వణ్మైయినాల్ వన్దెడుత్తళిత్త
అరున్దవన్, ఎఙ్గళిరామానుశనై యడైపవర్క్కే.

శెఱు కలియాల్ = (ధర్మమార్గాన్ని) కలుషితం చేస్తున్న కలిచేత, వరున్దియ= దుఃఖింపజేయబడ్డ, ఞాలత్తై = భూమిని, వణ్మైయినాల్ = తమ నిర్హేతుకకృపతో, వన్దు ఎడుత్తు అళిత్త = వచ్చి ఉద్ధరించి రక్షించినవాడు, అరుమ్ తవన్ = శరణాగతి అనే అరుదైన తపస్సును అనుష్ఠించినవారు, ఎజ్గళ్ =మాకు స్వామి అయిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, అడైపవర్క్కు = ఆశ్రయించినవారికి, పొరున్దియ తేశుమ్ = స్వరూపానురూపం అయిన తేజస్సు, పొఱైయుమ్ = క్షమాగుణం, తిఱలుమ్ = జితేంద్రియత్వమనే ఫలం, పుకழుమ్ = కీర్తి, నల్ల తిరున్దియ = చక్కగా సంస్కరింపబడ్డ (పరమవిలక్షణమైన), ఞానముమ్ =జ్ఞానం, శెల్వముమ్ = భక్తి అనే సంపద, శేరుమ్ = తానే వచ్చి చేరుతాయి.

**"ఇరామానుశనై ప్పొరున్దినమే"** -అని మనస్సులో ఆనందించి పల్కిన అముదనార్‌ను చూచి కొందఱు "మీవలెనే మేముకూడా భగవద్రామానుజులను ఆశ్రయిస్తామని చూస్తే, మీవలె మాకు ఆత్మగుణ లేశంకూడా లేదే ! మాకు వారిని పొందే అధికారం లేదే! అని పల్కి బాధపడగా, వారిని చూచి అముదనార్ కలికలుష నివర్తకులైన మన రామానుజులను ఆశ్రయించినవారికి స్వరూపాను రూపమైన గౌరవం, **"కళిప్పుమ్ కవర్వు మఱ్ఱు"** అని చెప్పబడ్డ క్షమాగుణం, జితేంద్రియత్వ మనే బలిమి, గుణశాలురు అనే కీర్తి, తత్త్వహిత పురుషార్థాలలో స్వచ్ఛమైన జ్ఞానం, భక్తి అనే గొప్ప సంపద. అనే ఇవి అన్నీ తమకు తామే వచ్చి చేరుతాయి- అందువల్ల మీరుకూడా భ్రమించకుండా వచ్చి ఆశ్రయించవచ్చు'' అని అంటున్నారు.

**33.** అడైయార్కమలత్తులర్మకళ్ కేళ్వన్, కైయాழి యెన్నుమ్
పడైయోడు నాన్దకముమ్ పడర్తణ్డుమ్, ఒణ్ శార్జ్గవిల్లుమ్
పుడైయార్ పురిశజ్గము మిన్ద ప్పూతలమ్ కాప్పతఱ్కెన్ఱు,
ఇడైయే ఇరామానుశముని యాయిన ఇన్నిలత్తే.

అడై ఆర్ కమలత్తు అలర్ మకళ్ = దళాలు నిబిడంగా ఉండే తామరపూవులో అవతరించిన, లక్ష్మీదేవికి, కేళ్వన్ = వల్లభుడు అయిన భగవానునియొక్క, కై = శ్రీహస్తంలో (వెలుగుతున్న), ఆழి ఎన్నుమ్ పడైయోడు = శ్రీసుదర్శనం అనే దివ్యాయుధంలో, నాన్దకముమ్ = నందకమనే ఖడ్గం, పడర్ తణ్డుమ్ = రక్షణకార్యంలో వ్యాపించి ఉండే గద, ఒణ్ శార్జ్గమ్ విల్లుమ్ =అందమైన శ్రీశార్జ్గ మనే విల్లు, పుడై ఆర్ పురి = ఒక పక్క తానే ఆభరణంగా ఉండడంలో తగినదైన, అందమైన శ్రీపాంచజన్యం -అనే ఈ అయిదు దివ్యాయుధాలు, ఇన్ద పూతలమ్



కాప్పదఱ్కు ఎన్ఱు = ఈ భూమిని రక్షించడంకోసం, ఇన్నిలత్తు = ఈ భూమండలం లో, ఇరామానుశముని ఇడైయే ఆయిన = భగవద్రామానుజుల పక్షంలో అయినవి.

గడచిన పాశురంలో, భగవద్రామానుజులను ఆశ్రయిస్తే సద్గుణాలన్నీ తమకు తామే వచ్చి చేరుతాయి- అని అన్నారు. ఆ మాటను ఆలకించి కొందఱు - "జితేంద్రియత్వం మొదలైన అరుదైన ఫలాలు శ్రీసుదర్శనాది దివ్యాయుధాల అనుగ్రహంవల్లకదా కలుగుతాయి ! మానవులలో ఒకరైన భగవద్రామానుజులను ఆశ్రయించిన మాత్రంలో అవి కల్గుతాయా ?- అని శంకించగా, ఆ పంచాయుధాలు లోకరక్షణార్థంగా భగవద్రామానుజులలో ఆశ్రయాన్ని పొందాయి- అని అముదనార్ ఈ పాశురంలో అంటున్నారు.

**"అడైయార్ కమలత్తలర్ మకళ్కేళ్వన్ కైయాழి ఎన్నుమ్ పడైయోడు నాన్దకముమ్ పడర్ తణ్డుమ్ ఒణ్ శార్జ్గ విల్లుమ్ పుడైయార్ పురి శజ్గముమ్ ఇన్ద ప్పూతలమ్ కాప్పదఱ్కెన్ఱు ఇన్నిలత్తే ఇరామానుశముని యిడైయే ఆయిన"** అని అన్వయించాలి. పంచాయుధాలు వీరిపట్ల ఆశ్రయాన్ని పొందడం అంటే- వీరి అభిప్రాయాన్ని గమనిస్తూ ఉండి, వీరు చేయదలచిన కార్యానికి సహకరించడమే; అంబరీషునకు శ్రీసుదర్శనం సహకరించినట్లుగా.

ఈ పాశురాన్ని ఇంకొక విధంగాకూడా అన్వయించే అవకాశం ఉన్నది. **"అడైయార్ .... పుడైయార్ పురిశజ్గముమ్ ఇన్ద ప్పూతలమ్ కాప్పదఱ్కెన్ఱు ఇన్నిలత్తిలిడైయే ఇరామానుశన ముని ఆయిన"** అని అన్వయించాలి. ఈ పక్షంలో పంచాయుధాలే ఈ లోకాన్ని రక్షించడంకోసం భగవద్రామానుజులుగా అవత రించాయి- అని తాత్పర్యం.

**34.** నిలత్తై చ్చెఱుత్తుణ్ణుమ్ నీశక్కలియై, నినైప్పరియ
పెలత్తై చ్చెఱుత్తుమ్ పిఱజ్గియతిల్లై, ఎన్ పెయ్వినై తెన్
పులత్తిల్ పొఱిత్త వప్పుత్తకచ్చుమ్మై పొఱుక్కియ పిన్
నలత్తై ప్పొఱుత్తతు, ఇరామానుశనతన్ నయప్పుకழే.

ఇరామానుశన్‌తన్ = భగవద్రామానుజుల, నయమ్ పుకழ్ = కల్యాణ గుణాలు, నిలత్తై = భూలోకాన్ని, శెఱుత్తు ఉణ్ణుమ్ = హింసించి భక్షించే, నీశమ్ = నీచుడైన, కలియై = కలిపురుషునియొక్క, నినైప్పు అరియ = ఇంతటిది అని భావించడానికి సాధ్యం కాని రీతిలో అంతు లేనిదైన, పెలత్తై = పరాక్రమాన్ని, శెఱుత్తుమ్ = నిరసించినా, పిఱజ్గియతు ఇల్లై = ప్రకాశించ లేదు, (అయితే అవి

ఎపుడు ప్రకాశించాయి ? అని అంటే) ఎన్ పెయ్ వినై = నాచే చేయబడ్డ పాపాలను, తెన్ పులత్తిల్ = యమలోకంలో, పొఱిత్త = వ్రాసిన, అ ప్పుత్తకమ్ శుమ్మై = ఆ పుస్తకాల కట్టలను, పొఱుక్కియ పిన్ = బూడిద చేసిన తరువాత, నలత్తై పొఱుత్తతు = ప్రకాశాన్ని పొందింది.

భగవద్రామానుజుల జ్ఞానం, శక్తి - మొదలైన కల్యాణగుణాలు ఎపుడు ప్రకాశించాయి? అని అంటే, ఈ భూలోకంలో కలిపురుషుడు ఆజ్ఞాదండాన్ని చెల్లుబాటు చేయలేని రీతిలో అతని బలిమి నిరసించి, కృతయుగధర్మమే అంతటా ప్రవర్తించేటట్లు చేయగానే, "వీరు మహాపురుషులు; అరుదైన గొప్ప జ్ఞానశక్తులను కలవారు'' అని లోకులు అందఱు కీర్తిస్తున్నందువల్ల కలిపురుషుని క్రౌర్యాన్ని నశింపజేసిన కారణంవల్లనే వీరి కల్యాణగుణాలు బాగా ప్రకాశించాయి- అని కొందఱు అంటారు. కాని, అది సరి కాదు. కలిదోషాన్ని పోగొట్టినప్పటికీ భగవద్రామానుజుల కల్యాణగుణాలు పూర్తిగా ప్రకాశించలేదు. మఱి, ఎపుడు ప్రకాశించాయి? అని అంటే, నా, అంతు లేని పాపాలను అన్నిటినీ చిత్రగుప్తుడు వ్రాసి ఉంచిన పెద్ద పుస్తకాల భారాన్ని బూడిద చేసి, నన్ను నిష్కల్మషునిగా చేసి, దాసునిగా చేసికొన్నారు -అనే విషయం వ్యక్తమైన తరువాతనే వారి కల్యాణగుణాలు ఆశ్చర్యకరంగా ప్రకాశించాయి- అని అముదనార్ అంటున్నారు.

ఇందువల్ల, తమ పాపాలు సర్వశక్తి అయిన భగవంతునివల్లకూడా పోగొట్ట డానికి వీలుకానివి- అని, కలిపురుషుని క్రౌర్యంకంటే తమ పాప క్రౌర్యం ఇంకా బలమైనదని, ఈ విధంగా మహాపాపిష్ఠుడై ఉండే తమను క్షమించి ఉజ్జీవింప చేయడాన్ని చూచి లోకంలోని వారు అందఱు ఆశ్చర్యపడ్డారని తెలుప బడింది.

**(నిలత్తై చ్చెఱుత్తుణ్ణుమ్)** - భూమిలో ఉండే సకలజనులు తమ మనస్సు పోయిన దారిలో వక్రంగా ప్రవర్తించేటట్లుగా దుర్బుద్ధిని కల్గించి, ఈ జగత్తును పాడుచేసే కలిపురుషుడు- అని భావం. రెండవ పాదంలో -**"పలత్తై చ్చెఱుత్తుమ్"** అనే పాఠం వ్యవహరింపబడుతూ ఉన్నా **"పెలత్తై"** అనే పాఠమే సత్సంప్రదాయసిద్ధం. అర్థం ఒకటే. యత్యనుగుణంగా అయితే **"పెలత్తై"** అనే పాఠమే ఉండాలి. **"జయమ్"** అనే పదం **"జెయమ్"** అని, **"కరుడన్"** అనే పదం **"కెరుడన్"** అని, **"శణ్బకమ్"** అనే పదం **"శెణ్బకమ్"** అని ప్రయోగింపబడడం గమనార్హం. తిరుప్పళ్ళి యెழுచ్చిలోని తొమ్మిదవ పాశురంలో **"కీతజ్గళ్ పాడివర్"** అనే దానికి తగినట్లు **"కెన్దరువరుమ్"** అని ప్రయోగింపబడడాన్ని చూడవచ్చు.



**"పుత్తకమ్"**- పుస్తకం. **"శుమ్మై"**- శుమై - భారం. **"పొఱుక్కు‌తల్"**- బూడిద చేయడం, నిప్పుపెట్టడం. **"తిరణరకెణ్ణియ శిత్తిరగుత్తన్ తెరిత్తు వైత్త, కరుణైయి లేటియ శూழ్వినై ముగ్ఱుమ్ తుఱన్దనమే"** అనే శ్రీదేశికుల ప్రబంధంలోని పాశురం ఇక్కడ స్మరణీయం.

**35.** నయవే నొరు దెయ్‌వమ్ నానిలత్తే, శిల మానిడత్తై
పుయలే యెన క్కవిపోగ్ఱ్రి శెయ్యేన్, పొన్నరఙ్గమెన్నిల్
మయలే పెరుకు మిరామానుశన్ మన్ను మామలర్‌త్తాళ్
అయరేన్, అరువినై ఎన్నై యెవ్వాఱిన్ఱడర్‌ప్పతువే.

ఒరు దెయ్‌వమ్ = వేఱొక దైవాన్ని, నయవేన్ = కోరను (ఆశ్రయించను), నాల్ నిలత్తే = ఈ లోకంలో, శిల మానిడత్తై = కొందఱు నీచమానవులను ఉద్దేశించి, పుయలే ఎన = మేఘంవలె వర్షించే ఉదారుడా ! అని అతిశయోక్తిగా పల్కి, కవి పోగ్ఱ్రి శెయ్యేన్ = కవిత్వాన్ని అల్లి స్తుతించను, పొన్ అరఙ్గమ్ ఎన్నిల్ = శ్రీరంగం అని పల్కగానే, మయల్ పెరుకుమ్ = అంతు లేని వ్యామోహాన్ని పొందుతున్న, ఇరామానుశన్ =భగవద్రామానుజుల, మన్ను మా తాళ్ మలర్ = మన్నికగా ఉండే గొప్ప శ్రీచరణపద్మాలను, అయరేన్ = మఱువను (అందువల్ల), అరు వినై = క్రూరపాపాలు, ఎన్నై = నన్ను, ఇన్ఱు = ఈనాటినుండి, ఎవ్వాఱు అడర్‌ప్పతు = ఏవిధంగా ఆక్రమించగలవు ?

మీ పాపాలన్నీ భగవద్రామానుజులు అనుగ్రహంవల్ల అగ్నిలో పడవేసిన దూదివలె నశించిపోయాయి- అని అనేటట్లు పల్కిన ఆనందిస్తున్నారే ! ఈ ప్రకృతి మండలంలోనేకదా మిమ్ములను నిలిపి ఉంచినది. మళ్ళీ మీకు పాపాలు వచ్చి చేరవా? అని అంటూ అముదనార్‌ను కొందఱు ప్రశ్నించగా, ఇక అవి ఏ సమయంలోను నా దరి చేరే అవకాశం లేదు- అని అంటున్నారు- ఇందులో. భగవద్రామానుజులు తప్ప వేఱొక దైవం ఉన్నట్లు నేను భావించడం లేదు. ఇక, ఏనాడూ భావించబోవడం లేదు. ఉపయోగం లేని మానవులవద్దకు పోయి, నరస్తుతిని చేసి స్వరూపాన్ని చెడగొట్టుకొనడంలేదు. తిరువరంగం అనేమాట చెవిలో పడగానే వ్యామోహాన్ని పొంది అభినివేశాన్ని పొందుతున్న భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలను ఇక ఏనాడూ మఱువబోవడం లేదు. ఇటువంటి దృఢమైన అధ్యవసాయం నిశ్చలంగా ఏర్పడిన తరువాత ఏదారిలో పాపాలు వచ్చి నన్ను బాధింపగలవు?

"మానిడర్గై" అని అనవలసినచోట "మానిడత్తై" అని (అచేతనవాచకంగా) పల్కడం నిరాదరణబుద్ధితో. **(పుయలే యెన క్కవి పోఱ్ఱి శెయ్యేన్)- "మారియనై యకై మాల్ వరై యొక్కుమ్ తొణ్డోళ్ ఎన్డు పారియలోర్ పఱ్ఱియై ప్పచ్చైప్పుశుమ్ పొయ్‌కళ్"** పలుకను- అని భావం.

36. అడల్‌కొణ్డ నేమియ నారుయిర్‌నాతన్, అన్ఱారణచ్చొల్
కడల్ కొణ్డ వొణ్ పొరుళ్ కణ్డళిప్ప, ప్పిన్నుమ్ కాశినియోర్
ఇడరిన్ కణ్ వీఴ్న్దిడ త్తానుమవ్వొణ్‌పొరుళ్‌కొణ్డు అవర్‌పిన్
పడరుమ్ కుణన్, ఎమ్మిరామానుశన్ఱన్ పడి యితువే.

అడల్ కొణ్డ నేమియన్ = (ఆశ్రితవిరోధులను నశింపజేయగల) బలిమిని కల్గిన శ్రీసుదర్శనాన్ని ధరించినవాడై, ఆర్ ఉయిర్ నాతన్ = సకలాత్మలకు శేషి అయిన స్వామి, అన్ఱు = అర్జునునకు సారథియై ఉన్న ఆ కాలంలో, ఆరణ చ్చొల్= వేదాలు అనే, కడల్ కొణ్డ = సముద్రంలో (రహస్యంగా) ఉండే, ఒణ్ పొరుళ్ = అర్థాలను, కణ్డు = విచారించి చూచి, అళిప్ప = (గీతాముఖంగా) ఉపదేశించగా, పిన్నుమ్ = దానికి పిమ్మట కూడా, కాశినియోర్ = భూమిలో ఉండేవారు అంతా, ఇడరిన్ కణ్ వీఴ్న్దిడ = సంసారదుఃఖంలో పడి ఉండగా, తానుమ్= (భగవద్రామానుజులైన)తాము, అ ఒణ్ పొరుళ్ కణ్డు = (పూర్వం భగవానుడు అనుగ్రహించిన) ఆ గొప్ప అర్థాలను దర్శించి, అవర్ పిన్ పడరుమ్ = ఆ సంసారులను వెంబడించే, కుణన్ = శీలగుణాన్ని కలవారు, ఎమ్ ఇరామానుశన్‌తన్ = మన స్వామి అయిన భగవద్రామానుజుల, పడి ఇతు = స్వభావం ఇది.

**"ఇరామానుశన్ మన్ను మామలర్‌త్తాళ్ అయరేన్"** అని అంటున్నారే ! మేము కూడా ఆ విధంగా వారిని ఆశ్రయించేటట్లుగా ఆ భగవద్రామానుజుల స్వభావం ఉన్న తీరునుగూర్చి కొంచెం చెప్పండి- అని కొందరు అముదనార్‌ను ప్రార్థించగా, శ్రీరామానుజుల దివ్యగుణం ఇటువంటిదిసుమా !- అని ఇందులో అంటున్నారు.

శత్రువులకు భయంకరమైన శ్రీసుదర్శనాన్ని ఆయుధంగా కలవాడై, సకలజీవాత్మలకు శేషి అయిన భగవానుడు ఆనాడు భారతయుద్ధరంగంలో అర్జునుడనే ఒకనిని వ్యాజంగా చేసికొని, వేదవేదాంతసముద్రంలో నిమగ్నమై ఉండే పలు మహార్థాలను శ్రీభగవద్గీతాముఖంగా వ్యక్తం చేసినా, పాడు సంసారులు ఆ అర్థాలను తెలిసికొని ఉజ్జీవించకుండా ఇంకా ఇంకా సంసారాన్నే వృద్ధి చేసికొంటూ అధోగతిని పొందుతూ ఉన్నారే! "అయ్యో! ఈ విధంగా నిత్యసంసారులై



చెడిపోతున్నారే !'' అని అనుతాపాన్ని పొందిన భగవద్రామానుజులు ఆ గీతాశాస్త్రంలో ఉండే అర్థాలనే స్పష్టంగా వివరిస్తూ, వీనిని విని సంస్కరింపబడేవారెవరైనా ఉన్నారా! అని సంసారుల వెంట వెడుతున్నారు. మనలను ఉద్ధరించడానికి వారే స్వయంగా ప్రయత్నం చేస్తూ **"ఆళ్‌పార్‌త్తు ఉయ్ఙ్తరుకిన్ఱార్"** వారి ఈ కల్యాణగుణాన్నిగూర్చి మీకు తెలియలేదా ! అని అముదనార్ అంటున్నారు.

**(తానుమ్ అవ్వొణ్‌పొరుళ్ కొణ్డు)** - గీతాభాష్యాన్ని అనుగ్రహించి- అని భావం. తిరుక్కోట్టియూర్‌నంబివద్ద చరమశ్లోకార్థాలను ఏకాంతంగా విని, దానిని అందఱు విని ఉజ్జీవించేటట్లు గోపురం పైకి ఎక్కి ప్రకాశింపజేసిన కల్యాణగుణాన్ని గూర్చి ఈ పాశురంలో పల్కుతున్నారని కూడా చెప్పవచ్చు.

37. పడికొణ్డ కీర్‌త్తి ఇరామాయణ మెన్నుమ్ పత్తివెళ్ళమ్,
కుడికొణ్డకోయిలిరామానుశన్ కుణమ్ కూఱుమ్, అన్బర్
కడికొణ్డ మామలర్‌త్తాళ్ కలన్దుళ్ళమ్ కనియుమ్ నల్లోర్
అడి కణ్డుకొణ్డుకన్ద, ఎన్నైయు మాళవర్‌క్కాక్కినరే.

పడి కొణ్డ = లోకం అంతా వ్యాపించిన, కీర్‌త్తి = కీర్తిని కల్గిన, ఇరామాయణమ్ ఎన్నుమ్ = శ్రీరామాయణమనే, పత్తి వెళ్ళమ్ = భక్తిసముద్రం, కుడి కొణ్డ = నిత్యవాసం చేసే, కోయిల్ = దివ్యస్థానమై ఉండే, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, కుణమ్ కూఱుమ్ = కల్యాణగుణాలనుగూర్చి పలికే, అన్బర్ = భక్తుల, కడి కొణ్డ = సువాసనను మిక్కిలిగా కల, మా తాళ్ మలర్ = గొప్ప పాదారవిందాలలో, ఉళ్ళమ్ కలన్దు = మనస్సు లగ్నమై, కనియుమ్ = (పండే) స్నేహాన్ని కల్గి ఉండే, నల్లోర్ = మహానుభావులు, అడి కణ్డుకొణ్డు = (ఈ ఆత్మవస్తువు శ్రీరామానుజులకు శేషభూతమైనది - అనే) మూలమైన అర్థాన్ని తెలియజేస్తూ, ఉకన్దు = ఆదరించి, ఎన్నైయుమ్ = నన్నుకూడా, అవర్‌క్కు = ఆ శ్రీరామానుజులకు, ఆళ్ ఆక్కినర్ = కింకరునిగా చేశారు.

ఇటువంటి భగవద్రామానుజులను మీరే స్వయంగా వెళ్ళి ఆశ్రయించారా? లేక, వారే మిమ్ములను స్వీకరించారా? అని అముదనార్‌ను కొందరు ప్రశ్నించగా, "నాకు నేనుగా ఆశ్రయించలేదు. వారుకూడా స్వీకరించలేదు. వారి సంబంధ సంబంధులు నన్ను తీసికొని పోయి చేర్చారు'' అని అంటున్నారు.

లోకప్రసిద్ధమైన శ్రీరామాయణమనే భక్తిసాగరాన్ని మనస్సులో తేటపఱచుకొని పూర్ణంగా నిలుపుకొన్నవారైన భగవద్రామానుజుల కల్యాణగుణాలనే నిత్యాను

సంధానానికి విషయంగా చేసికొన్న మహానుభావులు ఎవరో, వారి పాదారవిందాలనే చింతించి, ఆనందించేవారైన శ్రీరామానుజభక్తభక్తులు నన్ను కటాక్షించారు. అంతకుముందు నేను దేనికీ పనికిరాని అపదార్థంగా పడి ఉన్నాను. అయ్యో! శ్రీరామానుజశేషభూతుడైన వ్యక్తి ఈవిధంగా అన్యాయంగా పాడయిపోతున్నాడే!- అని అనుతపించి, వారు నన్ను సంస్కరించి, ఆ భగవద్రామా నుజుల శ్రీచరణాలవద్దకు తీసికొని వచ్చి చేర్చి ఉజ్జీవింపజేశారు- అని తాత్పర్యం.

**(అడి కణ్డుకొణ్డు)** -**“అడి”** అంటే మూలం. భగవద్రామానుజులకు సంబంధించినవాడనై ఉండడం అనే మూలాన్ని తెలిసికొని చేర్చారు- అని భావం. మర్మాన్ని తెలిసి కార్యాన్ని చేసేవారని భావం.

**38. ఆక్కి యడిమై నిలైప్పిత్తనై, ఎన్నైయిన్ఱవమే**
**పోక్కి ప్పుఱత్తిట్టతెన్‌పొరుళా మున్బు, పుణ్ణియర్‌తమ్**
**వాక్కిల్ పిరియా ఇరామానుశ! నిన్నరుళిన్‌వణ్ణమ్**
**నోక్కిల్ తెరివరితాల్, ఉరైయా యిన్ద నుణ్‌పొరుళే.**

ఎన్నై = (చిరకాలంగా అహంకారియై పడి ఉండే)నన్ను, ఇన్ఱు = ఈనాడు, ఆక్కి = ఒక వస్తువుగా చేసి, అడిమై = శేషత్వంలో, నిలైప్పిత్తనై = స్థిరంగా నిలిచేటట్లుచేశారు (ఈ నాడు ఈవిధంగా చేసిన తమరు), మున్బు = పూర్వం, అవమే పోక్కి = వ్యర్థంగా గడిపి, పుఱత్తు ఇట్టతు = బాహ్యవిషయాలలోకి పడవేయడం, ఎన్ పొరుళా = ఏకారణంవల్ల, పుణ్ణియర్‌తమ్ = (మిమ్మలను నిరంతరం అనుభవించే) భాగ్యశాలుల, వాక్కిల్ పిరియా = వాక్కును విడువని, ఇరామానుశ = భగవద్రామానుజా !, నిన్ అరుళిన్ వణ్ణమ్ = దేవరవారి కరుణ ఉండే తీరును, నోక్కిల్ = చూచినట్లయితే, తెరివు అరితు = తెలియడానికి సాధ్యం కానిదై ఉన్నది, ఇన్ద = ఈ, నుణ్ పొరుళ్ = సూక్ష్మమైన విషయాన్ని, ఉరైయాయ్ = తమరు అనుగ్రహించండి.

**“ఎన్నైయుమ్ అవర్‌క్కు ఆళాక్కినర్”** అని అనగానే, శ్రీరామానుజశేషత్వం మనకు నిత్యసిద్ధమై ఉండగా చిరకాలం వారి శ్రీచరణాలకు లక్ష్యం కాకుండా, వ్యర్థంగా కాలం గడిపినందులకు, ఇపుడు వారి శ్రీచరణాలలో చేరగల్గినందుకు ఏమి హేతువు? అని విచారించారు. తమకు ఏకారణం బోధపడలేదు. “వారి నిర్హేతుకకృపయే దీనికి కారణమై ఉండి ఉండాలి'' -అని నిశ్చయించుకొని, ఆ భగవద్రామానుజులనే ఉద్దేశించి ఇందులో ప్రశ్నిస్తున్నారు.



కూరత్తాళ్వాన్‌ను చూచి, దాసుడనైన నన్ను ఇపుడు సంస్కరించి సేవకునిగా స్వీకరించిన తమరు, దీనికి ముందున్న కాలం అంతా ఈ శేషత్వరసాన్ని దాసునిచే ఆస్వాదింపజేయకుండా వ్యర్థంగా విషయాంతరాలలో పడవేసి దూరం చేయడానికి ఏమి కారణం ? ఇపుడు ఈ విధంగా దయ చూపేటట్లుగా నావద్ద ఏమి సుకృతం ఉన్నది? ఏమీ లేదు కదా!. ఈ విధంగా ఉన్నా, మీరు మీ నిర్హేతుకకృపతోనే కదా ఇపుడు దాసునిగా పరిగ్రహించారు. ఆహా! ఆహా! ఈ విధంగాకూడా ఒక కృప ఉంటుందా? ఈ మీ కృపామహిమను తెలియగలవారెవరు? తెలిసిన మీరే చెప్పాలి. అంతే- అని భావం.

**(నిలైప్పిత్తనై)**- ఇది మధ్యమపురుష ఏకవచనసమాపక క్రియ. **(ఇన్ఱు ఎన్నై ఆక్కి అడిమై నిలైప్పిత్తనై, మున్బు అవమే పోక్కి పుఱత్తిట్టతు ఎన్ పొరుళా?)** ఈనాడు స్వీకరించడానికి, ఇన్నాళ్ళు తొలగదోసినందులకు ఏమి కారణం?

**39. పొరుళుమ్ పుతల్వరుమ్ పూమియుమ్, పూఙ్గుళలారు మెన్ఱే**
**మరుళ్‌కొణ్డిళైక్కుమ్ నమక్కు నెఞ్జే!, మఱ్ఱుళార్‌తరమో**
**ఇరుళ్‌కొణ్డ వెన్దుయర్ మాఱ్ఱి త్తన్నీఱిల్ పెరుమ్‌పుకళే**
**తెరుళుమ్ తెరుళ్ తన్దు, ఇరామానుశన్ శెయ్యుమ్ శేమఙ్గళే.**

పొరుళ్ ఎన్ఱుమ్ = ధనమని అంటూ, పుతల్వర్ ఎన్ఱుమ్ = పుత్రులు అని అంటూ, పూమి ఎన్ఱుమ్ = క్షేత్ర మని పల్కుతూ, పూ కుళలార్ ఎన్ఱుమ్ = అందమైన కేశాలను కల్గిన స్త్రీలు అని పల్కుతూ (అర్థపుత్రాదులనే వాంఛించి), మరుళ్ కొణ్డు = జ్ఞానం కోల్పోయి (అజ్ఞానాన్ని పొంది), ఇళైక్కుమ్ నమక్కు = దుఃఖపడుతున్న మనకు, ఇరుళ్ కొణ్డ = అజ్ఞానంతో కూడిన, వెమ్ తుయర్ = క్రూరమైన దుఃఖాలను, మాఱ్ఱి = పోగొట్టి, తన్ = తమయొక్క, ఈఱు ఇల్ = అంతులేని, పెరు పుకళే = గొప్ప కల్యాణ గుణలనే, తెరుళుమ్ తెరుళ్ = ధ్యానించగల్గిన జ్ఞానాన్ని, తన్దు = అనుగ్రహించి, ఇరామానుశన్ = భగవద్రామా నుజులు, శెయ్యుమ్ = చేసే, శేమఙ్గళ్ = క్షేమాలు, నెఞ్జే = ఓ మనసా!, మఱ్ఱు ఉళార్ తరమో = మిగిలినవారికి చేసిన మాత్రంలోనా! కాదు, (విలక్షణమని తాత్పర్యం).

భగవద్రామానుజుల అనుగ్రహంవల్ల తాము పొందిన హితాలనుగూర్చి తలచి తలచి, ఆనందం లోపల ఇముడలేక, ఆ ఆనందాన్ని మనస్సుతో కలసి అముదనార్ అనుభవిస్తున్నారు. “మనసా! **“అన్నై అత్తన్ ఎన్‌పుత్తిరర్ పూమి వాశవార్‌క్కుళలాళ్”**

అని అంటూ వ్యామోహాన్ని పొంది, పుత్రదారాగృహక్షేత్రాలకు మించి ఏమీ తెలియకుండా, "ఉడలుక్కే కరైన్దు నైన్దు" అన్నట్లు ఈ దేహంకోసమే శ్రమపడి బాధపడే మనకు మన అజ్ఞానాలను, తత్కారణంగా వచ్చే పాపాలను పోగొట్టి, తమ దివ్యయశస్సులను గూర్చి నిరంతరం పలికే రీతిలో మనలను కొనిపోయి నిలిపారు, భగవద్రామానుజులు. ఈవిధంగా వారు మనకు చేసే క్షేమాలు ఈలోకంలో ఇక వేఱు ఎవరికైనా లభిస్తాయా? మన భాగ్యమేకదా భాగ్యం''- అని తాత్పర్యం.

**(మఱ్ఱుళ్ళార్తరమో)** అనే ప్రయోగానికి రెండు విధాలుగా అర్థాన్ని గ్రహించ వచ్చు. ఇటువంటి క్షేమాలను మనకు భగవద్రామానుజులు తప్ప ఇంకెవరైనా అనుగ్రహించడం సాధ్యమా? అని; ఇటువంటి క్షేమాలు మనకు తప్ప ఇంక ఎవరికి అయినా లభిస్తాయా? అని. **"శేమమ్"**- ఇది క్షేమమనే సంస్కృత శబ్దానికి వికృతి.

**40. శేమ నల్వీడుమ్ పొరుళుమ్ తరుమముమ్, శీరియనల్**
**కామముమెన్ఱివై నాన్గెన్బర్, నాన్గినుమ్ కణ్ణనుక్కే**
**ఆమతు కామ మఱమ్ పొరుళ్ వీడితఱ్కెన్ఱురైత్తాన్**
**వామనన్ శీలన్, ఇరామానుశ నివ్వ మణ్మిశైయే.**

శేమమ్ నల్ వీడుమ్ = (అందఱికి) క్షేమరూపమైన గొప్ప మోక్షం, పొరుళుమ్ = సంపద, తరుమముమ్ = ధర్మం, శీరియ నల్ కామముమ్ = చాలా గొప్ప కామం - అని ఈ విధంగా చెప్పబడ్డ ఇవి, నాన్గు ఎన్బర్ = నాలుగు పురుషార్థాలు - అని (వైదికులు) అంటారు, నాన్గినుమ్ = ఈ నాల్గు పురుషార్థాలలో, కామమ్ = కామం, కణ్ణనుక్కే ఆమతు = భగవానుని విషయంలోనే ఉండదగినది, అఱమ్ = ధర్మం, పొరుళ్ = అర్థం, వీడు = మోక్షం, అనే మూడు, ఇదఱ్కు ఎన్ఱు = ఈ కామపురుషార్థానికి శేషభూతాలు అని, వామనన్ శీలన్ = వామనావతారాన్ని ఎత్తిన భగవానునితో సాటి వచ్చే శీలాన్ని కల్గిన, ఇరామానుశన్= భగవద్రామా నుజులు, ఇన్ద మణ్ మిశై ఉరైత్తాన్ = ఈ లోకంలో అనుగ్రహించారు.

భగవద్రామానుజులు ఈ లోకంలోని వారికి ఉపదేశించిన అర్థాలలో ఒక అర్థవిశేషాన్ని ఈ పాశురంలో ప్రస్తావించి అముదనార్ పల్కుతున్నారు. **"అమ్మైత్తాన్ మన్ను మఱమ్ పొరుళిన్బమ్ వీడెన్ఱులకిల్ నన్నెఱి మేమ్బట్టన నాన్గన్ఱే!"** (పెరియతిరుమడల్) అనే రీతిలో సకల శాస్త్రాలచేత ప్రతిపాదింపబడేవి- ధర్మం, అర్థం, కామం, మోక్షం-అని నాల్గు పురుషార్థాలు. ఆ నాల్గింటిలోను కామమనేది



భగవద్విషయకామం. విషయాంతరాలనుగూర్చిన కామం అల్పానందం కనుక అది పురుషార్థం కాదు. మహానందం అయిన భగవత్కామమే కామం. అదే పురుషార్థం. మిగిలిన మూడు పురుషార్థాలు పైన పల్కిన కామపురుషార్థానికి శేషభూతాలు. కామమే ప్రధానశేషి అయిన పురుషార్థం- అని లోకంలోనివారికి అందఱికి భగవద్రామానుజులు ఉపదేశించారు- అని భావం. **"కామత్తిన్ మన్నుమ్ వழிముఱైయే నిఱ్ఱుమ్ నామ్"** అని తిరుమజ్గైయాழ்వార్లు అనుగ్రహించిన సూక్తి ఇక్కడ గమనార్హం. ధర్మం అర్థం, ఒక సుఖాన్ని పొందడానికి ఉపాయాలు కనుక, అవి స్వతఃపురుషార్థాలు కావు. పరతః పురుషార్థాలనబడతాయి. మోక్ష మనేది స్వతఃపురుషార్థమే అయినా, కామమనే మహానందంయొక్క అభివృద్ధికి హేతువైనందువల్ల, కామపురుషార్థానికే ప్రాధాన్యాన్ని ఇవ్వాలి- అని భావం.

**"శేమ నల్వీడు"**- అని ఆరంభించి **"అఱమ్ పొరుళ్ వీడితఱ్కు"** అనే పర్యంతం భగవద్రామానుజుల ఉపదేశసూక్తి.

**(కణ్ణనుక్కే ఆమతు కామమ్)** - కామక్రోధాదులను దుర్గుణాలుగా చెప్పడం- తగని విషయాలలో కామం తగదనే అభిప్రాయంతోనే. భగవద్విషయంలో కామం శాస్త్రవిహితం. ఆழ்వార్ల శ్రీసూక్తులలో ఈ కామమే ప్రకాశిస్తుంది.

**(వామనన్ శీలన్)** - వామనావతారాన్ని ఎత్తిన భగవానుని శీలంవంటి శీలాన్ని కలవారు - అని భావం. ఎవరూ అపేక్షించకుండానే స్వప్రయోజనంగా భావించి అందఱి తలలపై తన శ్రీచరణాలను పెట్టిన త్రివిక్రమునివలె, రస్యమైన, రహస్యమైన అర్థవిశేషాలను తమ నిర్హేతుకకృపతో శ్రీరామానుజులు వ్యక్తం చేస్తారు- అని తాత్పర్యం.

**41. మణ్మిశై యోనికళ్ తోఱుమ్ పిఱన్దు, ఎజ్గళ్ మాతవనే**
**కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా, ఉలకోర్కళెల్లామ్**
**అణ్ణలిరామానుశన్ వన్దు తోన్ఱియ అప్పొழுతే**
**నణ్ణరు ఞానమ్ తలైక్కొణ్డు, నారణఱ్కాయినరే.**

ఎజ్గళ్ మాతవనే = మనకు నాథుడైన శ్రియఃపతియే, మణ్ మిశై =ఈ భూమిలో ఉండే, యోనికళ్ తోఱుమ్ = (మనుష్యాది) జాతులన్నిటిలోను, పిఱన్దు= అవతరించి, కణ్ ఉఱ నిఱ్కిలుమ్ = అందఱి కళ్ళకు తనను లక్ష్యంగా చేసికొన్నప్పటికీ, కాణకిల్లా = (అతనిని మననాథుడని) చూడలేకుండా ఉండే, ఉలకోర్కళ్ ఎల్లామ్ = ఈ లోకులు అందఱు, అణ్ణల్ =సర్వస్వామి అయిన,

ఇరామానుశన్ = భగవద్రామానుజులు, వన్దు = ఇక్కడకు (ఈ లోకానికి), వచ్చి, తోన్ఱియ అప్పొழுతే = అవతరించిన వెంటనే, నణ్ణ అరు = పొందడానికి అరుదైన, ఞానమ్ = జ్ఞానాన్ని, తలైక్కొణ్డు = అధికరించగల్గి, నారణఱ్కు= శ్రీమన్నారాయణు నకు, ఆయినరే = శేషభూతులయ్యారు.

భగవానుని అవతారాలకంటే భగవద్రామానుజుల అవతారమే గొప్పది- అని అముదనార్ అంటున్నారు. **"అజాయమానో బహుధా విజాయతే"** అని, **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్దాయ్! ఇమైయోర్ తలైవా!"** అని పలికే రీతిలో భగవానుడు పలు పలు జాతులలో పలు పలు జన్మలను ఎత్తి కంటికి గోచరుడై నిలచి ఉండి ఉపదేశాలలో స్వస్వరూపాన్ని దర్శింపజేసినా, ఎవరూ అతనిని లక్ష్యపెట్టలేదు. **"అవజానంతి మాం మూఢాః"** (నన్ను మూఢులు అవమానిస్తున్నారు) అని అతడే స్వయంగా పల్కి బాధపడవలసి వచ్చింది. అందు వల్ల భగవానుని అవతారాలు సంసారుల స్వచ్ఛమైన జ్ఞానానికి ఉపయోగపడ లేదు. భగవద్రామానుజుల అవతారాన్ని గమనిస్తే, అది ఉపయోగపడింది. వీరు అవతరించ గానే లోకులందఱు ఆశ్చర్యకరమైన యథార్థజ్ఞానాన్ని పొంది, ఉజ్జీవించారు - అని తాత్పర్యం.

**42.** ఆయిழைయార్కొఙ్గై తఙ్గుమ్, అక్కాతలళఱ్ఱழுన్ది
మాయు మెన్నావియై వన్దెడుత్తానిన్ఱు, మామలరాళ్
నాయక నెల్లా వుయిర్కట్కుమ్ నాత నరఙ్గ నెన్నుమ్
తూయవన్, తీతిలిరామానుశన్ తొల్లరుళ్ శురన్దే.

మా మలరాళ్ నాయకన్ = లక్ష్మీపతి అయిన, అరఙ్గన్ = శ్రీరంగనాథుడు, ఎల్లా ఉయిర్కట్కుమ్ = సకలజీవాత్మలకు, నాతన్ ఎన్నుమ్ = శేషి అని ఉపదేశించేవారు, తూయవన్ = పరమపవిత్రులు, తీతు ఇల్ = ఏవిధమైన దోషాన్ని లేనివారు అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు (ఏమి చేశారు ? అని అంటే), ఆయ్ ఇழைయార్ = అందమైన ఆభరణాలను అలంకరించుకొన్న స్త్రీల, కొఙ్గై తఙ్గుమ్ = స్తనతటాలలో నిలచి ఉండాలనే, అక్కాతల్ అళఱు = ఆ ఆశ అనే పంకంలో, అழுన్ది = పడి మునిగి, ఇన్ఱు = ఇపుడు, తొల్ అరుళ్ =నిర్హేతుక కృపను, శురన్దు = స్రవించి, ఎడుత్తాన్ = ఉద్ధరించారు.

"భగవానుని అవతారకాలాలలో సంస్కరింపబడని సంసారులుకూడా భగవద్రామానుజుల కాలంలో సంస్కరింపబడ్డారు- అని గత పాశురంలో పల్కిన



దానికి వేఱొక దృష్టాంతాన్ని చూపించాలా? నన్ను సంస్కరించి దాసునిగా పరిగ్రహించిన విషయం ఒక్కటే చాలదా ?'' అని పలికేవారివలె తమను సంస్క రించిన విషయాన్ని గూర్చి అముదనార్ ఇందులో పల్కి ఆనందిస్తున్నారు.

స్త్రీల ఆభరణాలలోను, స్తనాలలోను ప్రేమ వృద్ధి చెంది, వాటిలో అవగాహించి, అనాదికాలంగా నశిస్తున్న నా ఆత్మను తమ నిర్హేతుకకృపతో భగవద్రామానుజులు సంస్కరించారు. "శ్రీరంగనాథుడే సర్వశేషి'' అని ఉపదేశించడమే వారికి కాలక్షేపం. అట్లు శ్రీరామానుజులచే నేను సంస్కరింపబడడం ఒక్కటే చాలు - అని అంటున్నారు! అముదనార్.

**43.** శురక్కుమ్ తిరువు ముణర్వుమ్, శొలప్పుకిల్ వాయముతమ్
పరక్కు మిరువినై పఱ్ఱఱవోడుమ్, పడియిలుళ్ళీర్ !
ఉరైక్కిన్ఱన నుమక్కియానఱమ్ శీఱు ముఱుకలియై
త్తురక్కుమ్ పెరుమై, ఇరామానుశ నెన్ఱు శొల్లుమినే.

పడియిల్ ఉళ్ళీర్ = (ఈ) భూమిలో ఉండే జనులారా !, యాన్ ఉమక్కు= నేను మీకు, ఉరైక్కిన్ఱనన్ = (ఒక హితాన్ని చెబుతున్నాను) (అది ఏమి ? అంటే), అఱమ్ శీఱుమ్ = ధర్మమార్గంలో కోపాన్ని కల్గినవాడై, ఉఱు = ప్రబలుడైన, కలియై= కలిని, తురక్కుమ్ = తఱిమికొట్టే, పెరుమై = గొప్పతనాన్ని కల, ఇరామానుశన్ ఎన్ఱు = భగవద్రామానుజుల తిరునామాన్ని, శొల్లుమిన్ = అనుసంధానం చేయండి, (ఆ విధంగా అనుసంధిస్తే), తిరువుమ్ = భక్తిమహాసంపద, ఉణర్వుమ్ =జ్ఞానం, శురక్కుమ్ = ఇంకా ఇంకా వృద్ధి చెందుతుంది, శొల పుకిల్ = ఆ తిరునామాలను అనుసంధానం చేయడం ఆరంభించినపుడే, వాయ్ = వాక్కులో, అముతమ్ = అమృతం, పరక్కుమ్ = వ్యాపిస్తుంది, ఇరు వినై = మహాపాపాలు, పఱ్ఱు అఱ ఓడుమ్ = పూర్తిగా పోతాయి.

లోకంలోనివారిని ఉద్దేశించి "మీరు అందఱు శ్రీరామానుజ దివ్యనామాన్ని నోరార పల్కండి; మీకు అన్నివిధాలైన హితాలు కల్గుతాయి'' అని అంటున్నారు. ఓ జనులారా! మీకు ఒక అరుదైన అర్థాన్ని ఉపదేశిస్తున్నాను. వినండి. భగవద్రామా నుజుల సంబంధాన్ని కల్గిన దేశంలో ధర్మానికి విరోధి అయిన కలిపురుషుడు నిలువలేడు. అటువంటివారి తిరునామాలను మీరు అనుసంధించండి. మీకుకూడా జ్ఞానభక్తులు సమకూడుతాయి. పాపాలు తొలగిపోతాయి. ఆ తిరునామాలు జిహ్వాకు మధురంగా ఉంటాయి. చెప్పిచూడండి'' అని అంటున్నారు.

ఉమక్కు+యాన్ = ఉమక్కియాన్. "యవ్వరిన్ ఇయ్యామ్" అని నన్నూల్ సూత్రం.

**44.** శొల్లార్ తమిழ్ఒరు మూన్ఱుమ్, శురుతికళ్ నాన్గుమ్ ఎల్లై
యిల్లా అఱనెఱి యావుమ్ తెరిన్దవన్, ఎణ్ణరుమ్ శీర్
నల్లార్ పరవు మిరామానుశన్ తిరునామమ్ నమ్బి
క్కల్లారకలిడత్తోర్, ఎతు పేఱెన్ఱు కామిప్పరే.

అకల్ ఇడత్తోర్ = విశాలమైన ఈ భూమండలంలో ఉండేవారు, శొల్ ఆర్ =శబ్దాలతో నిండిన, తమిழ் ఒరు మూన్ఱుమ్ = **"ఇయల్, ఇశై, నాడకమ్"** -అనే సాటి లేని మూడు విధాలైన ద్రావిడాన్ని, శురుతికళ్ నాన్గుమ్ = నాల్గు వేదాలను, ఎల్లై ఇల్లా = లెక్కలేనన్ని, అఱమ్ నెఱి యావుమ్ = ధర్మశాస్త్రాలను, ఇంకా అన్నిటిని, తెరిన్దవన్ = తెలిసినవారు, ఎణ్ అరు శీర్ = లెక్కకట్టడానికి సాధ్యం కాని కల్యాణగుణాలను కలవారు, నల్లార్ =సత్పురుషులచే, పరవుమ్ = స్తుతింపబడేవారు అయిన, ఇరామానుశన్ =భగవద్రామానుజుల, తిరు నామమ్= తిరునామాన్ని, నమ్బి కల్లార్ = (నామాటను) నమ్మి, అభ్యసించినవారు లేరు, (శ్రీరామానుజనామ సంకీర్తనమే పురుషార్థమని తెలియనివారై), ఎతు పేఱు ఎన్ఱు = మనకు పురుషార్థం ఏది? అని, కామిప్పరే = అని అడుగుతున్నారే! అయ్యో!

**"ఇరామానుశ వెన్ఱు శొల్లుమినే"** అని అంటూ భగవద్రామానుజుల నామ సంకీర్తనాన్ని చేయమని లోకంలోనివారిని వేడారు, గత పాశురంలో. ఎవరూ అముదనార్ మాటను ఆదరించనందువల్ల "అయ్యో! ఈలోకంలోనివారు పాడయిపోతున్నారే! ఉజ్జీవించే దారిని మనం చెప్పినా వీరు తెలియకుండా తల్లడిల్లుతున్నారే!" అనే అనుకంపతో ఇందులో పల్కుతున్నారు.

"వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంతప్రవర్తకులు కనుక సర్వజ్ఞులై, సత్పురుషులకు సేవ్యులై ఉండే భగవద్రామానుజుల తిరునామాన్ని ఆశతో అనుసంధించండి"- అని అంటే ఈ భూమండంలో ఎవరూ అనుసంధించమని అంటున్నారు. "ఉజ్జీవించడానికి దారి ఏది?"- అని విచారిస్తూ పరిభ్రమిస్తూ తల్లడిల్లు తున్నారే తప్ప, ఉజ్జీవించే దారినిగూర్చి పల్కితే ఆనందించి దానిని గ్రహించేవారు లేరే! ఇదేమి లోకస్వభావం!- అని అముదనార్ బాధపడతున్నారు.

**(శొల్ ఆర్ తమిழ் ఒరు మూన్ఱుమ్)** - ఇయల్, ఇశై, నాడకమ్- అని మూడు విధాలైన ద్రావిడం. **"ఎழுత్తు ప్పదిన్ మూన్ఱు, ఇరణ్డశై, శీర్ ముప్పత్తేழ், తళై ఐన్దు, ఇழుక్కిలడితొడై నాల్పదిన్ మూన్ఱు, ఐన్దు పా, ఇనమ్ మూన్ఱు, ఒழுక్కియ వణ్ణజ్గళ్ నూఱు ఒన్బతు, ఒణ్ పొరుళ్ కోళ్ ఇరుమూ, వழுక్కిల్ వికారమ్ వనప్పెట్టు యాప్పుళ్ వకుత్తనవే"** అని తెలుపబడే ఇయల్ తమిழ் యొక్క లక్షణాలు. కుఱిఞ్జి, శెరున్ది, ఇన్దళమ్, కొల్లి, కామరమ్, తక్కేశి, పంచమమ్, కైకియమ్, కాన్దారమ్, **పాలైయాழ்** - మొదలైన రాగాలను కల ద్రావిడం- ఇశై త్తమిழ். ఇయల్కు, ఇశైకు సాధారణమైనది నాడకత్తమిழ். ద్రావిడశాస్త్రాలు అన్నిటిని తెలిసినవారు భగవద్రామానుజుల - అని తాత్పర్యం.

**(శురుతికళ్ నాన్గుమ్)** - ఋక్కు, యజుస్సు, సామం, అథర్వణం- అనే వేదాలు నాల్గు. **(ఎల్లై యిల్లా అఱ నెఱి)** -ధర్మశాస్త్రాలకు అంతు లేదు. **(యావుమ్)**- ముందు తెల్పినవి, ఇంకా ఉండే శాస్త్రాలు అన్నీ.

**45.** పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు
ఆఱొన్ఱు మిల్లై మఱ్ఱ చ్చరణన్ఱి, ఎన్ఱిప్పొరుళై
త్తేఱు మవర్క్కు మెనక్కు మునై త్తన్ద శెమ్మైశొల్లాల్
కూఱుమ్ పరమన్ఱు, ఇరామానుశ ! మెయ్మ్మై కూఱిడిలే.

ఇరామానుశ = భగవద్రామానుజా!, నిన్ శరణ్ అన్ఱి = దేవరవారి శ్రీచరణా లను తప్ప, మఱ్ఱు పేఱు ఒన్ఱుమ్ ఇల్లై = ఉపేయం అనేది ఏదీ లేదు, అప్పేఱు అళిత్తఱ్కు = దేవరవారి శ్రీచరణాలనే ఆ ఉపేయాన్ని పొందడానికి, అచ్చరణ్ అన్ఱి = ఆ శ్రీచరణాలు తప్ప, మఱ్ఱు ఆఱు ఒన్ఱుమ్ ఇల్లై = వేఱొక ఉపాయం ఏదీ లేదు, ఎన్ఱు ఇప్పొరుళై = అనే ఈ యథార్థమైన అర్థాన్ని, తేఱుమవర్క్కుమ్= స్పష్టంగా తెలిసికొన్న మహానుభావులకు, ఎనక్కుమ్ = (ఈస్పష్టత కొంచెం కూడా లేని)నాకు, ఉనై తన్ద తన్మై = (వ్యత్యాసం లేకుండా సమంగానే) తమను అనుగ్రహించిన ఋజుత్వగుణం, మెయ్మ్మై కూఱిడిల్ = వాస్తవాన్ని పల్కితే, శొల్లాల్ కూఱుమ్ =నోటితో పల్కడానికి, పరమ్ అన్ఱు = సాధ్యం కాదు. (అనుభవించి ద్రవించాలి అంతే)

**"ఇరామనుశన్ తిరునామమ్ నమ్బిక్కల్లార్ అకలిడత్తోర్"** అని అంటూ గడచిన పాశురంలో చెప్పబడినవారిలో తాము కూడా ఒకరై ఉన్నా, తమను మాత్రం భగవద్రామానుజులు నిర్హేతుకంగా అంంగీకరించి, తమ శ్రీచరణాలనే ఉపాయో పేయంగా నమ్మి ఉండే అధ్యవసాయాన్ని, విశ్వాసాన్ని కల్గించిన మహోపకారాన్ని అముదనార్ స్మరించి అభినివేశాన్ని పొందుతున్నారు.

"స్వామీ! తమ శ్రీచరణాలు తప్ప నాకు వేఱు ఏమి ప్రాప్యం కాదు. దీనిని పొందడంకోసం ఈ శ్రీచరణాలు తప్ప వేఱొకటి ప్రాపకం కాదు'' అని-"ఉపాయం ఉపేయం భగవద్రామానుజుల శ్రీచరణాలే'' అని తలచి ఉండే మహానుభావులకు తమరు ఏవిధంగా అనుగ్రహిస్తున్నారో, అదేవిధంగా కొంచెంకూడా వ్యత్యాసాన్ని చూపకుండా పాపిష్ఠివాడనైన నాకు కూడా అనుగ్రహిస్తున్నారే ! ఇదేమి మహాగుణం! దృఢమైన విశ్వాసాన్ని కల్గిన కూరేశులు, దాశరథివంటివారిని సేవకులుగా అంగీకరించేటట్లే, అవిశ్వాసి అయిన నన్నుకూడా సేవకునిగా చేసికొంటున్నారే! ఈ ఋజుత్వగుణంయొక్క వైభవాన్ని పొగడి పలుకడానికి నాకు శక్తిలేదే! అని తడబడుతున్నారు.

**"పేఱు"**- పొందబడేది (**"పెఱప్పడు వతు పేఱు"**) ఉపేయం. అంటే, ఫలం. **"శరణ్"** అనే పదం సంస్కృత చరణశబ్దవికృతి. శ్రీచరణమని అర్థం. **"ఆఱు"** - మార్గం. అంటే, ఉపాయం. **"శెమ్మై"**- పెద్దవారు, చిన్నవారు అనే భేదాన్ని చూడకుండా అందరిపట్ల ఒకేవిధంగా మనస్సులో కరుణను కల్గి ఉండడం. ఆర్జవగుణమని పేరు. దీనికి విరుద్ధమైనగుణం కౌటిల్యం.

**46.** **కూఱుమ్ శమయజ్గళాఱుమ్ కులైయ, కువలయత్తే**
**మాఱన్ పణిత్త మఱై యుణర్న్దోనై, మతియిలియేన్**
**తేఱుమ్బడి యెన్ మనమ్ పుకున్దానై తిశైయనైత్తుమ్**
**ఏఱుమ్ కుణనై, ఇరామానుశనై యిఱైఞ్జినమే.**

కూఱుమ్ = మనస్సుకు తోచిన రీతిలో పల్కుతున్న, శమయజ్గళ్ ఆఱుమ్ = ఆఱు బాహ్యమతాలు, కులైయ = తలవంచేటట్లు, కువలయత్తే = ఈ భూమండలంలో, మాఱన్ పణిత్త = నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, మఱై = ద్రావిడవేదాన్ని, ఉణర్న్దోనై = అభ్యసించి తెలిసినవారు, మదియిలేన్ = జ్ఞానహీనుడనైన నేనుకూడా, తేఱుమ్బడి = తేటపడేటట్లు, ఎన్ మనమ్ = నా మనస్సులోకి వచ్చి, పుకున్దానై = ప్రవేశించినవారు, తిశై అనైత్తుమ్ = అన్ని దిక్కులలోను, ఏఱుమ్ కుణనై = వ్యాపించే కల్యాణగుణాలను కలవారైన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, ఇఱైఞ్జినమ్ = నమస్కరించాము.

భగవద్రామానుజులు అనుగ్రహించిన అరుదైన గొప్ప ఉపకారాలు మనస్సులో మధురంగా ఊఱగా ఊఱగా పరవశులై వారి శ్రీచరణాలలో అముదనార్ నమస్కరిస్తున్నారు. లోకంలో ప్రమాణం లేకుండా, యుక్తి లేకుండా మనస్సుకు



తోచినట్లుగా పల్కుతూ తిరిగే మతాంతరస్థులను అందఱిని భంగపరచడంకోసం నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదం అయిన తిరువాయ్మొళిని అభ్యసించి తెలిసినవారు, అవివేకిని అయిన నేనుకూడా తేటపడేటట్లుగా నా మనస్సు లోపలకు వచ్చి ప్రవేశించి, నా సత్తను రక్షించేవారు, దిక్కులన్నిటిలోను వ్యాపించిన కీర్తిని కలవారైన భగవద్రామానుజులను నమస్కరిస్తున్నాను- అని భావం.

**(శమయజ్గళ్ ఆఱుమ్)** - దేహాత్మవాది, దేహపరిణామవాది, విజ్ఞానాత్మవాది, శూన్యవాది, అద్వైతవాది, శివపరత్వవాది - అనే రీతిలో ఆఱు మతాలున్నాయి. ఈ ఆఱు మతాల సంఖ్య వేఱు రీతులలోకూడా ఉన్నాయి. ఈ అన్ని మతాలు తిరువాయ్మొళిలో నిరసింపబడ్డాయి. **కువలయమ్-** ఇది సంస్కృతపదం. **"తేఱుమ్బడి"**- ఏ రీతిలోను మనం ఉజ్జీవించేదారి లేదే! ఏమి చేయడం!'' అని తికమకపడే నేనుకూడా "ఇక మనకేకొఱత లేదు'' అని తేటపడి గుండెలపై చేయి వేసికొని ఉండేటట్లుగా- అని భావం.

**47.** **ఇఱైఞ్జప్పడుమ్ పరనీశ నరజ్గ నెన్ఱు, ఇవ్వులక**
**త్తఱమ్ శెప్పు మణ్ణలిరామానుశన్, ఎన్నరువినైయిన్**
**తిఱమ్ శెఱ్ఱిరవుమ్ పకలుమ్ విడాతెన్ఱన్ శిన్దైయుళ్ళే**
**నిఱైన్దొప్పఱ ఇరున్దాన్, ఎనక్కారుమ్ నికరిల్లైయే.**

ఇఱైఞ్జప్పడుమ్ పరన్ = అందఱిచే నమస్కరింపదగిన పరదైవం = (ఎవరు? అంటే), ఈశన్ = ఈశ్వరుడైన, అరజ్గన్ ఎన్ఱు = "శ్రీరంగనాథుడే''అని, ఇ ఉలకత్తు = భూమండలంలో, అఱమ్ శెప్పుమ్ = సాక్షాద్ధర్మాన్ని అనుగ్రహించేవారై, అణ్ణల్ = సర్వస్వామి అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్ అరు వినైయిన్ తిఱమ్ = నా పోగొట్టుకొనడానికి సాధ్యం కాని కర్మసమూహాన్ని, శెఱ్ఱు = నశింపజేసి, పకలుమ్ ఇరవుమ్ విడాతు = రాత్రి పగలు అన్ని కాలాలలోను విడువకుండా, ఎన్ తన్ శిన్దై ఉళ్ళే = నా హృదయంలోపల, నిఱైన్దు = పరిపూర్ణులై, ఒప్పు అఱ ఇరున్దాన్ = (ఈవిభూతికి) సాటి లేని రీతిలో వేంచేసి ఉన్నారు, ఎనక్కు = ఇటువంటి అనుగ్రహాన్ని పొందిన నాకు, ఆరుమ్ నికర్ ఇల్లై = సాటి వచ్చేవారెవరూ లేరు.

**"ఎన్మనమ్ పుకున్దానై"** అని గడచిన పాశురంలో సంగ్రహంగా చెప్పిన దానిని వివరిస్తూ "గొప్ప భాగ్యాన్ని పొందిన నాకు సాటి వచ్చేవారెవరూ లేరు- అని అంటున్నారు.

శ్రీరంగనాథుడే అందఱు నమస్కరించదగిన పరదైవం - అనే వాస్తవాన్ని లోకానికి ఉపదేశించి, అందఱిని భగవత్సమాశ్రయణంలో రుచిని కల్గినవారినిగా చేసే భగవద్రామానుజులు నా దుష్కర్మలను సమూలంగా పెకలించివేసి, అనవరతం నా హృదయంలోపల పరిపూర్ణులై వేంచేసి ఉన్నారు. ఇటువంటి పరమభాగ్యం పొందినవాడను ఈ లోకంలో నేనొక్కడనే కనుక, "ఇల్లై ఎనక్కెదిర్ ఇల్లై ఎనక్కెదిర్ ఇల్లై ఎనక్కెదిరే". (నా కెవరూ సాటిలేరు)

**48.** నికరిన్ఱి నిన్ఱ ఎన్నీశతైక్కు, నిన్నరుళిన్ కణన్ఱి
పుకలొన్ఱు మిల్లై యరుట్కుమఃతే పుకల్, పున్మైయిలోర్
పకరుమ్ పెరుమై యిరామానుశ! ఇనినామ్ పழுతే
అకలుమ్ పొరుళెన్?, పయనిరువోముక్కుమానపిన్నే.

పున్మైయిలోర్ = మహానుభావులు (అనఘులు), పకరుమ్ పెరుమై = పలుకదగిన రీతిలోని గొప్పతనాన్ని కల్గిన, ఇరామానుశ = ఓ భగవద్రామానుజా!, నికర్ ఇన్ఱి నిన్ఱ = సాటి లేకుండా ఉండే, ఎన్ నీశతైక్కు = నా నైచ్యానికి, నిన్ అరుళిన్ కణ్ అన్ఱి = దేవరవారి కృపవద్ద తప్ప, పుకల్ ఒన్ఱుమ్ ఇల్లై = వేఱు ఎక్కడ ఒదిగి ఉండే చోటు లేదు, అరుట్కుమ్= నీ ఆ కృపకు కూడా, అఃతే పుకల్ = (నావంటి వారి) ఆ నైచ్యమే శరణం, (అందువల్ల), ఇరువోముక్కుమ్ పయన్ ఆన పిన్ = దాసునివల్ల దేవరవారి ఫలం, దేవరవారివల్ల దాసునకు ఫలం- అవి సిద్ధించిన పిమ్మట, ఇని = ఇకపై, పழுతే = వ్యర్థంగా, అకలుమ్ పొరుళ్ = విశ్లేషించడానికి తగిన కారణం, ఎన్ = ఏమి?

"ఎనక్కారుమ్ నికరిల్లైయే"- అని అతిశయంతో పల్కిన అముదనార్‌ను చూచి భగవద్రామానుజులు "ఈ అతిశయం మీకు ఎన్నాళ్ళు ఉంటుంది ? నేను మిమ్ములను విడచిపెట్టవచ్చు; మీరు నన్ను విడచిపెట్టవచ్చు. ఈ రెండిటిలో ఏది జరిగినా, ఈ అతిశయం మాఱిపోతుందికదా !'' అని అనగానే, "ఇక మేము వ్యర్థంగా విడిచిపోవడానికి కారణమేమీ లేదు'' అని అంటున్నారు.

స్వామీ ! నీచులలో నావంటివారెవరూ లేరు. ఇటువంటి నానైచ్యం పోగొట్ట డానికి దేవరవారి కృపతప్ప వేఱొక సాధనం లేదు. మీ కరుణకు నేను తప్ప వేఱొక పాత్రం లేదు. అందువల్ల, నన్ను విడిస్తే మీకు గతి లేదు, మిమ్ములను విడిస్తే నాకు గతి లేదు - అనే రీతిలోని సంబంధదార్ఢ్యం ఉన్నపుడు మీరు నన్ను విడిచి వెళ్ళే కారణం లేదు - అని భావం.



"తదహం త్వదృతే న నాథవాన్ మదృతే త్వం దయనీయవాన్ న చ, విధినిర్మిత మేతదన్వయం, భగవన్! పాలయ మా స్మ జీహపః" అనే ఆళవందార్ స్తోత్రరత్నశ్లోకంకూడా ఈ అర్థాన్నే కల్గినది.

"నీశతై"- "నీచతా" అనే సంస్కృతపదవికృతి. "నీచస్య భావః నీచతా" నీచునకుండే స్వభావం. 'అరుట్కుమఃతే పుకల్' -నీచుల విషయంలో కృప చూపితేకదా దయ ప్రకాశించడం; సఫలం కావడం.

**49.** ఆనతు శెమ్మై యఱనెఱి పొయ్మ్మై, అఱుశమయమ్
పోనతు పొన్ఱి యిఱన్దదు వెఙ్గలి, పూఙ్గమల
త్తేనతిపాయ్ వయల్ తెన్నరఙ్గన్కழల్ శెన్ని వైత్తు
త్తానతిల్ మన్నుమ్, ఇరామానుశ నిత్తలత్తుతిత్తే.

పూ కమలమ్ తేన్ = తామరపూలలో ఉండే మకరందం, నది పాయ్ = నదిగా ప్రవహించే, వయల్ = సస్యక్షేత్రాలను కల, తెన్ అరఙ్గన్ = శ్రీరంగంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుని, కழల్ = శ్రీచరణాలను, శెన్ని వైత్తు = శిరసా వహించి, తాన్ అతిల్ మన్నుమ్ = తాను ఆ శ్రీచరణాలలో ప్రవణులై ఉండే, ఇరామానుశన్ = భగద్రామానుజులు, ఇ తలత్తు ఉదిత్తు = ఈ భూమిలో అవతరించినందువల్ల, శెమ్మై =ఋజువైన, అఱమ్ నెఱి = ధర్మమార్గం, ఆనతు = సత్తను పొందింది, పొయ్మ్మై = అసత్యమే నిండి ఉండే, అఱు శమయమ్ = ఆఱు సిద్ధాంతాలు, పొన్ఱి పోనతు = నాశమయ్యాయి, వెమ్ కలి ఇఱన్దదు = క్రూరమైన కలికూడా నశించింది.

భగవద్రామానుజులు అవతరించినందువల్ల ఈ లోకానికి కల్గిన హితాలను గూర్చి ఇందులో అముదనార్ తెలుపుతున్నారు. తటాకాలలోని తామరపూవుల నుండి తేనె నదియై ప్రవహించి, క్షేత్రాలలోకి పాఱేటట్లున్న సమృద్ధిని కల్గిన అందమైనది శ్రీరంగదివ్యక్షేత్రం. దానికి ప్రభువైన శ్రీరంగనాథుని శ్రీచరణాలలో గొప్ప భక్తిని కల్గిన భగవద్రామానుజులు ఈ భూలోకంలో అవతరించిన తరువాత ఏమయినది? అని అంటే, పూర్వం కుదృష్టివాదులచే పాడుచేయబడ్డ ధర్మమార్గం తిరిగి స్థిరపడినది. శాస్త్రవిరుద్ధమైన బాహ్యమతాలు అన్నీ తలవాల్చాయి. కలిదోషంకూడా నశించిపోయింది.

**50.** ఉతిప్పన ఉత్తమర్ శిన్దైయుళ్, ఒన్నలర్ నెఞ్జమఞ్జి
క్కొతిత్తిడ మాఱి నడప్పన, కొళ్ళైవన్ కుత్తఱ మెల్లామ్

**పతిత్త ఎన్పున్ కవి పావినమ్ పూణ్డన పావుతొల్శీర్**
**ఎతిత్తలైనాతన్, ఇరామానుశన్తనిణైయడియే.**

పావు = లోకం అంతా వ్యాపించిన, తొల్ శీర్ = నిత్యాలైన కల్యాణగుణాలను కలవారు, ఎతి తలై నాతన్ = యతులకు ముఖ్యులైన నాథులు అయిన, ఇరామాను శన్తన్ = భగవద్రామానుజుల, ఇణై అడి = శ్రీచరణాలు రెండు, (ఎటువంటివి? అని అంటే), ఉత్తమర్ శిన్దైయుళ్ = ఉత్తమాధికారుల మనస్సులలో, ఉతిప్పన = ప్రకాశించేవి, ఒన్నలర్ నెఞ్జమ్ = శత్రువుల మనస్సు, అఞ్జి కొతిత్తిడ = భయపడి పరితపించేటట్లు, మాఱి నడప్పన = మాఱి మాఱి నడిచే స్వభావాన్ని కల్గినవి, కొళ్ళై వన్ కుఱ్ఱమ్ ఎల్లామ్ పతిత్త = అపారమైన, బలమైన దోషాలు అన్నీ పొదగబడిన, ఎన్ పున్ కవి = నా క్షుద్రమైన కవిత్వం, పా ఇనమ్ పూణ్డన = పాశురాలను (స్తోత్రంగా) కల్గి ఉన్నవి.

తమకు పరమప్రాప్యమైన భగవద్రామానుజుల శ్రీచరణాలను ఇందులో అముదనార్ వర్ణిస్తున్నారు. లోకం అంతా నిండిన కీర్తిని కలవారై, యతిసార్వభౌము లైన భగవద్రామానుజుల శ్రీచరణాలు ఎటువంటివి ? అనిఅంటే, వడుగనంబివంటి వారైన ఉత్తమాధికారులచే నిరంతరం ధ్యానింపబడేవి. ప్రతిపక్షుల మనస్సులో పరితాపాన్ని కల్గిస్తాయి. పలు రీతులలో దోషాలు నిండిన నా పాశురాలనుకూడా స్వీకరిస్తున్నాయి - అని భావం.

**(ఒన్నలర్ నెఞ్జ మఞ్జి క్కొతిత్తిడ మాఱి నడప్పన)** - బాహ్యాకుదృష్టివాదులను నిరసించడంకోసం శ్రీరామానుజులు పలుచోట్ల సంచరించడాన్ని గమనించవచ్చు. **"మాఱి నడత్తల్"**- ఒక అందమైన నడక, నమ్బెరుమాళ్ నడకవంటిది.

51. **అడియైత్తొడర్న్దెళుమ్బి ఐవర్కట్కాయ్, అన్ఱు పారతప్పోర్**
**ముడియ ప్పరినెడుమ్ తేర్విడుమ్ కోనై, ముఴుతుణర్న్ద**
**అడియర్క్కముతమ్ ఇరామానుశనెన్నై యాళవన్ది**
**ప్పడియిల్ పిఱన్దతు, మఱ్ఱిల్లై కారణమ్ పార్త్తిడిలే.**

అన్ఱు = పూర్వకాలంలో (అపుడు), అడియై తొడర్న్దు = శ్రీచరణాలను అవలంబించి, ఎళుమ్బి = గర్వించి విజృంభించిన, ఐవర్కట్కు ఆయ్ = పంచపాండవులకోసం (పక్షపాతాన్ని వహించి), పారతప్పోర్ = భారతయుద్ధంలో ముడియ = (దుర్యోధనాదులు) నశించేటట్లుగా, పరి నెడు తేర్ = గుఱ్ఱాలను పూన్చిన గొప్ప రథాన్ని, విడుమ్ = నడపిన, కోనై = సర్వేశ్వరుని, ముఴుతు ఉణర్న్ద = (స్వరూపస్వభావాలలో ఒక్కటికూడా తగ్గని రీతిలో) పూర్తిగా తెలిసికొన్న, అడియర్క్కు = భాగవతులకు, అముతమ్ = పరమభోగ్యులైన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఇప్పడియిల్ = ఈభూమండలంలో, వన్దు పిఱన్దతు = వచ్చి అవతరించడం (ఎందుకోసం) అని అంటే, ఎన్నై ఆళ = దాసుని కింకరునిగా చేసికోవడంకోసమే (రక్షించడంకోసమే), పార్త్తిడిల్ = పరిశీలించి చూస్తే, మఱ్ఱు కారణమ్ ఇల్లై = ఇది తప్ప వేఱొక కారణం లేదు.



భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించడం నన్ను దాసునిగా చేసికోవడంకోసమే తప్ప వేఱొక కార్యంకోసం కాదు- అని అంటున్నారు. తననే శరణంగా ఆశ్రయించిన పంచపాండవులకోసం భారతయుద్ధంలో అర్జునునకు రథసారథియైన, పరమసులభుడైన శ్రీకృష్ణుని స్వరూపస్వభావాలను చక్కగా తెలిసికొని అభినివేశాన్ని పొందే భాగవతులకు పరమభోగ్యులైన భగవద్రామానుజులు దాసుడనైన నన్ను సేవకునిగా అనుగ్రహించడంకోసమే ఈ భూమిలో అవతరించారు. ఇది తప్ప వేఱొక కారణం లేదు. **"ఎదిర్ శూఴల్ పుక్కు ఎనైత్తోర్ పిఱప్పుమ్ ఎనక్కే యరుళ్కళ్ శెయ్య విత్శూఴ్న్దతాల్ ఎనక్కేలెమ్మాన్ తిరివిక్కిరమనైయే"** అని అంటూ నమ్మాళ్వార్లు అనుసంధించిన రీతి స్మరణీయం.

52. **పార్త్తా నఱుశమయఙ్గళ్ పతైప్ప, ఇప్పార్ముఴుతుమ్**
**పోర్త్తాన్ పుకఴ్ కొణ్డు పున్మైయినేనిడైత్తాన్ పుకున్దు,**
**తీర్త్తా నిరువినైతీర్త్తరఙ్గన్ శెయ్య తాళిణైయోడు**
**ఆర్త్తాన్, ఇవై ఎమ్మిరామానుశన్ శెయ్యు మఱ్పుతమే.**

(భగవద్రామానుజులు), అఱు శమయఙ్గళ్ = (వేదబాహ్యాలైన) ఆఱు దర్శనాలు, పతైప్ప = తల్లడిల్లేటట్లుగా, పార్త్తాన్ = కటాక్షించారు, ఇప్పార్ ముఴుతుమ్ = ఈ భూమండలం అంతటిని, పుకఴ్ కొణ్డు = (తమ) కీర్తితోనే, పోర్త్తాన్ = ఆవరించారు, పున్మైయిన్ ఇడై = నీచుడనైన దాసునిపట్ల, తాన్ పుకున్దు = తానుగానే (నిర్హేతుకకృపతో) వచ్చి ప్రవేశించి, ఇరు వినై = గొప్ప పాపాలను, తీర్త్తాన్ = పోగొట్టారు, తీర్త్తు = పాపాలను పోగొట్టడమే కాక, అరఙ్గన్= శ్రీరంగనాథుని, శెయ్య =అందమైన, తాళ్ ఇణైయోడు = శ్రీచరణాలతో, ఆర్త్తాన్= (నన్ను) అన్వయింపజేశారు, ఇవై = (అనే) ఈ కార్యాలు అన్నీ, ఎమ్ ఇరామానుశన్ = మాకు స్వామి అయిన భగవద్రామానుజులు, శెయ్యుమ్ =చేసిన, అఱ్పుతమ్ = ఆశ్చర్యకరలీలలు.

భగవద్రామానుజుల ఆశ్చర్యకరాలైన కొన్ని లీలలను అముదనార్ ప్రస్తావించి పల్కుతున్నారు. శాక్య- ఉలూక్య- బౌద్ధ- చార్వాక- పాశుపత- కాణాదులని చెప్పబడే బాహ్యమతాలను అన్నిటిని వణకేటట్లు చేశారు. ఈ భూమండలం అంతా తమ కీర్తి వ్యాపించేటట్లు చేశారు. ఆత్మగుణాలు ఏమీ లేని నాహృదయంలోకి ప్రవేశించి, నా పాపాలను పోగొట్టి, శ్రీరంగనాథుని శ్రీపాదాలలో నన్ను ఆశ్రయింపజేశారు. ఈ విధంగా భగవద్రామానుజులు చేసినవి అన్నీ చాలా ఆశ్చర్యకరమైనవి.

**53.** అఱ్పుతమ్ శెమ్మై యిరామానుశన్, ఎన్నై యాళవన్ద
కఱ్పకమ్ కఱ్ఱవర్ కాముఱు శీలన్, కరుతరియ
పఱ్పల్లుయిర్కళుమ్ పల్లులకి యావుమ్ పరనతెన్నుమ్
నఱ్పొరుళ్తన్నై, ఇన్నానిలత్తే వన్దు నాట్టిననే.

ఎన్నై =నన్ను, ఆళ వన్ద = పాలించడంకోసం అంతరించిన, కఱ్పకమ్ = ఉదారులు, కఱ్ఱవర్ = జ్ఞానులు, కాముఱు = ఆశపడే రీతిలోని, శీలన్ = శీలగుణాన్ని కలవారు, అఱ్పుతన్ = ఆశ్చర్యకరచేష్టితాలను కలవారు, శెమ్మై = ఋజువై ఉండే స్వభావాన్ని కల్గినవారైన. ఇరామానుశన్ = భగవద్రామానుజులు, కరుత అరియ = భావించడానికి కూడా సాధ్యం కానట్లు, పల్ పల్ ఉయిర్కళుమ్= లెక్క లేకుండా ఉండే ఆత్మలు, పల్ ఉలకు యావుమ్ = (ఆ ఆత్మలకు వాసస్థానమైన) అంతు లేని అన్ని లోకాలు, పరనతు = భగవానుని సొత్తు, ఎన్నుమ్= అనే, నల్ పొరుళ్తన్నై = సారార్థాన్ని, ఇ నాళిలత్తే = ఈ లోకంలో, వన్దు = వచ్చి, అవతరించి, నాట్టినన్ = స్థాపించారు.

భగవద్రామానుజులు మతాంతరులను ఖండించి, స్థాపించిన సిద్ధాంతం ఇది అని అంటున్నారు. గొప్పజ్ఞానులు అందఱు కీర్తించడానికి తగిన కల్యాణ గుణాలను, అతిమానుషవ్యాపారాలను కలవారైన భగవద్రామానుజులు ఈలోకంలో అవతరించి, "సకలప్రాణులు, ఆ ప్రాణులకు వాసస్థానంగా ఉండే సకలలోకాలు శ్రీమన్నారాయణునకే శేషభూతాలు'' అనే పరమార్థాన్ని స్మరింప జేశారు.

ఉలకు+యావుమ్ = ఉలకియావుమ్. "యువ్వరినియ్యామ్" అని నన్నూల్ సూత్రం. "పల్లులకిల్ యావుమ్" అనే పాఠం కట్టళైక్కలిత్తుఱై ఛందస్సుకు చేరదని జీయర్వ్యాఖ్యలో తిరస్కరింపబడింది. 'ఉలకియావుమ్' అనే పాఠంలోకూడా ఒక అక్షరం ఎక్కువకావడం లేదా? అని అంటే, గతంలో 43వ పాశురవ్యాఖ్యలో "ఉరైక్కిన్ఱననుమక్కియాన్" అనే చోట వివరించాము. గమనించండి.



**54.** నాట్టియ నీశచ్చమయఙ్గళ్ మాణ్డన, నారణనై
క్కాట్టియ వేతమ్ కళిప్పుఱ్ఱతు, తెన్కురుకైవళ్ళల్
వాట్ట మిలా వణ్డమిళ్మఱై వాళ్న్దతు మణ్ణులకిల్
ఈట్టియ శీలత్తు, ఇరామానుశన్ తన్నియల్వు కణ్డే.

మణ్ ఉలకిల్ = ఈ భూలోకంలో, ఈట్టియ = ఇంకా ఇంకా వృద్ధి జెందిన, శీలత్తు = శీలగుణాన్ని కల్గిన, ఇరామానుశన్తన్= భగవద్రామానుజుల, ఇయల్వు = స్వభావాన్ని, కణ్డు =చూచి, కాట్టియ = (దుష్టయుక్తులతో) స్థాపించిన, నీశ శమయఙ్గళ్ = క్షుద్రమతాలు అన్నీ, మాణ్డన = నశించాయి, నారణనై = శ్రీమన్నారాయణుని, కాట్టియ = ప్రతిపాదించిన, వేతమ్ =వేదాలు, కళిప్పు ఉఱ్ఱతు = (మనకు ఇక ఏకొఱత లేదు అని) గర్వాన్ని కల్గినవి, తెన్ కురుకై = అందమైన తిరుక్కురుకూర్లో అవతరించిన, వళ్ళల్ = ఉదారులైన ఆళ్వార్లు (అనుగ్రహించిన), వాట్టమ్ ఇలా = ఏకొఱత లేని, వణ్ తమిళ్ మఱై = గొప్ప ద్రావిడవేదం అయిన తిరువాయ్మొళిని, వాళ్న్దతు = ఉజ్జీవించింది.

సింహాన్ని కలలో చూచినా సామాన్యమృగాలు నశించిపోతాయి. వాటిని చంపడంకోసం సింహం ప్రత్యేకంగా ఏ ప్రయత్నాన్ని చేయనక్కఱలేదు. అదే విధంగా, ఈలోకంలో విజృంభించిన బాహ్యకుదృష్టిమతాలను నిరాకరించడంకోసం భగవద్రామానుజులు ప్రత్యేకంగా ఏప్రయత్నం చేయలేదు. వారి స్వభావాన్ని దర్శించినందువల్లనే మతాంతరాలు అన్నీ నశించిపోయాయి. అవి నిరసింపబడగానే శ్రీమన్నారాయణపరాలైన వేదాలు, ఆ వేదాలసారమైన ఆళ్వార్ల శ్రీసూక్తులు గొప్పగా ప్రకాశించి వర్ధిల్లాయి- అని భావం.

"ఈట్టియ శీలత్తు"- ఒక్కొక్క క్షణం ఆశ్చర్యకరమైన అతిమానుష లీలలతో భగవద్రామానుజుల శీలగుణాలు ఇంకా ఇంకా వర్ధిల్లుతూనే ఉన్నాయి- అని భావం.

**55.** కణ్డవర్ శిన్దై కవరుమ్ కడిపొళిల్ తెన్నరఙ్గన్,
తొణ్డర్ కులావు మిరామానుశనై, తొకై యిఱన్ద
పణ్డరు వేదఙ్గళ్ పార్మేల్ నిలవిడప్పార్త్తరుళుమ్
కొణ్డలై మేవి త్తొళుమ్, కుడియా మెఙ్గళ్ కోక్కుడియే.

తొకై ఇఱన్ద = లెక్కలేనన్ని, పణ్ తరు = స్వరప్రధానాలైన, వేదఙ్గళ్ = వేదాలు, పార్ మేల్ = ఈ భూమిలో, నిల విడ = పెరిగివర్ధిల్లేటట్లు, పార్త్తరుళుమ్ = చేసినవారు, కొణ్డలై = పరమోదారులు, కణ్డవర్ శిన్దై = దర్శించినవారి

మనస్సును, కవరుమ్ = అపహరించే, కడి పొ*ழि*ల్ =సువాసనను మిక్కిలిగా కల తోటలచే పరివేష్ఠితమైన, తెన్ అరఙ్గన్ = అందమైన శ్రీరంగానికి నాథుడైన శ్రీరంగ నాథునకు, తొణ్డర్ = దాసులైన శ్రీవైష్ణవులచే, కులావుమ్ = ప్రశంసింపబడేవారైన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, మేవి = ఆదరించి, తొ*ழு*మ్ కుడి = నమస్కరించే కులం, ఎఙ్గళ్ కోక్కులమ్ ఆమ్ = మా స్వామిగా కూడిన కులం.

మనోహరమైన తోటలచే చుట్టబడి ఉండే శ్రీరంగంలో నివసించే శ్రీరంగ నాథుని భక్తులచే ప్రశంసింపబడేవారు, అంతు లేని వేదాలు మంతాతరస్థులచే పాడుచేయబడకుండా ఉండే రీతిలో వాటిని ప్రకాశింపజేసి, వర్ధిల్లజేసినవారు, అడిగినవారికి వారు అడిగిన అర్థాలను ఉపదేశించేవారు అయిన భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించే మహానుభావులే దాసుడనైన నన్ను పాలించడానికి అర్హులు - అని భావం. శ్రీరామానుజుల భక్తులకే నేను దాసుడనై ఉన్నాను - అని సారం.

శ్రీరామానుజులను ఆశ్రయించి సేవించే కులం మా స్వామికులం. **(ఇరామానుశనై తొ*ழு*మ్ కుడి ఎఙ్గళ్ క్కులమ్)** - భగవద్రామానుజులుకాదు మాకు స్వామి; వారిని ఆశ్రయించేవారే మాకు స్వామి. **"ఎన్ కోక్కులమ్"** అని అనకుండా **"ఎఙ్గళ్కోక్కులమ్"** అని బహువచనంగా పల్కడం- తమ సంబంధి సంబంధులను పురస్కరించుకొని.

**"కో"** అనే పదానికి గొప్పతనం అనే అర్థం ఉన్నందువల్ల, **"ఎఙ్గళ్ కోక్కులమ్"**- మా గొప్పదైన కులం ఎటువంటిది ? అని అంటే, శ్రీరామానుజులను ఆశ్రయించి సేవించే కులం- అనికూడా వివరించవచ్చు. **"ఎఙ్గళ్ కోక్కుడియే"** అనే పాఠంకూడా ఉన్నది. అర్థం ఒకటే.

**56.** **కోక్కులమన్నరై మూవె*ழு*కాల్, ఒరుకూర్ మ*ழு*వాల్**
**పోక్కియ తేవనై ప్పో*ఱ్ఱు*మ్ పునితన్, పువన మెఙ్గు**
**మాక్కియ కీర్త్తి యిరామానుశనై యడైన్దపిన్**
**వాక్కురైయాతు, ఎన్మనమ్ నినైయాతిని మ*ఱ్ఱొ*న్ఱైయే.**

కోక్కులమ్ = క్షత్రియ కులానికి, మన్నవరై = ప్రభువులను, మూ ఎ*ழு* కాల్ = ఇరవైఒక్క మార్లు, ఒరు కూర్ = పదును కల్గిన ఒక, మ*ழு*వాల్ = పరశువుతో, పోక్కియ = (పరశురామావతారంలో) సంహరించిన, తేవనై = భగవానుని, పో*ఱ్ఱు*మ్= స్తుతిస్తున్న, పునితన్ = పరమపవిత్రులు, పువనమ్ ఎఙ్గుమ్ = లోకం అంతట, ఆక్కియ కీర్త్తి = వ్యాపించిన కీర్తిని కలవారు అయిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, అడైన్ద పిన్ = ఆశ్రయించిన తరువాత, ఇని = ఇకపైన గలకాలం అంతా, మ*ఱ్ఱు* ఒన్ఱై = వేఱు ఏ విషయాన్ని, ఎన్ వాక్కు = నా వాక్కు, ఉరైయాతు = చెప్పదు, ఎన్ మనమ్ = నా మనస్సు, నినైయాతు = భావించదు.

**"కొణ్డలై మేవి త్తొ*ழு*మ్ కుడియా మెఙ్గళ్ కోక్కులమే"** అని పల్కిన అముదనార్‌ను చూచి కొందరు "మీరు ఏవిషయంలో అవగాహించినా ఆ విషయాన్ని గూర్చి ఈ విధంగానే పల్కుతున్నారు. నిన్నటివరకు ఒక విధంగా ఉన్నారు. ఈ నాడు ఈ విధంగా ఉన్నారు రేపు ఇంకొక రీతిలో ఉండబోతారు. ఇపుడు ఆ స్థితికి తగినట్లు పలుకబోతారు. మీ మాటకు ఒక గౌరవం ఉంటుందా?- అని పలుకగా, "ఇక ఆ విధంగానా? భగవద్రామానుజులను ఆశ్రయించిన తరువాత నా వాక్కు, మనస్సు ఇక వేఱొక విషయాన్ని తెలియదు"- అని అంటున్నారు.

**(కోక్కులమన్నరై..... ప్పోక్కియ తేవన్)** - లోకంలో ఎవరూ తమను నశింప జేసేవారు లేనందువల్ల అహంకరించి తిరిగే, క్రూరంగా వ్యవహరించే క్షత్రియాధము లను పలువురిని వధించడంకోసం శ్రీమన్నారాయణుడు జమదగ్ని మునివర్యుని భార్య అయిన రేణుకకు కుమారుడై రాముడనే పేరుతో అవతరించాడు. పరశువును ఆయుధంగా గ్రహించినందున అతడు పరశురాముడనే నామంతో వ్యవహరింప బడ్డాడు. తన తండ్రి హోమధేనువును కార్తవీర్యార్జునుడు అపహరించి, తండ్రిని వధించిన కారణంవల్ల అతనిని, అతని కుమారులను చంపి, ఆ కారణంవల్లనే క్షత్రియకులం అంతటిపై కోపాన్ని పొంది, లోకంలో ఉండే రాజులను పలువురిని ఇరవై ఒక్కమార్లు వారితో పోరాడి వధించాడు. ఈ పరశురాముడు ఏడుగురు చిరంజీవులలో ఒకడు. ఇతని బలిమి, శక్తి అత్యద్భుత మైనవి. శివుని కైలాసపర్వతాన్ని పెళ్ళగించి ఎత్తిన రావణుడు గొప్ప బలాన్ని కలవాడని, అతనికంటే కార్తవీర్యార్జునుడు బలిమిని కలవాడని, అతనికంటే పరశురాముడు బలిమిని కలవాడని ఇతిహాసాల వల్ల తెలుస్తున్నది. విషాన్ని మింగి, గంగను ధరించి, మేరువును విల్లుగా వంచి, త్రిపురదాహాన్ని చేసి, మన్మథుని దహించి, యముని ఓడించి, సంహారకృత్యాన్ని చేసే గొప్ప శక్తిసామర్థ్యాలను కల ఉగ్రమూర్తి రుద్రుడు. ఆ రుద్రుడు నివసించే కైలాసగిరిని ఒకమారు రావణుడు సమూలంగా పెకలించి పైకి ఎత్తాడు. అంతటి బలవంతుడై, దిగ్విజయాన్ని పొంది, దిగ్గజాలను గెలిచిన రావణుని కార్తవీర్యార్జు నుడు బంధించి చెరలో పెట్టాడు. అతని బాహువులను పరశురాముడు ఖండించి వేశాడు.

భగవానుని దశావతారాలలో ఆఱవ అవతారం అయిన ఈ పరశురామావతారం, ఏడవ అవతారం అయిన దశరథరామునిపై కోపించడం, ఆ ఇరువురు ఒకరితో ఇంకొకరు యుద్ధానికి తలపడడం, వారిలో ఒకరు ఇంకొకరిని గెలవడం ఏవిధంగా పొసగుతుంది? అని అంటే, దుష్టులై మదించి తిరిగే క్షత్రియులను వధించడంకోసం పరశురామునితో ఆవేశించిన విష్ణుశక్తివిశేషం ఆ కార్యం ముగిసిన తరువాత ఆ విష్ణువుయొక్క అంశావతారం అయిన దశరథరామునిచే గ్రహింపబడి నందువల్ల ఇది అంతా పొసగుతుందని గ్రహించాలి. ఇందువల్ల ఆవేశావతారంకంటే అంశావతారానికి గల ప్రాధాన్యం స్పష్టపడుతున్నది.

శ్రీమన్నారాయణుని విభవవాతారాలు అసంఖ్యాకాలు. అవి ముఖ్య-అముఖ్యాలని రెండు విధాలు వాటిలో ముఖ్యాలు గొప్పవి; మిగిలినవాటికంటె తక్కువ ప్రభావాన్ని కల్గినవి. ముఖ్యమైనవి అంటే సాక్షాదవతారాలు. అముఖ్యమైనవి అంటే ఆవేశావతారాలు. ఆవేశావతారాలుకూడా స్వరూపావేశాలని, శక్త్యావేశాలని రెండు విధాలుగా ఉంటాయి. స్వరూపావేశాలు అంటే- చేతనుల శరీరాలలో భగవానుడు తనయొక్క రూపంతో ఆవేశించి ఉండడం. పరశురాముడు, బలరాముడు మొదలైనవారు ఇటువంటివారు. శక్త్యావేశాలు అంటే -చేతనులలో, ఆయా కార్యాల సందర్భంలో భగవానుడు శక్తిమాత్రంతో ప్రకాశిస్తాడు. కార్తవీర్యార్జునుడు, అర్జునుడు, వ్యాసుడువంటివారు ఇటువంటివారు. వీటిలో, శక్త్యావేశాలకంటే స్వరూపావేశాలు ప్రబలాలు. వీటి వాస్తవస్థితిని విష్వక్సేనసంహిత మొదలైన పాంచరాత్రసంహితలలో, తత్త్వత్రయంలో, దాని వ్యాఖ్యానంలో విస్తృతంగా చూడవచ్చు. పరశురామావతారం స్వరూపావేశావతారం.

ఈ పాశురవ్యాఖ్యలో శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన శ్రీసూక్తులు ఈ విధంగా ఉన్నాయి- **"పరశురామావతారమ్ అహంకారయుక్తజీవనై అధిష్ఠిత్తు నిఱ్ఱైయాలే ముముక్షుక్కళుక్కు అనుపాస్యమన్రో ! "పోక్కియ తేవనై ప్పోఱ్ఱుమ్ పునితన్" ఎన్బానెన్ ? ఎన్నిల్, అదఱ్కు క్కుఱైయిల్లై. విరోధినిరసనమ్ పణ్ణిన ఉపకారత్తుక్కు త్తోఱ్ఱు స్తుతిక్కిఱమాత్ర మొழிయ, తదుపాసన మల్లామైయాలే. "మన్నడఙ్గ మழுవలమ్ కైక్కొణ్డ ఇరామనమ్బి" ఎన్నుమ్, "వెన్ఱి మామழுవేన్ది మున్ మణ్మిశై మన్నరై మూవెழுకాల్ కొన్ఱ తేవా!" ఎన్నుమ్ ఆழ்వార్ అరుళిచ్చెయ్‌దలుమ్ విరోధినిరసనస్వభావత్తుక్కు త్తోఱ్ఱు త్తుతిత్తతు. ఇత్తనైయిఱే".**



**"అద్వైన్దదన్పిన్ వాక్కురైయాతు ఎన్ మనమ్ నినైయాతు"** అనే పాఠం కూడా ఉన్నది.

57. **మఱ్ఱొరు పేఱు మతియాతు, అరఙ్గన్‌మలరడిక్కాళ్**
**ఉఱ్ఱవరే తనక్కుఱ్ఱవరా క్కొళ్ళుముత్తమనై,**
**నఱ్ఱవర్ పోఱ్ఱు మిరామానుశనై యిన్నానిలత్తే**
**పెఱ్ఱనన్, పెఱ్ఱపిన్ మఱ్ఱియే నొరు పేతైమైయే.**

మఱ్ఱు ఒరు పేఱు = ప్రయోజనాంతరాలను, మతియాతు = లెక్కించకుండా, అరఙ్గన్ = శ్రీరంగనాథునియొక్క శ్రీచరణపద్మాలకు, ఆళ్ ఉఱ్ఱవరే = శేషభూతులే, తనక్కు ఉఱ్ఱవర్ ఆ = తమకు ఆత్మబంధువులుగా, కొళ్ళుమ్ = గ్రహించే (భావించే), ఉత్తమనై = ఉత్తమపురుషులై, నల్ తవర్ పోఱ్ఱుమ్ = ప్రపన్నులచే పొగడబడే, ఇరామానుశనై = భగవద్రామానుజులను, ఇ నాణిలత్తే పెఱ్ఱవన్ = ఈ లోకంలో దాసుడనైన నేను ఆశ్రయించగలిగాను, పెఱ్ఱ పిన్ = ఆశ్రయించిన తరువాత, మఱ్ఱు ఒరు = (అన్యవిషయాలను ఆశించడం మొదలైన) ఇక ఏవిధమైన, పేతమై = అజ్ఞానకార్యాన్ని, అఱియేన్ = తెలియలేను.

**"ఇని ఎన్ వాక్కురైయాతు, ఎన్ మనమ్ నినైయాతు మఱ్ఱొన్ఱై"** అని మీరు ఏ విధంగా చెప్పవచ్చు ? అజ్ఞానప్రదమైన లోకంలో ఉన్నారు కనుక అవివేకం కలిగి ఆవరిస్తే ఈ స్థితి ఎంతసేపు ఉంటుంది? అని కొందరు ప్రశ్నించగా "భగవద్రామానుజులను ఈ లోకంలో ఆశ్రయించిన తరువాత ఇక ఏనాడూ అవివేకిని కాబోను'' - అని అంటున్నారు.

భగవద్రామానుజులు ఎటువంటివారు? అని అంటే, శ్రీరంగనాథుని శ్రీచరణాలలో కైంకర్యాన్ని చేసేవారినే తమ ఆత్మబంధువులుగా గ్రహించడం తప్ప వేఱొక ప్రయోజనాన్ని లెక్కించనివారు.

**"నల్‌తవర్ పోఱ్ఱుమ్"**- ప్రపత్తి అనే గొప్ప తపస్సును చేసేవారిచే పొగడబడేవారు.

58. పేతైయర్ వేతప్పొరుళిదెన్ఱున్ని, ప్పిరమ నన్ఱై
న్నోతి మఱ్ఱెల్లా వుయిరు మఃతెన్ఱు, ఉయిర్‌కళ్ మెయ్‌విట్టు
ఆతిప్పరనోడన్ఱా మెన్ఱు శొల్లు మవ్వల్లలెల్లామ్
వాతిల్ వెన్ఱాన్, ఎమ్మిరామానుశన్ మెయ్‌మ్మతిక్కడలే.

పేతైయర్ = (వేదాన్ని ప్రమాణంగా గ్రహించని) అవివేకులు, ఇతు వేద ప్పొరుళ్ ఎన్ఱు = మేము పలికే ఇదే వేదంయొక్క అర్థం అని పల్కుతూ, పిరమమ్ నన్ఱు = పరబ్రహ్మ అన్నిటికంటే విలక్షణమైనది, ఎన్ఱు ఓతి = అని పలికి, మఱ్ఱు ఎల్లా = ఆ పరబ్రహ్మ తప్ప మిగిలిన అన్ని జీవరాసులు, అతు ఎన్ఱు = ఆ బ్రహ్మమే అని పల్కి, ఉయిర్కళ్ =జీవాత్మలు, మెయ్ విట్టు = దేహాన్ని విడిచిన తరువాత, ఆతి పరనోడు = సర్వకారణభూతుడైన పరమపురుషునితో, ఒన్ఱు ఆమ్ ఎన్ఱు = ఐక్యాన్ని పొందుతున్నవి- అని, శొల్లుమ్ = పలికే, అవ్వల్లల్ ఎల్లామ్ = ఆ కోలాహలాలను అన్నిటినీ, మెయ్ మతి కడల్ = తత్త్వజ్ఞానసముద్రులైన, ఎమ్ ఇరామానుశన్ = స్వామి భగవద్రామానుజులు, వాదిల్ వెన్ఱాన్ = వాదంలో నిరసించి, విజయాన్ని పొందారు.

భగవద్రామానుజులు కుదృష్టుల కుత్సితవాదాలను ఖండించిన రీతులలోని ఒక రీతినిగూర్చి ఇందులో ప్రస్తావిస్తూ అముదనార్ ఆనందిస్తున్నారు. కొందఱు మూర్ఖులు తాము పల్కినదే వేదాలలోని వాస్తవమైన అర్థమని వదరుతూ అపార్థాలను జల్పిస్తున్నారు. పరబ్రహ్మం సర్వవిలక్షణం, జీవాత్మలన్నీ పరబ్రహ్మలోని ఒకభాగం. ఇపుడు ఉపాధివశంచేత వేఱ్వేరుగా భాసిస్తున్నాయి. ఆ ఉపాధి తొలగిన తరువాత జీవాత్మలన్నీ పరబ్రహ్మతో ఐక్యాన్ని పొందుతున్నాయి- అని మూర్ఖులు ప్రలపించే ప్రలాపాలను అన్నిటినీ తత్త్వజ్ఞాననిధి అయిన భగవద్రామానుజులు వాదంలో ఖండించి వాస్తవార్థాన్ని స్థాపించి, విజయాన్ని పొందారు.

చిదచిదీశ్వరులని తత్త్వాలు మూడు. ఈ మూడు తత్త్వాలు సత్యాలు; నిత్యాలు. చిత్తు, అచిత్తు అనే తత్త్వాలలో అంతర్భవించే అన్ని పదార్థాలు ఈశ్వరునకు శరీరాలు. అనాది అయిన అవిద్యచేత చేయబడి, పేరుకొని పోయిన కర్మలవలన ఏర్పడే ప్రకృతి సంబంధంవల్ల జీవాత్మయొక్క సహజమైన జ్ఞానానందస్వరూపం మఱుగుపఱుచబడి ఉన్నది. ఆ కర్మలు తొలగిన తరువాత స్వస్వరూపం ఆవిర్భ విస్తుంది. భగవానుని కృపవల్ల కర్మలు తీరి, స్వస్వరూపం భాసించి, పరమపదాన్ని చేరి కైంకర్యానుభవాన్ని, గుణానుభవాన్ని పొంది, పరమానందాన్ని పొందడం మోక్షం- అనే ఈ రీతిలోని తత్త్వార్థాలను భగవద్రామానుజులు స్థాపించారు.

**"పిరమమ్"**- ఇది "బ్రహ్మ" మనే సంస్కృతపదవికారం. **"ఉయిర్కళ్ మెయ్ విట్టు ఆదిప్పరనోడు ఒన్ఱామ్"** -జీవాత్మలు పరబ్రహ్మలో ఐక్యం పొందడమనే మోక్షం- అని కుదృష్టులు ఉపపాదిస్తారు. **"తత్త్వమసి"** అని, "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అని మొదలైన వేదవాక్యాలకు ఈ విధమైన అర్థాన్ని పల్కుతారు.



**"వెన్ఱాన్"** అనే పదాన్ని సమాపకక్రియగా గ్రహించకుండా **(విదైయాల్ అణైయుమ్ పెయర్)** క్రియాజన్య నామవాచకంగా గ్రహించి, వాదంలో గెల్చినవారైన భగవద్రామానుజులు, **"మెయ్మ్మదిక్కడల్"** -సత్యజ్ఞానసముద్రులై ఉన్నారు- అని వాక్యం ముగిసినట్లుగా వివరించవచ్చు.

**59.** **కడలళవాయ తిశైయెట్టినుళ్ళుమ్, కలియిరుళే**
**మిడై తరు కాలత్తిరామానుశన్, మిక్క నాన్మఱైయిన్**
**శుడరొళియా లవ్విరుళై త్తురన్దిలనే లుయిరై**
**యుడైయవన్, నారణ నెన్ఱు అఱివారిల్లై యుఱ్ఱుణర్న్దే.**

కడల్ అళవు ఆయ్ = నాల్గు సముద్రాలను ఎల్లగా కల్గిన, తిశై ఎట్టినుళ్ళుమ్= అన్ని చోట్ల (ఎనిమిది దిక్కులలో), కలి ఇరుళే = కలిపురుషుడనే అంధకారమే, మిడై తరు = నిబిడంగా ఉండే, కాలత్తు = కాలంలో, ఇరామానుశన్ = భగవద్రామానుజులు (అవతరించి), నాల్ మఱైయిన్ = నాల్గు వేదాలలోని, మిక్క= అంతు లేని (మిక్కిలి), శుడర్ ఒళియాల్ = తేజస్సుతో, ఆవ్విరుళై = ఆ కలిదోషాన్ని, తురత్తిలన్ ఏల్ = పోగొట్టి ఉండకపోతే, ఉయిరై ఉడైయాన్ = జీవాత్మలన్నిటిని కలవాడు, నారణన్ ఎన్ఱు = శ్రీమన్నారాయణుడే అని, ఉఱ్ఱు ఉణర్న్దు అఱివార్= నిశితంగా తెలిసికొన్నవారు, ఇల్లై = లేరు (ఉండి ఉండరు)

నా స్వామి శ్రీరామానుజులు అవతరించి వేదార్థాలను స్పష్టంగా ప్రకాశింపజేసి ఉండకపోతే ఈలోకం అంతా అజ్ఞానంగానే ఉండి ఉంటుంది. దైవాధీనంగా నా స్వామి అవతరించి అంతటా వ్యాపించి ఉండే కలిపురుషుని దోషాలను పోగొట్టి, వేదజ్యోతిని వెలిగించి, అజ్ఞానాంధకారాన్ని పోగొట్టగానే అందఱు శ్రీమన్నారా యణుడే సర్వశేషి అనే పరమార్థాన్ని తెలిసికొని ఉజ్జీవించడం సాధ్యమైనది- అని అంటున్నారు.

**"మిడైతరుతల్"** -నిబిడంగా ఉండడం, నిరంతరం అంతటా వ్యాపించి ఉండడం.

**60.** **ఉణర్న్ద మెయ్ఞ్ఞానియర్ యోకన్దొఱుమ్, తిరువాయ్మొழియిన్**
**మణన్దరు మిన్నిశై మన్ను మిడన్దొఱుమ్, మామలరాళ్**
**పుణర్న్ద పొన్ మార్వన్ పొరున్దుమ్ పతితొఱుమ్ పుక్కు నిఱ్కుమ్**
**కుణన్దికழ் కొణ్డల్, ఇరామానుశ నెజ్కులక్కొழున్దే.**

కుణమ్ తికழ్ = ఆత్మగుణాలు ప్రకాశించేవారు, కొణ్డల్ = (ఔదార్యంలో) కాలమేఘంలో పోలినవారు, ఎమ్ కులమ్ కొழுన్దు = నా కులానికి నాథులు అయిన, ఇరామనుశన్ = భగవద్రామానుజులు, (ఎక్కడ వేంచేసి ఉన్నారు? అని అంటే), ఉణర్న్ద = అభ్యసించి తెలిసిన, మెయ్ ఞానియర్ =తత్త్వజ్ఞానుల, యోకమ్ తొఴుమ్ =గోష్ఠులు అంతా, తిరువాయ్మొழிయిన్ మణమ్ = తిరువాయ్మొழி యొక్క పరిమళం, తరుమ్ = ఇచ్చే, ఇన్ ఇశై = మిక్కిలి భోగ్యమైన రాగాన్ని కల్గిన, ఇడమ్ తొఴుమ్ = చోట్లు అంతటా, మా మలరాళ్ = పద్మంలో అవతరించిన లక్ష్మీదేవి, పుణర్న్ద = సంశ్లేషించిన (నిత్యవాసం చేసే), పొన్ మార్బన్= బంగారంవలె అందమైన (స్పృహణీయమైన) వక్షస్సును కల శ్రియఃపతి, పొరున్దుమ్= వేంచేసి ఉండే, పతి తొఴుమ్ = దివ్యదేశాలు అంతటా, పుక్కు నిఱ్కుమ్ = ప్రవేశించి, వేంచేసి ఉంటారు.

జ్ఞానం ఉద్బుద్ధమైన మహాత్ములయొక్క సమూహం ఎక్కడ ఉన్నదో అక్కడ అంతటా వేంచేసి ఉండేవారు, తిరువాయ్మొழிయొక్క పరమభోగ్యమైన రాగం ఎక్కడ ఎక్కడ వినిపిస్తుందో, అక్కడ అంతా దర్శన మిచ్చేవారు, శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు ఎక్కెడెక్కడ సన్నిధానాన్ని కల్గి ఉన్నాడో ఆ దివ్యతిరుపతులలో అంతటా ప్రవేశించి నిలచి ఉండేవారైన భగవద్రామానుజులు అస్మత్కులనాథులు- అని అంటున్నారు.

**'అణియరఙ్గన్ తిరుముఱ్ఱత్తడియార్తఙ్గళ్ ఇన్బమికు పెరుమ్ కుழுవు కణ్డు యానుమ్ ఇశైన్దుడనే ఎన్ఱుకొలో ఇరుక్కునాళే !"** (పెరుమాళ్ తిరుమొழி) అనే రీతిలో మహాభక్తులయొక్క గోష్ఠిలో అన్వయించడం పరమపురుషార్థం కనుక, దానిని ఆశ్రయించి ఉండేవారు భగవద్రామానుజులు. **"కురుకూర్ నమ్బి పావిన్నిశై పాడి త్తిరివనే"** అనే పురుషార్థనిష్ఠుల గోష్ఠిలో అన్వయిస్తారు. దివ్యతిరుపతులలో వ్యాపించి, సేవించే భక్తుల సమూహంలో కలిసి సేవిస్తారు.

**"ఎమ్ కులక్కొழுన్దు"** -ఒక వృక్షంయొక్క అభివృద్ధికి దాని చిగురు కారణం అయేటట్లే, మన కులంయొక్క అభివృద్ధికి కారణం భగవద్రామానుజులు అని భావం. అందువల్ల, **"కొழுన్దు"** అనేది **"ఉవమై ఆకుపెయర్"** (ఉపమానవాచక రూపంలోని లక్షకపదం) **"పుక్కు నిఱ్కుమ్ కుణన్తికழ் కొణ్డల్"** అయిన భగవద్రామానుజులు **"ఎమ్ కులక్కొழுన్దు"** అని అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు.



**61. కొழுన్దువిట్టోడిప్పడరుమ్ వెఙ్గోళ్ వినైయాల్, నిరయ**
**త్తழுన్దియిట్టేనై వన్దాళ్ కొణ్డపిన్నుమ్, అరుమునివర్**
**తొழுన్దవత్తోన్ నెమ్మిరామానుశన్ పుకழ் శుడర్మి**
**క్కெழுన్దతు, అత్తాల్ నల్లతిశయమ్ కణ్డతిరునిలమే.**

అరు మునివర్ = అరుదైన నిష్ఠను కల మహానుభావులచే, తొழுమ్ = సేవింపడేవారు, తవత్తోన్ = ప్రపత్తి అనే తపస్సును కలవారైన, ఎమ్ ఇరామానుశన్= స్వామి భగవద్రామానుజుల, తొల్ పుకழ் = నిత్యమైన కల్యాణగుణాలు, కొழுన్దు ఓడి = ఇంకా ఇంకా అధికంగా వృద్ధి చెందుతున్న, వెమ్ కోళ్ వినైయాల్ = క్రూరమై, ప్రబలమైన దుష్కర్మలతో, నిరయత్తు = సంసారమనే నరకంలో, అழுన్దియిట్టేనై = మునిగి ఉండే నన్ను, వన్దు ఆళ్ కొణ్డ పిన్నుమ్ = వచ్చి కింకరునిగా చేసికొన్న తరువాతకూడా, శుడర్ మిక్కు ఎழுన్దతు = తేజస్సు తగ్గకుండా ముందుకంటే ఎక్కువగా ప్రకాశిస్తున్నది, అత్తాల్ = అందువల్ల, ఇరు నిలమ్ = విశాలమైన ఈ భూమండలం, నల్ అతిశయమ్ కణ్డతు = మిక్కిలి ఆశ్చర్యాన్ని పొందింది.

లోకంలో చాలా గొప్పవారు తమతో సమానులైనవారితో కలసి మెలగుతారే తప్ప, తమ కంటే చాలా నీచులై (తక్కువవారై) ఉండేవారిని కన్నెత్తికూడా చూడరు. ఏ రీతిలోను గుణం లేని క్రూరుడైన దుష్టుని తమ సమీపంలో చేర్చుకొన్నవారైతే వారు మహాత్ములైనా లోకులచేత నిందింపబడతారు. "ఉపయోగం లేని నీచులను అందఱిని దగ్గరలో చేర్చుకొని తాముకూడా నీచులు అవుతున్నారు''- అని లోకుల చేత నిందింపబడి, తమ గొప్పతనాన్ని కోల్పోయి నీచతను పొందుతారు. ఇది లోకంలో సాధారణంగా గమనించే విషయం ఇక, భగవద్రామానుజులను చూస్తే, వారు గొప్ప గొప్ప సత్పురుషులచే చుట్టూ ఆవరింపబడి మహనీయులై ఉన్నా, పాపాల కడుపును నింపిన పాపిని అయిన నన్ను తామే స్వయంగా కరుణించి, తమ అంతరంగ కైంకర్యానికి సేవకులుగా చేసికొన్నారు. దీనిని చూచిన ఎవరూ వారిని దూషించలేదు. పాడయిపోతున్న ఒక నిత్యసంసారిని సత్తుగా (మంచి వానినిగా) చేశారుకదా! అని అందరిచే పొగడబడి, వారి సౌశీల్యం, సౌలభ్యం మొదలైన గుణాలు ముందుకంటే విశేషంగా వెలిగినవే తప్ప, వారికి ఏ కొఱత లేదు. లోకంలో మిగిలినవారియొక్క గుణాలను మసకబారేటట్లు చేయగల కార్యమే భగవద్రామానుజుల విషయంలో గుణాల ప్రకాశానికి కారణమైనది- అనే ఈ విషయాన్ని గమనించిన అందఱు, ఇది ఒక అద్భుతమైన విషయం -అని ఆశ్చర్యపడ్డారు- అని తాత్పర్యం.

ఈ పాశురానికి వేఱొక విధంగాకూడా అర్థాన్ని గ్రహించవచ్చు. భగవద్రామానుజుల గుణాలు, మహాపాపి అయిన నన్ను సేవకునిగా చేసికొన్నంత మాత్రంతో నిలువకుండా "ఇటువంటి పాపులు ఇంకా ఎవరైనా ఉన్నారా! ఎవరైనా ఉన్నారా?'' అని ఇంకా ఆశతో అన్వేషిస్తున్నవి- అని భావం.

62. ఇరున్దే నిరువినై ప్పాశమ్ కழఱ్ఱి, ఇన్ఱియా నిఱైయుమ్
వరున్దే నిని యెమ్మిరామానుశన్, మన్ను మామలర్త్తాళ్
పొరున్దా నిలైయుడై ప్పున్మైయినోర్ క్కొన్ఱుమ్ నన్మై శెయ్యా
ప్పెరున్దేవరై ప్పరవుమ్, పెరియోర్తమ్ కழల్ పిడిత్తే.

ఎమ్ ఇరామానుశన్ = మా స్వామి భగవద్రామానుజులయొక్క, మన్ను = మన్నికగా ఉండే (గొప్పవైన), మా తాళ్ మలర్ = శ్రీచరణపద్మాలలో, పొరున్దా నిలై ఉడై = చేరని స్వభావాన్ని కలవారైన, పున్మైయినోర్క్కు = నీచులకు, ఒన్ఱుమ్ నన్మై శెయ్యా = ఏ విధమైన ఉపకారాన్ని చేయని, పెరు తేవరై = శ్రీరంగనాథుని, పరవుమ్ = కీర్తించే, పెరియోర్తమ్ = కూరేశులు అనే మహనీయుల, కழల్ = శ్రీచరణాలను, ఇన్ఱు = ఈనాడు, పిడిత్తు = ఆశ్రయించిన తరువాత, ఇరు వినై పాశమ్ = పుణ్యపాపరూపాలలోని రెండు విధాలైన కర్మపాశాలనుండి, కழిత్తు ఇరున్దేన్ = విడివడినవాడనయ్యాను, యాన్ =ఇటువంటి నిర్మలుడనై ఉండే దాసుడనైన నేను, ఇని = ఇకపై, ఇఱైయుమ్ = కొంచెం కూడా, వరున్దేన్ = దుఃఖ పడను.

ఈనాటినుండి ఇకపై గల కాలంలో అంతా ఏసమయంలోను నేను కొంచెంకూడా దుఃఖించను. ఎల్లప్పుడు పరమానందపూర్ణుడనై ఉంటాను. ఏమి కారణం? అని అడుగుతున్నారా! వినండి. నేను సకలకర్మలనుండి విముక్తుడ నయ్యాను. దానికి ఏమి కారణం? అంటే, కూరేశుల శ్రీచరణాలను ఈనాడు ఆశ్రయించగలిగాను కదా! ఆ కారణంవల్లనే. ఆ కూరేశులు ఎటువంటివారు? అని అంటే, శ్రీరంగనాథుని స్తుతించేవారు. ఆ శ్రీరంగనాథుడు ఎటువంటివాడు? అని అంటే, అడిగినవారు అడిగిన అన్నిటినీ ఇచ్చే పరమోదారుడే అయినా, భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించని పాపులకు ఏవిధమైన మంచిని చేయనివాడు.

శ్రీరామానుజుల భక్తులైన శ్రీవైష్ణవులకే సర్వస్వదానం చేయగల శ్రీరంగ నాథుని ఆశ్రయిస్తున్న కూరేశులను ఆశ్రయించి ఉజ్జీవించిన దాసునకు ఇక ఏదుఃఖం కలిగే అవకాశం లేదు- అని తమ కృతకృత్యత్వాన్నిగూర్చి అముదనార్ పలికారు.



**(ఇరువినై పాశమ్ కழిత్తు)** - పాపంవలె పుణ్యంకూడా పరగతికి ప్రతిబంధక మన్నది గమనార్హం. పాపం ఇనుపసంకెల అని, పుణ్యం బంగారు సంకెల అని శాస్త్రాలు పల్కుతున్నాయి. **"పెరున్దేవర్"** అనేపదం శ్రీరంగనాథుని తెలుపుతున్నదని కాక, మహనీయులను నిర్దేశిస్తున్నదనికూడా చెప్పవచ్చు. **"పెరియోర్"** అనే పదం కూరేశులను మాత్రమేకాక పలువురు మహాత్ములను తెలుపుతున్నదనికూడా చెప్పవచ్చు.

63. పిడియై త్తొడరుమ్ కళిఱెన్న, యానున్ పిఱఙ్గియ శీర్
అడియై త్తొడరుమ్బడి నల్కవేణ్డుమ్, అఱు శమయ
చ్చెడియై త్తొడరుమ్ మరుళ్ శెఱిన్దోర్ శిఱైన్దోడవన్ది
ప్పిడియై త్తొడరుమ్, ఇరామానుశ! మిక్క పణ్డితనే.

అఱు శమయమ్ = వేదబాహ్యాలైన ఆఱు మతాలు అనే, శెడియై = ముళ్ళచెట్లను (పొదలలో), తొడరుమ్ = అనువర్తించడానికి (చిక్కుకొని పడి ఉండడానికి) కారణమైన, మరుళ్ శెఱిన్దోర్ = అవివేకం నిండిన మూఢులు, శిఱైత్తు ఓడ = భంగాన్ని పొంది, భయపడి పరుగు తీసేటట్లుగా, వన్దు = ఈ భూమికి వచ్చి అవతరించి, ఇప్పడియై (మనవంటివారిని విషయీకరించడానికై) ఈ భూమిలోనివారిని, తొడరుమ్ = అనువర్తించే, మిక్క పణ్డితన్ = మహాపండితులైన, ఇరామానుశ = భగవద్రామానుజా!, పిడియై = ఆడ ఏనుగును, తొడరుమ్ = వెంబడించే, కళిఱు ఎన్న = మగ ఏనుగువలె, యాన్ = దాసుడనైన నేను, శీర్ పిఱఙ్గియ = సౌశీల్యాది గుణాలు ప్రకాశించే, ఉన్ అడియై = దేవరవారి శ్రీచరణాలను, తొడరుమ్బడి = అనువర్తించేటట్లు, నల్కవేణ్డుమ్ = కృపజేయాలి.

స్వామీ! మగఏనుగు తన పెంటి ఏనుగుపట్ల గొప్ప ప్రేమను పొంది, దానినే వెంబడించి తిరిగే రీతిలో, నేను మీ అందమైన శ్రీచరణాలనే అంతు లేని అభినివేశంతో అనువర్తించేటట్లు అనుగ్రహించాలి- అని ప్రార్థిస్తున్నారు.

భగవద్రామానుజుల రీతులనుగూర్చి శ్లోకం ఉత్తరార్ధంలో పల్కుతున్నారు. అందమైన ఉద్యానవనాలలో ఆనందంగా విహరించేవారివలె ఉత్తమమైన శ్రీవైష్ణవసిద్ధాంతాన్ని అవలంబించి, ఉజ్జీవించదగి ఉండగా, ఆ విధంగా ఉజ్జీవనాన్ని పొందకుండా, ముళ్ళ పొదలవంటి అపసిద్ధాంతాలలో చిక్కుకొని నశించిపోవడానికి కారణమైన అవివేకాన్ని కల్గిన మూఢులు వాదంలో పరాజయాన్ని పొంది పరుగు తీసేటట్లుగా ఈ భూలోకంలో అవతరించి, మనవంటివారిని కింకరులుగా

పరిగ్రహించడంకోసం అన్వేషిస్తూ తిరిగేవారు - మహాపండితులైవ - భగవద్రామానుజులు -అని భావం.

**64. పణ్డరు మాఱన్ పశున్దమిఴ్, ఆనన్దమ్ పాయ్ మతమాయ్**
**విణ్డిడ వెఙ్గళి రామానుశముని వేఴమ్, మెయ్మ్మై**
**కొణ్డ నల్వేతక్కొఴున్దణ్డ మేన్ది క్కువలయత్తే**
**మణ్డి వన్దేన్దతు, వాతియర్కాళ్! ఉఙ్గళ్ వాఴ్వఱ్ఱతే.**

ఎఙ్గళ్ =మాకు విధేయమైన, ఇరామానుశముని వేఴమ్ = భగవద్రామానుజులనే మత్తగజం, మాఱన్ = నమ్మాఴ్వార్లు, పణ్ = రాగాలలో (సంగీతాత్మకంగా), తరు = అనుగ్రహించిన, పశుమ్ తమిఴ్ = అందమైన ద్రావిడం అయిన తిరువాయ్మొఴివల్ల కల్గిన, ఆనన్దమ్ = సంతోషం, పాయ్ = ప్రవహించే, మతమ్ ఆయ్ = మదజలమై, విణ్డిడ = ప్రవహించగా, మెయ్మ్మై కొణ్డ = సత్యవాది అయిన, నల్ వేదమ్ = గొప్ప వేదం అనే, శెఴు తణ్డమ్ = గట్టి (గొప్ప) దండాన్ని, ఏన్ది = ధరించి, కువలయత్తే = ఈ భూమండలంలో, మణ్డి వన్దు = మిమ్ములను సమీపించి వచ్చి, ఏన్దతు = మీ పైన పడబోతున్నది, వాదియర్కాళ్ = ఓ దుర్వాదులారా !, ఉఙ్గళ్ = మీయొక్క, వాఴ్వు = ఉజ్జీవనం, అఱ్ఱతు = నశించిపోయింది.

కుత్సితవాదాలను చేసే ఓ దుర్వాదులారా! ఇక మీరు జీవించే దారి లేదు అని నిశ్చయించుకోండి. ఏమి? అని అడుగుతున్నారా? భగవద్రామానుజులనే ఒక మదగజం మిమ్ములను ప్రహరించడంకోసం పెద్ద దండాన్ని గ్రహించి, మీకు ఎదురుగా సమీపించి వస్తున్నది. దీనికి తప్పి బయటపడడం మీవల్లకాదు- అని అంటున్నారు.

గజానికి మదజలం స్రవిస్తుంది కదా! ఈ శ్రీరామానుజగజరాజుకు ఏది మద జలం? అని అంటే, సమాధానాన్ని మొదటి పాదంలో పల్కుతున్నారు. తిరువాయ్మొఴి అనుభవంవల్ల కల్గిన ఆనందరసమే ఈ గజరాజుకు మదజల ప్రవాహం. ఇందువల్ల భగవద్రామానుజులు ఎల్లప్పుడు తిరువాయ్మొఴిని అనుభవించి ఆనందించేవారు - అని తెలుస్తున్నది.

ఈ గజరాజు ఏదండాన్ని గ్రహించి వస్తున్నది ? అని అంటే, సమాధానాన్ని మూడవ పాదంలో పల్కుతున్నారు. యథార్థవాది అయిన వేదాన్ని గ్రహించి దుర్వాదులను ప్రహరిస్తారు కనుక, వేదమే ఇక్కడ దండంగా చెప్పబడింది.



**(ఉఙ్గళ్ వాఴ్వు అఱ్ఱతే)** -అంటే- ఇక మీరు నల్గురిని చేర్చుకొని మత ప్రవచనాన్ని చేయడం సాధ్యం కాదని భావం.

**65. వాఴ్వఱ్ఱతు తొల్లైవాతియర్క్కు, ఎన్ఱుమ్ మఱైయవర్తమ్**
**తాఴ్వఱ్ఱతు తవమ్ తారణి పెఱ్ఱతు, తత్తువనూల్**
**కూఴఱ్ఱతు కుఱ్ఱ మెల్లామ్ పతిత్త కుణత్తినర్క్కు**
**న్నాఴఱ్ఱతు, నమ్మిరామానుశన్ తన్ద ఞానత్తిలే.**

నమ్ ఇరామానుశన్ = స్వామి భగవద్రామానుజులు, తన్ద ఞానత్తిల్ = అనుగ్రహించిన జ్ఞానంవల్ల, తొల్లై = వాదియర్క్కు = చిరకాలంగా ఉన్న దుర్వాదులకు, వాఴ్వు అఱ్ఱతు = ఉజ్జీవనం నశించిపోయింది, మఱైయవర్తమ్ తాఴ్వు = వైదికుల కొఱత, ఎన్ఱుమ్ అఱ్ఱతు = ఇకపై ఏనాడూలేని రీతిలో అయినది, తారణి = భూమండలం, తవమ్ పెఱ్ఱతు = భాగ్యాన్ని పొందింది, తత్తువమ్ నూల్ = తత్త్వపరమైన శాస్త్రాలు, కూఴ్ అఱ్ఱతు = సందేహం లేకుండా నిశ్చితమైన అర్థాలను తెల్పుతున్నవి అయినవి, కుఱ్ఱమ్ ఎల్లామ్ = పలు రీతులలోని దోషాలు, పతిత్త = నిండిన, కుణత్తినర్క్కు = స్వభావాన్ని కల్గిన జనులకు, అ నాఴ్ అఱ్ఱతు = ఆ దోషాలు తీరినవి.

భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించి, ఉపదేశాదులద్వారా కల్గించిన తత్త్వజ్ఞానంవల్ల ఫలించిన అంశాలు ఏవి? అని అంటే, దుర్వాదుల ఉజ్జీవనం నశించింది. వైదికులకు కల్గిన సంకటాలు తీరిపోయినవి. భూమండలం మహా భాగ్యాన్ని పొందింది. తత్త్వశాస్త్రాలలో ఏవిధమైన సందేహం కలుగని రీతిలో నిశ్చయ రూపజ్ఞానమే కల్గినది. పాపుల పాపాలన్నీ తీరిపోయాయి- అనే ఇవి భగవద్రామానుజుల అనుగ్రహించిన తత్త్వజ్ఞానంయొక్క ఫలంగా ఏర్పడినవి- అని భావం.

**(తొల్లై వాదియర్)** - వైదికులు అనాదిగా ఉన్నారు. దుర్వాదులుకూడా అనాదిగా ఉన్నారా ? అని అంటే, పైరు ఉన్నప్పటినుండి కలుపుకూడా ఉండేటట్లే, బాహ్యకుదృష్టులనేవాదులుకూడా అనాదిగానే ఉన్నారు.

"ధరణి"- అనే సంస్కృతపదం "తారణి" అని "నీట్టల్" వికారాన్ని పొందింది. "కూఴ్"-స్నేహం, నాఴ్ - దోషం.

**66. ఞానమ్ కనిన్ద నలఙ్గొణ్డు, నాడొఱుమ్ నైపవర్క్కు**
**వానమ్ కొడుప్పతు మాతవన్, వల్వినైయేన్ మనత్తిల్**

ఈనమ్ కడిన్ద ఇరామానుశన్ తన్నై ఎయ్‌తినర్‌క్క
త్తానమ్ కొడుప్పతు, తన్‌తకవెన్నుమ్ శరణ్ కొడుత్తే.

మాతవన్ = శ్రియఃపతి, వానమ్ = మోక్షాన్ని, కొడుప్పతు = ఇవ్వడం (ఎటువంటివారికి ? అని అంటే), ఞానమ్ కనిన్ద నలమ్ కొణ్డు = భక్తిరూపంగా పండి ఆ భక్తితో, నాళ్ తొఱుమ్ = నిత్యం, నైబవర్‌క్కు = మనస్సులో ద్రవించే వారికే), వల్ వినైయేన్ = మహాపాపి అయిన నా, మనత్తిల్ = హృదయంలో ఉండే, ఈనమ్ = కల్మషాలను, కడిన్ద = పోగొట్టిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, తన్నై ఎయ్‌తినర్‌క్కు = తమను ఆశ్రయించినవారికి, అత్తానమ్ = ఆ మోక్షస్థానాన్ని, కొడుప్పతు = అనుగ్రహించడం (ఏవిధంగా అంటే), తన్ తకవు ఎన్నుమ్ = తన కృప అనే, శరణ్ కొడుత్తు = సాధనాన్ని (వారికి) అనుగ్రహించి, తమ దివ్యకృపతో -అని భావం.

తమ దాసులకు మోక్షాన్ని ఇచ్చే అధికారం భగవానునకుకూడా ఉన్నది; భగవద్రామానుజులకూ ఉన్నది. భగవానుడు అనుగ్రహించడం చాలా శ్రమపెట్టిన తరువాతనే, భగవద్రామానుజులు అనుగ్రహించడం కేవలం తమయొక్క అనుగ్రహంతోనే- అని ఇందులో అంటున్నారు ఈ పాశురంలో.

జ్ఞానం బాగా పండి, అది భక్తి- పరభక్తి- పరమభక్తి అనే రీతిలోని అవస్థలను పొంది, దానివల్ల ఈ సంసారంలో క్షణకాలం నిలచి ఉండడంకూడా సహించలేనిదిగా తలచి, ఆళ్వార్లవలె **"ఒరు పకల్ ఆయిరమూఴియాలో!"** అని తల్లడిల్లేవారికే భగవానుడు ముక్తిని అనుగ్రహిస్తాడు. ఇక భగవద్రామానుజులయితే కృపామాత్ర ప్రసన్నాచార్యులైనందువల్ల దాసులనుండి ఏవిధమైన శ్రమను ఎదురు చూడకుండా తమ నిర్హేతుకకృపతోనే వారిని గట్టెక్కిస్తారు- అని భావం.

ఈ పాశురాన్ని చమత్కారంగా వివరించవచ్చు. మోక్షమనే ఒక వస్తువు భగవానుడనే అంగడిలోను, భగవద్రామానుజులనే అంగడిలోను దొరుకుతుంది. లోకంలోని అంగళ్ళకు మూడు విధాలైన అసౌకర్యాలు ఉండవచ్చు. అవి ఏవి? అని అంటే, సరుకుల వెల అపారంగా ఉండడం ఒకటి, ఆ వెలను కొంచెం తగ్గించమని మనం అడిగితే దానికి అవకాశంలేనట్లు వెలను వారు "తగ్గించడం కుదరదు"- అని అనడం ఇంకొకటి. అధికమూల్యం ఖరారువెల కావడం అటు ఉండనివ్వండి. "తాత్కాలికంగా అప్పుగా ఇస్తే నాల్గు దినాలు గడచిన తరువాత వెలను చెల్లించి వేస్తాము" అని అంటే దానికికూడా ఒప్పుకోకుండా, "నగదు ఈ



నాడు, అప్పు రేపు" అని అనడం మఱి ఒకటి. ఈ విధంగా మూడు విధాలైన అసౌకర్యాలుండే అంగడికి యజమాని భగవానుడు. ఎందుకు? అని అంటే, అతడు మోక్షమనే సరకుకు వెలను అపారంగా విధించాడు. **"ఞానమ్ కనిన్ద నలమ్ కొణ్డు"** (జ్ఞానం భక్తిగా పండగా, ఆ భక్తితో) నిత్యం శ్రమించాలి. -అని విధించినందువల్ల ఈ స్థితి అందటికి కల్గడం సాధ్యం కానందువల్ల, వెల అధికం. ఇందులో కొంచెం వెల తగ్గించడానికి భగవానుడు అంగీకరించడు. "నిత్యం ఉపాసించేవారికే పరమ పదాన్ని ఇస్తాను"- అని అంటాడు. **"నాడొరుమ్ నైబవర్‌క్కే వానమ్ కొడుప్పతు మాతవన్"** అన్నట్లు. ఇటువంటి స్థితి **"ఇరుళ్ తరు మాఞాలమ్"** అయిన ఈ భూలోకంలో ఉండడం చాలా అరుదు. "ముందుగా మమ్మలను మోక్షానికి పంపించు. అక్కడికి పోయి ఈ వెలను చెల్లిస్తాము" అని అప్పు అడిగితే, "ఈ అంగడిలో అప్పు లేదు. ఇక్కడే ఉండి భక్తిరూపాపన్నజ్ఞానంతో నిత్యం ఆరాధించే వారినే మోక్షానికి పంపిస్తాను" అని అంటాడు. అందువల్ల మూడు విధాలైన అసౌకర్యాలు నిండిన అంగడి భగవానుడు. భగవద్రామానుజులు అనే అంగడి ఈ విధమైన అసౌకర్యాలు ఏమీ లేవు. మోక్షమనే సరుకుకు వారు ఏవిధమైన విధించడం లేదు. కనుక, అధికమైన వెల, ఖరారు వెల, అప్పు అడగడం - అనే కష్టాలకు ప్రసక్తియే లేదు. అందువల్ల, ఓ మోక్షార్థులారా! మీరు భగవానుని ఆశ్రయించి కష్టపడకుండా, భగవద్రామానుజులను ఆశ్రయించి సుఖపడండి- అని అంటూ ఈ పాశురంలో అముదనార్ లోకులకు ఉపదేశించారు.

**(వల్‌వినైయేన్ మనత్తిల్ ఈనమ్ కడిన్ద)** - అనే పదాన్ని మాధవుని శ్రీచరణాలను సేవించి కష్టపడడం అనే హైన్యాన్ని నాకు పోగొట్టిన భగవద్రామానుజులు- అనికూడా వివరించవచ్చు.

**67.** శరణ మడైన్ద తరుమానుక్కా, పణ్డు నూఱ్ఱువరై
మరణ మడైవిత్త మాయవన్, తన్నై వణఙ్గ వైత్త
కరణమివై యుమక్కన్ఱిరామానుశనుయిర్‌కట్కు
అరణఙ్గమైతిలనేల్, అరణార్ మఱ్ఱివ్వారుయిర్‌క్కే.

శరణమ్ అడైన్ద = తనను శరణు పొందిన, తరుమనుక్కు ఆ = ధర్మపుత్రుని కోసం, పణ్డు = పూర్వకాలంలో, నూఱ్ఱువరై = దుర్యోధనుడు మొదలైన నూఱు మందిని, మరణమ్ అడైవిత్త = చచ్చేటట్లు చేసిన, మాయవన్ = ఆశ్చర్యచేష్టితుడు, తన్నై = తనను, వణఙ్గ వైత్త = సేవించడం కోసమై ఏర్పరచబడిన, కరణమ్

ఇవై = ఇంద్రియాలు ఇవి, ఉమక్కు అన్ఱు = మీకు సంబంధించినవి కావు (మీకోసం కావు), ఎన్ఱు = అని (ఈ విధంగా ఉపదేశించి), ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఉయిర్‌కట్కు = ఆత్మలకు, అరణ్ అమైత్తిలన్ ఏల్ = రక్షను కల్పించకపోతే, ఇ ఆర్ ఉయిర్‌క్కు = ఈ అరుదైన ఆత్మలకు, మఱ్ఱు అరణ్ ఆర్ = వేఱు రక్షకులు ఎవరు? (ఎవరూ లేరు).

తనను శరణు పొందిన ధర్మపుత్రునికోసం పడరాని పాట్లను పడి, దుర్యోధనాదులు నూఱుమందిని భారతయుద్ధంలో సంహరించిన భగవానుడు చెవులు, కన్నులు, ముక్కు మొదలైన ఇంద్రియాలను, వాటికి ఆశ్రయమైన శరీరాన్ని మీకు ఇవ్వడం ఎందుకు? అంటే, తనను శరణు పొంది ఉజ్జీవించడం కోసమే తప్ప, మీ మనస్సుకు తోచిన రీతిలో విషయాంతరాలను అనుభవించడంకోసం కాదు- అనే ఈ అర్థాన్ని భగవద్రామానుజులు అవతరించి మనకు అందఱికి ఉపదేశించగానే, మనం అందఱం ఉజ్జీవించగలిగాము. వారు ఈ విధంగా ఉపదేశించి ఉండకపోతే మనకు ఏమి గతి? ఎవరు మనలను సంస్కరించగలరు? - అని భావం.

**"తరుమనుక్కా"** అని అంటూ ధర్మపుత్రునిమాత్రం నిర్దేశించడం పంచపాండవులకు, పాంచాలికి కూడా ఉపలక్షణం. **"తన్నై వణఙ్గవైత్త కరణ మివై"** అనే చోట **"జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుమ్"** అనే ముకుందమాలా శ్లోకాన్ని అన్వయించాలి. పెరియతిరుమొళిలోని **"నీణాకమ్ శుఱ్ఱి"** అనే దశకాన్ని అన్వయించుకోవాలి. **"కరణమ్"**- సంస్కృతపదం. ఇంద్రియమని అర్థం.

**68.** ఆరెనక్కిన్ఱు నికర్ శొల్లిల్, మాయనన్ఱైవర్ దెయ్వ
త్తేరినిల్ శెప్పియ కీతైయిన్, శెమ్మైప్పొరుళ్ తెరియ
ప్పారినిల్ శొన్న ఇరామానుశనై ప్పణియుమ్ నల్లోర్
శీరినిల్ శెన్ఱు పణిన్దతు, ఎన్నావియుమ్ శిన్దైయుమే.

మాయన్ = ఆశ్చర్యచేష్టితాలను చేసే భగవానుడు, అన్ఱు = పూర్వకాలంలో, ఐవర్ = పంచపాండవులు అయిదుగురియొక్క, దెయ్వ త్తేరినిల్ = దైవత్వాన్ని కల్గిన రథంపై ఉండి, శెప్పియ = అనుగ్రహించిన, కీతైయిన్ = భగవద్గీతయొక్క, శెమ్మై పొరుళ్ = స్వరసమైన అర్థాన్ని, తెరియ = అందఱు సులభంగా తెలిసికొనేటట్లు, పారినిల్ = ఈ భూమిలో, శొన్న = గీతాభాష్యంద్వారా అనుగ్రహించిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, పణియుమ్ = ఆశ్రయించే, నల్లోర్ = విలక్షణపురుషుల యొక్క (సత్పురుషులయొక్క), శీరినిల్ = కల్యాణగుణాలలో,



ఎన్ ఆవియుమ్ = నా ఆత్మ, శిన్దైయుమ్ = మనస్సుకూడా, శెన్ఱు పణిన్దతు = పోయిచేరినవి, శొల్లిల్ = చెప్పినట్లయితే, ఇన్ఱు = ఈ కాలంలో, ఎనక్కు ఆర్ నికర్ = నాకెవరు సాటి?

భగవానుడు పూర్వం ఒకసారి పార్థసారథియై అర్జునునకు ఉపదేశించిన గీతయొక్క అర్థాన్ని స్పష్టంగా అందఱు తెలిసికొనేటట్లుగా శ్రీగీతాభాష్యాన్ని అనుగ్రహించిన భగవద్రామానుజులను ఎవరు ఆశ్రయించారో, ఆ మహానుభావుల కల్యాణగుణాలనే నా సకలేంద్రియాలు అవగాహించాయి. భగవానుని సేవించడానికి అంగీకరించని ఈ లోకంలో తద్దాసదాసులను సేవించే పరిపాకాన్ని (పరిణతిని) పొందిన నాకు ఎవరూ సాటి లేరు-అని భావం.

**(మాయన్)** - సర్వేశ్వరుడైన తాను అర్జునునకు రథసారథియై సులభుడై నిలిచిన ఆశ్చర్యభూతుడు.

**(తెయ్వత్తేర్)** - అర్జునుని రథం గరుడుని అంశ కావడం గమనించాలి. **(శెమ్మైప్పొరుళ్)** - ఋజువైన అర్థం.

**69.** శిన్దైయినోడుమ్ కరణఙ్గళ్ యావుమ్ శితైన్దు, మున్నాళ్
అన్దముఱ్ఱాళ్న్దతు కణ్డు, అవై యెన్ఱనక్కు అన్ఱరుళాల్
తన్ద వరఙ్గనుమ్ తన్ శరణ్ తన్దిలన్ తానతు తన్దు,
ఎన్దై యిరామానుశన్ వన్దెడుత్తననిన్ఱెన్నైయే.

మున్ నాళ్ = సృష్టికి పూర్వకాలంలో, శిన్దైయినోడు కరణఙ్గళ్ యావుమ్ = మనస్సు, ఇంద్రియాలు అన్నీ, శితైన్దు = నశించి, అన్దమ్ ఉఱ్ఱు ఆళ్న్దతు = ఉపసంహారాన్ని పొంది అచేతన ప్రాయమై పడి ఉండడాన్ని, కణ్డు = గమనించి, ఎన్‌తనక్కు = ఆరీతిలో అచేతనప్రాయమై ఉన్నవారిలో ఒకడనైన నాకు, అవై = ఆ కరణకళేబరాలను, అన్ఱు = ఆకాలంలో, అరుళాల్ =నిర్హేతుకకృపతో, తన్ద= అనుగ్రహించిన, అరఙ్గనుమ్ = భగవానుడు (శ్రీరంగనాథుడు), తన్ శరణ్ = తన శ్రీచరణాలను, తన్దిలన్ = దర్శింపజేసి ఉజ్జీవింపజేయలేదు, (ఆ కొఱత తీరేటట్లుగా), ఎన్దై ఇరామానుశన్ = స్వామి భగవద్రామానుజులు, తాన్ వన్దు = తాముగానే వచ్చి, అతు తన్దు = ఆ శ్రీచరణాలకు అనుగ్రహించి, ఇన్ఱు ఎన్నై =ఇపుడు నన్ను, ఎడుత్తనన్ = సంసారంనుండి ఉద్ధరించారు.

"ప్రళయకాలంలో సకలాత్మలు ఱెక్కలు తెగిన పక్షివలె కరణకళేబరాలను పోగొట్టుకొని దుఃఖించే స్థితిలో భగవానుడు పరమకారుణికుడై, కరణకళేబరాలను

అనుగ్రహిస్తాడు''- అనే శాస్త్రవైఖరిలో దాసుడనైన నేనుకూడా కరణకళేబర విధురుడనై బాధపడే కాలంలో మనస్సులో కరుణ చూపి, వాటిని అనుగ్రహించి, సహాయపడిన భగవానుడు ఈలోకంలో నన్ను ఒక మానవునిగా సృష్టించాడే తప్ప, తన శ్రీచరణాలను నాకు దర్శింపజేసి ఉజ్జీవింపచేయలేదు. ఆ కొఱత తీరేటట్లుగా భగవద్రామానుజులు నన్ను ఉద్ధరించారు- అని అంటున్నారు.

"అన్తమ్"- సంస్కృతపదం. నాశమని అర్థం.

**70. ఎన్నైయుమ్ పార్త్తు ఎన్నియల్వైయుమ్ పార్త్తు, ఎణ్ణిల్ పల్‌కుణత్త**
**ఉన్నైయుమ్ పార్క్కిలరుళ్ శెయ్వతే నలమ్, అన్ఱి యెన్పాల్**
**పిన్నైయుమ్ పార్క్కిల్ నలముళతే యున్ పెరుఙ్గరుణై**
**తన్నై యెన్ పార్ప్పర్, ఇరామానుశా! వున్నై చ్చార్న్దవరే.**

ఇరామానుశా = భగవద్రామానుజా!, ఎన్నైయుమ్ పార్త్తు = (ఏ గుణం లేకుండా దోషాలే నిండి ఉండే) నన్ను చూచి, ఎన్ ఇయల్ వైయుమ్ = (ఇకపై కూడా ఏ విధమైన మంచిని సంపాదించుకోలేకుండా ఉండే) నా స్వభావాన్ని, పార్త్తు = చూచి, ఎణ్ ఇల్ పల్ = లెక్కకు మించిన పలు, కుణత్త ఉన్నైయుమ్= కల్యాణగుణాలను కల మిమ్ములను, పార్క్కిల్ = చూచినట్లయితే, అరుళ్ శెయ్వతే= (ఇప్పటివలె ఎప్పుడు) అనుగ్రహించడమే, నలమ్ = మంచిది, అన్ఱి = ఇది తప్ప, పిన్నైయుమ్ పార్క్కిల్ = ఇంకా పరిశీలిస్తే, ఎన్ పాల్ = నావద్ద, నలమ్ ఉళతే =ఏదయినా మంచి ఉన్నదా ? (కొంచెం కూడా లేదు) (ఏమంచి లేకపోతే నిన్ను నేను కటాక్షించడం సాధ్యం కాదు) అని మనస్సులో భావిస్తే, ఉన్నై శార్న్దవర్ = మిమ్ములను ఆశ్రయించినవారు, ఉన్ = తమయొక్క, పెరు కరుణై తన్నై = గొప్ప కరుణనుగూర్చి, ఎన్ పార్ప్పర్ = ఏమని అనుకుంటారు? (తక్కువగా భావిస్తారు కదా!)

స్వామీ! దాసుని స్థితి ఎటువంటిది ? అని అంటే, సంసారసంబంధాన్ని కల్గిన విషయాంతరాలనే కోరి పరిభ్రమించేవాడను నేను. తమ స్థితి ఎటువంటిది? అని అంటే, దాసుల దోషాలను గుణాలుగా భావించి అంగీకరించేవారు మీరు. ఈ విధంగా ఉండే ఇద్దరి స్థితులను గమనించినపుడు, తమ నిర్హేతుకకృపకు దాసుని పాత్రునిగా చేయడమే తగినది. ఇపుడు నాపై నిర్హేతుకకృపను చూపించి, అంగీకరించేటట్లే, ఇకపైకూడా ఏనాడూ చేయి విడువకుండా కాపాడాలి. "నిన్ను నేను స్వీకరించడానికి నీదగ్గర ఏమి మంచి ఉన్నది ?''అని తమరు విమర్శించ



కూడదు. నావద్ద ఏ మంచి లేదు. ఆ విధంగా మంచిని పురస్కరించుకొనే రక్షించాలనే నిర్బంధాన్ని మీరు పెట్టుకొంటే, తమ కల్యాణగుణాలకు ఉపయోగమే లేకుండా పోతుంది. "ఇంతమాత్రమేనా భగవద్రామానుజుల కల్యాణగుణాలు !' అని తమ భక్తులు వానిని కొఱతకల్గినవిగా భావించవచ్చు. అందువల్ల నాపట్ల ఏవిధమైన మంచిని ఎదురు చూడకుండా తమ నిర్హేతుకకృపనే ఆలంబనంగా గ్రహించి ఇతః పూర్వం వలె ఈనాడుకూడా నన్ను కాపాడాలి సుమా! - అని అంటున్నారు.

**71. శార్న్దతెన్ శిన్దై ఉన్‌తాళిణైక్కీழ్, అన్బుతాన్ మికవుమ్**
**కూర్న్దతు అత్తామరైత్తాళ్‌కళుక్కు, ఉన్దన్ కుణఙ్గళుక్కే**
**తీర్న్దతెన్ శెయ్కై మున్ శెయ్వినై నీ శెయ్వినై యతనాల్**
**పేర్న్దతు, వణ్మై ఇరామానుశా! ఎమ్ పెరున్దకైయే.**

వణ్మై = ఔదార్యాన్ని కలవారై,ఎమ్ = మాకు స్వామియై, పెరు తకై = గొప్పతనాన్ని కల్గినవారైన, ఇరామానుశా = భగవద్రామానుజా!, ఎన్ శిన్దై = నా మనస్సు, ఉన్ తాళ్ ఇణై కీழ் = దేవరవారి శ్రీచరణద్వయి కింద, శార్న్దతు = అమరి ఉన్నది. అన్బుతాన్ = భక్తికూడా, అ త్తామరై తాళ్‌కళుక్కు = ఆ శ్రీచరణపద్మాల విషయంలోనే, మికవుమ్ = మిక్కిలి, కూర్న్దతు = పొందింది, ఎన్ శెయ్కై = నా కార్యాలుకూడా, ఉన్‌తన్ కుణఙ్గళుక్కే = తమ కల్యాణగుణాలకే, తీర్న్దతు = విధేయమైనవి, మున్ శెయ్ వినై = పూర్వమే (నేను) చేసిన పాపాలు అన్నీ, నీ శెయ్ = తమరు చేసిన, వినై అతనాల్ = (కటాక్షమనే) కార్యంవల్ల, పేర్న్దతు = నశించిపోయాయి.

గడచిన పాశురంలోని అముదనార్ ప్రార్థనకు అంగీకరించినట్లుగా భగవద్రామానుజులు సాక్షాత్కరించగా, సంతోషాతిశయంతో తాము పొందిన ప్రయోజనాలనుగూర్చి ఇందులో అముదనార్ పల్కుతున్నారు. "స్వామీ! నా జ్ఞాన భక్తులు తమ శ్రీచరణాలలో నిలకడగా నిలచి ఉన్నాయి. నా కరణాలు దేవరవారి కల్యాణ గుణాలలో అభినివేశాన్ని పొంది, కైంకర్యంచేయడానికి ఆరంభించాయి. తమ కటాక్షమాత్రంతో నా పూర్వసంచిత పాపాలన్నీ ఎగిరిపోయాయి. ఇవి అన్నీ తమ కరుణవల్ల కల్గిన ఫలాలు''- అని అంటున్నారు.

**72. కైత్తనన్ తీయ శమయక్కలకరై, క్కాశినిక్కే**
**ఉయ్‌త్తనన్ తూయ మఱైనెఱితన్నై, ఎన్ఱున్ని యుళ్ళమ్**
**నెయ్‌త్త వన్పోడిరున్దేత్తుమ్ నిఱైపుకழోరుడనే**
**వైత్తన నెన్నై, ఇరామానుశన్ మిక్క వణ్మై శెయ్‌తే.**

ఇరామానుశన్ = భగవద్రామానుజులు, మిక్క వణ్మై = తమ ఔదార్య గుణాన్ని అధికంగా, శెయ్‌తు = చూపి (చేసి), తీయ శమయమ్ కలకరై = దుష్టమతాలలో ఉంటూ, కలహం చేసేవారిని, కైత్తనన్ = నిరసించారు, తూయ = పరిశుద్ధమైన, మఱై నెఱితన్నై = వేదమార్గాన్ని, కాశినిక్కు ఉయ్‌త్తనన్ = భూమిలో సుప్రతిష్ఠితం చేశారు, ఎన్ఱు ఉన్ని = అని అనుసంధించి, ఉళ్ళమ్ నెయ్‌త్తు = మనస్సు (పండి) పరిణామాన్ని చెంది, అవ్వన్బోడు ఇరున్దు = ఆ ప్రీతితో కూడి ఉండి, ఏత్తుమ్ = (వారిని) స్తోత్రాన్ని చేసే, నిఱై పుకழோరుడనే = నిండైన కీర్తిని కల మహాత్ములతో, ఎన్నై వైత్తనన్ = (నన్నుకూడా ఒకనిగా లెక్కించేటట్లు) నన్ను నిలిపారు.

గడచిన పాశురంలో తాము పొందిన కొన్ని ప్రయోజనాలనుగూర్చి అముద నార్ పలికారు. వాటిలో ముఖ్యమైన ఒక ప్రయోజనాన్నిగూర్చి ప్రత్యేకంగా ఇందులో పల్కుతున్నారు.

"స్వామి, దుష్టమతస్థులను అందఱిని నిరసించి,వేదమార్గాన్ని ప్రతిష్ఠాపనం చేశారు'' అనే ఈ వైభవంలో అభినివేశాన్ని పొంది మనస్సు పండిన మహాత్ములతో నన్నుకూడా ఒకనిగా లెక్కించేటట్లుగా ఒక వస్తువుగా నన్ను భగవద్రామానుజులు చేశారు. ఈవిధమైన ఔదార్యంకూడా ఉంటుందా?- అని మనస్సులో ద్రవిస్తున్నారు.

**"నిఱైపుకழோరుడనే వైత్తనన్"** -అసత్కల్పులతో కలసి వర్తించే నన్ను సత్తను కల వారితో కలిపారు -అనికూడా భావం.

**73.** వణ్మైయినాలుమ్ తన్ మాతకవాలుమ్, మతిపురైయుమ్
తణ్మైయినాలు మిత్తారణియోర్‌కట్కు, త్తాన్ శరణాయ్
ఉణ్మై నన్ ఞాన మురైత్త ఇరామానుశనై యున్నుమ్
తిణ్మైయల్లాల్ ఎనక్కిల్లై, మఱ్ఱోర్ నిలై తేర్న్దిడిలే.

తన్ వణ్మైయినాలుమ్ = తమ ఔదార్యగుణంతో, మా తకవాలుమ్ = పరమకృపతోను, మతి పురైయుమ్ తణ్మైయినాలుమ్ = చంద్రునితో సాటి వచ్చే మనస్సులోని చల్లదనంతోను, ఇ తారణియోర్‌కట్కు = ఈ భూమిలో ఉండేవారికి, తాన్ శరణ్ ఆయ్ = తాము శరణమై (రక్షకులై), ఉణ్మై = యథార్థమైన, నల్ ఞానమ్ = విలక్షణమైన జ్ఞానాన్ని, ఉణర్‌త్త = ఉపదేశించిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, ఉన్నుమ్ = చింతించే, తిణ్మై అల్లాల్ = అధ్యవసాయం



ఒక్కటి తప్ప, తేర్న్దిడిల్ = పరిశీలించి చూస్తే, ఎనక్కు = దాసుడనైన నాకు, ఓర్ నిలై = వేఱొక (స్థితి) అధ్యవసాయం, ఇల్లై = లేదు.

తమ అధ్యవసాయం (నిశ్చయం) యొక్క దార్ఢ్యాన్నిగూర్చి ఇందులో అముదనార్ పల్కుతున్నారు. భగవద్రామానుజులను నిరంతరం ధ్యానించడమే మంచిది - అని భావించే అధ్యవసాయం తప్ప వేఱు ఇంకొక ఏ అధ్యవసాయం నాకు లేదు - అని అంటున్నారు. మిగిలినవారిని విడచి భగవద్రామానుజులనుగూర్చి చింతించడానికి ఏమి కారణం? అని అంటే, అర్థంయొక్క గొప్పతనాన్ని లెక్కించ కుండా ఉపదేశించే తగిన ఔదార్యగుణంవల్ల, ఇతరుల దుర్గతిని చూచి భరించలేని పరమకృపవల్ల, చల్లని మనస్సును కలవారైనందువల్ల, ఎవరి అపేక్ష లేకుండానే తామే స్వయంగా రక్షకులై యథార్థమైన విలక్షణజ్ఞానాన్ని ఉపదేశించేవారు ఆ భగవద్రామానుజులొకరే కదా ! అందువల్ల వారినిమాత్రమే ధ్యానించడమనే స్థిరమైన నిశ్చయం నాకు కల్గింది.

**74.** తేరార్ మఱైయిన్ తిఱ మెన్ఱు, మాయవన్ తీయవరై
క్కూరాழி కొణ్డు కుఱైప్పతు, కొణ్డలనైయ వణ్మై
ఏరార్‌కుణత్తెమ్మిరామానుశన్ అవ్వెழிల్ మఱైయిల్
శేరాతవరై చ్చిఱైప్పతు, అప్పోతొరు శిన్దై శెయ్‌తే.

మఱైయిన్ =(ఈపాపులు) వేదాలు పలికే, తిఱమ్ = మార్గాన్ని, తేరార్ ఎన్ఱు = నిరూపించి తెలిసికోలేరు అని, తీయవరై = పాపులను, మాయవన్ = భగవానుడు, కుఱైప్పతు = దండించడం, కూర్ ఆழி కొణ్డు = పదునైన తన శ్రీసుదర్శనంతో, కొణ్డల్ అనైయ = మేఘంవలె, వణ్మై =ఔదార్యాన్ని కలవారై, ఏర్ ఆర్ కుణత్తు = (ఇంకా పలు) కల్యాణగుణాలను కలవారు అయిన, ఎమ్ ఇరామానుశన్ = మా స్వామి భగవద్రామానుజులు, అ ఎழிల్ మఱైయిల్ = ఆ గొప్ప (వెలిగే) వేదాలలో, శేరాతవరై = అన్వయం లేనివారిని, శిఱైప్పతు = భంగాన్ని పొందించడం (ఏవిధంగా? అంటే), అప్పోతు = అపుడాసమయంలో, ఒరు శిన్దై శెయ్‌తు = ఒక్కొక్క యుక్తిని, పురస్కరించుకొని ప్రయోగించి.

భగవానుడు తన ఆజ్ఞారూపమైన వేదాలలోని నియమానుసారం ప్రవర్తించని వారిని తన శ్రీసుదర్శనచక్రాన్ని ప్రయోగించి ధ్వంసం చేస్తాడు. కాని, భగవద్రామా నుజులు అయితే, అంతటి ప్రయాసను పొందడం లేదు. వేదాలను ప్రమాణంగా

సుతరాం ఒప్పుకోని బాహ్యమతస్థులను, వేదాలను ప్రమాణాలుగా అంగీకరించి, వాటికి అపారాథలను పలికే కుదృష్టులను వాదయుద్ధంలో అప్పటికప్పుడు మనస్సులో స్ఫురించే చక్కని యుక్తులతో అనాయాసంగా ఖండిస్తారు.

ఇందువల్ల, దుష్టులను నిరసించే రీతిలో భగవద్రామానుజుల చాతుర్యం సాటి లేనిదని భావం.

**75. శెయ్త్తలై చ్చజ్గమ్ శెళ్ళుముత్త మీనుమ్, తిరువరజ్గర్**
**కైత్తలత్తాళ్ళియుమ్ శజ్గము మేన్ది, నజ్గణ్ముకప్పే**
**మొయ్త్తలైత్తున్నై విడే నెన్టిరుక్కిలుమ్ నిన్ పుకళ్ళే**
**మొయ్త్తలైక్కుమ్ వన్దు, ఇరామానుశా! ఎన్నై ముఱ్ఱునిన్టే.**

శెయ్త్తలై = పొలాలలో, శజ్గమ్ =శంఖాలు, శెళ్ళు ముత్తమ్ = అందమైన ముత్యాలను, ఈనుమ్ = ప్రసవించే చోటు అయిన, తిరు అరజ్గర్ = శ్రీరంగదివ్య క్షేత్రంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుడు, కై తలత్తు = తమ శ్రీహస్తాలలో, ఆళ్ళియుమ్ శజ్గముమ్ = శ్రీసుదర్శనాన్ని, పాంచజన్యమనే శంఖాన్ని, ఏన్ది = ధరించి, నమ్ కణ్ ముకప్పే = మన కంటికి ఎదురుగా, మొయ్త్తు = వచ్చి ఒత్తిడి చేసి, అలైత్తు = బుద్ధిని పాడుచేసి, ఉన్నై = నిన్ను, విడేన్ = విడువను, ఎన్టు ఇరుక్కిలుమ్ = అని ఉన్నా, ఇరామానుశా = భగవద్రామానుజా !, నిన్ పుకళ్ళే = తమ కల్యాణగుణాలే, ఎన్నై వన్దు = నావద్దకు వచ్చి, ముఱ్ఱుమ్ మొయ్త్తు నిన్టు = పూర్తిగా ఆవరించి నిలచి, అలైక్కుమ్ = ఆకర్షిస్తున్నవి.

“భగవానుడు విలక్షణమైన తన సౌందర్యాన్ని ధరింపజేస్తూ వచ్చి నాకట్టెదుట నిలచినా, నన్ను విడువకుండా బలంగా పట్టుకొన్నా, అతని అందంలో నేను మోహించబోవడం లేదు. తమ కల్యాణగుణాలే నన్ను అభినివిష్టునిగా చేస్తున్నవి. భగవద్గుణాలకు నేను అభినివేశాన్ని పొందడం లేదు’’- అని అముదనార్ అంటున్నారు.

**“శెయ్త్తలై చ్చజ్గమ్ శెళ్ళుముత్త మీనుమ్”** అనే విశేషణం- తిరువరజ్గమనే పదానికి అన్వయిస్తుంది. ఆ తిరువరంగం ఎటువంటిది ? అని అంటే, ముత్యాలను చిందించే శంఖాలతో నిండిన క్షేత్రాలతో పరివేష్ఠితమైనది. **“ఈనుతల్”** - ప్రసవించడం. భగవద్రామానుజులపట్ల **“తేవు మఱ్ఱఱియేన్’** అన్నట్లు అనన్యభక్తి తమకు ఉండడం ఈ పాశురంలో అముదనార్‌చే చెప్పబడినదని సారం.



**76. నిన్టవణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్, నిఱైె వేజ్గడప్పొ**
**ఱ్కున్టముమ్ వైకున్దనాడుమ్ కులవియ పాఱ్కడలుమ్,**
**ఉన్టనక్కెత్తనై యిన్బన్తరు మున్నిణైమలర్త్తాళ్**
**ఎన్టనక్కుమతు, ఇరామానుశా ! ఇవై యీన్దరుళే.**

ఇరామానుశా = భగవద్రామానుజా!, నిన్ట = స్థిరంగా నిలచి ఉండే, వణ్ కీర్త్తియుమ్ = గొప్ప కీర్తి, నీళ్ పునలుమ్ అధికమైన నీటిప్రవాహాలు, నిఱై = నిండి ఉండే, వేజ్గడమ్ = శ్రీవేంకటాచలమనే, పొన్ కున్టముమ్ = అందమైన పర్వతం, వైకున్దమ్ నాడుమ్ = శ్రీవైకుంఠమనే తిరునాడు, కులవియ = ప్రశంసించదగిన, పాల్ కడలుమ్ = క్షీరాబ్ధి, ఉన్తనక్కు = తమకు, ఎత్తనై ఇన్బమ్ తరుమ్ =ఎంతటి ఆనందాన్ని ఇస్తాయో, ఉన్ ఇణై మలర్ తాళ్ = దేవరవారి ఉభయపాదారవిందాలు, ఎన్తనక్కుమ్ అతు = నాకుకూడా అంతటి ఆనందాన్ని కల్గిస్తాయి, ఇవై = ఇటువంటి శ్రీచరణాలను, ఈన్దరుళ్ = దాసునకు అనుగ్రహించాలి.

గడచిన పాశురంలో అముదనార్ వివరించిన పరమభక్తిని తెలిసిన ఇంకా భగవద్రామానుజులు చాలా ఆనందించి, “వీరికి నేను ఏమి చేయగలను ?’’ అని తలవగా, అముదనార్, “స్వామీ ! దాసునకు దేవరవారు వేఱు దేనినీ చేయనక్కర లేదు. దాసునకు సర్వస్వమైన ఈ శ్రీచరణపద్మాలను అనుగ్రహించాలి’’- అని అంటున్నారు.

**“నిన్టవణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్ నిఱై’** అనే పర్యంతం శ్రీవేంకటాచలానికి విశేషణం. పాపాలు పోగొట్టగల్గినదనే స్థిరమైన కీర్తిని కల్గినది, ధ్వనించే కొండవాగులను కల్గినది అయిన శ్రీవేంకటాచలం, పరమపదం పాలకడలి- అనే ఈ స్థానాలు అన్నీ స్వామీ! దేవరవారికి ఎటువంటి ఆనందాన్ని కల్గిస్తాయి. అటువంటి ఆనందాన్ని దాసునకు దేవరవారి శ్రీచరణాలు కల్గిస్తాయి.

**“తెళ్ళికురలరువి త్తిరువేజ్గడత్తు ఎళ్ళిల్ కొళ్ శోది ఎన్దైతన్దైతన్దైక్కు ఒళ్ళివిల్ కాల మెల్లా ముడనాయ్ మన్ని వళ్ళువిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్”** అని నమ్మాళ్వార్లు ఆశపడినట్లే శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యాన్ని చేయాలి- అని దాసుడు కోరలేదు. నమ్మాళ్వార్లు అభిమానించిన విషయమని దేవరవారు అభిమానించి

ఉండవచ్చు. "మాక వైకున్దమ్ కాణ్బదఱ్కు ఎన్మన మేక మెణ్ణుమ్ ఇరాప్ప కలిన్దియే" అని ఆ*ఴ్వా*ర్లు ఆశించిన పరమపదంలోను దాసునకు ఆశలేదు. అదికూడా ఆ*ఴ్వా*ర్లు అభిమానించినదని దేవరవారు అభిమానించి ఉండవచ్చు. "పాజ్గియ పాఙ్కడల్ పళ్ళికొళ్వానై ప్పుణర్వదోరాశైయినాల్, ఎన్కొజ్గై కిళర్న్దు కుమైత్తు క్కుతుకలిత్తు ఆవియై ఆకులమ్ శెయ్యు మఙ్కుయిలే!" అని గోదాదేవి కోరనట్లే క్షీరాబ్ధినాథునితో ఆలింగనం చేసికోవాలి అనే ఆశకూడా దాసునకు లేదు. అదికూడా మన చెల్లెలు అభిమానించిన విషయమని దేవరవారు అభిమానించి ఉండవచ్చు. వాస్తవానికి దాసుడు అభిమానించిన విషయం ఏది? అని అంటే, "ఎమ్బెరుమానార్ తిరువడికళే శరణమ్" అన్నది ఒక్కటే. అందుచేత దాసునకు ఈ శ్రీచరణాలనే ఆపన్నిధిగా అనుగ్రహించాలి"- అని అముదనార్ ఇందులో ప్రార్థించారు.

77. ఈన్దన నీయాత ఇన్నరుళ్, ఎణ్ణిల్ మఱైక్కుఱుమ్బై
ప్పాయ్న్దన నమ్మఱై ప్పల్పొరుళాల్, ఇప్పడి యనైత్తుమ్
ఏయ్న్దనన్ కీర్త్తియినాలెన్ వినైకళై వేర్ పఱియ
క్కాయ్న్దనన్, వళ్ళె యిరామానుశన్నెన్కరుత్తినియే.

ఈయాత = (దీనికి ముందు ఎవరికీ) అనుగ్రహించని, ఇన్ అరుళ్ = విలక్షణమైన కృపను, ఈన్దనన్ = దాసునకు అనుగ్రహించినవారు, ఎణ్ ఇల్ = అసంఖ్యాకాలైన, మఱై కుఱుమ్బై = వేదవిరోధిమతాలను, అ మఱై పల్ పొరుళాల్ = ఆ వేదాల అర్థాలనే గ్రహించి, పాయ్న్దనన్ = ఖండించనవారు, కీర్త్తియినాల్ = తమ కీర్తితో, ఇప్పడి అనైత్తుమ్ = ఈ భూమిలో అంతటా, ఏయ్న్దనన్ = వ్యాపించినవారు, ఎన్ వినైకళై = నా కర్మలను, వేర్ పఱియ = సమూలంగా ఛేదించేటట్లు పోగొట్టినవారు, వళ్ళె = ఔదార్యమే మూర్తీభవించినవారైన, ఇరామానుశఱ్కు = భగవద్రామానుజులకు, ఇని ఎన్ కరుత్తు = ఇంకా (చేయదగినదిగా) మనస్సులో ఏదైనా ఉన్నదా?

గడచిన పాశురంలో అముదనార్ తాము అపేక్షించిన రీతిలోనే శ్రీరామానుజుల అనుగ్రహాన్ని పొంది, కృతార్థులై, వారు చేసిన ఉపకారాలను అనుసంధించి, "వీటిని అన్నిటినీ చేసిన తరువాతకూడా ఇంకా చేయాలని వారు అనుకొన్నది ఏదియో కదా!" అని అంటున్నారు.



"భగవద్రామానుజులు నా పాపాలను అన్నిటినీ సమూలంగా పెకలించి వేసి, తమ పరమకృపకు నన్ను పాత్రం చేశారు. ఈ రీతిలో నాకు మాత్రమే కాదు ఉపకారం చేసినది. వేదాలకు బాహ్యాలైన మతాలలోనివారు పలికే అపార్థాలను యథార్థాలతో ఖండించి, అందఱిని ఉజ్జీవింపచేశారనే కీర్తి లోకం అంతటా వ్యాపించింది. అందువల్ల ఇకపై వారు చేయదగినది ఏమీ లేదు. లేకపోయినా వారి మనస్సును గమనించినపుడు ఇంకా ఇంకా ఏవో హితాలను చేయాలని చాలా ఆశపడుతున్నట్లు తోస్తున్నది. ఇంకా ఏమి చేయబోతున్నారో తెలియడం లేదు"- అని అంటున్నారు.

"మఱై క్కుఱుమ్బు" అంటే వేదానికి వ్యతిరేకంగా పలికే అపార్థాలు. "ఈన్దనన్, పాయ్న్దనన్, ఏయ్న్దనన్, కాయ్న్దనన్"- అనేవానిని సమాపక క్రియారూపాలుగానే భావించి వివరించవచ్చు.

78. కరుత్తిల్ పుకున్దుళ్ళిల్ కళ్ళఙ్కఴఱ్ఱి, కరుతరియ
వరుత్తత్తినాల్ మిక వఞ్జిత్తు, నీ యిన్ద మణ్ణకత్తే
తిరుత్తి త్తిరుమకళ్ కేళ్వనుక్కాక్కియపిన్ ఎన్నెఞ్జిల్
పొరుత్తప్పడాతు, ఎమ్మిరామానుశ! మఱ్ఱోర్ పొయ్ప్పొరుళే.

ఎమ్ ఇరామానుశ = మా శ్రీరామానుజా!, నీ =తమరు, కరుత అరియ = మనస్సులో భావించడానికి సాధ్యం కాని, వరుత్తత్తినాల్ = శ్రమలను పొంది, మిక వఞ్జిత్తు = నన్ను బాగా వంచించి, కరుత్తిల్ పుకున్దు = నా మనస్సులోకి వచ్చి ప్రవేశించి, ఉన్నిల్ = నా లోపల ఉండే, కళ్ళమ్ = ఆత్మాపహారదోషాన్ని, క*ఴఱ్ఱి* = పోగొట్టి, తిరుత్తి = శిక్షించి, ఇన్ద మణ్ అకత్తే = ఈ లోకంలో, తిరు మకళ్ కేళ్వనుక్కు = శ్రియఃపతికి, ఆక్కియ పిన్ = కింకరునిగా చేసిన తరువాత, మ*ఱ్ఱు* ఓర్ పొయ్ పొరుళ్ = (దీనికి పిరుద్ధం అయిన) వేఱు ఏ తప్పు విషయంకూడా, ఎన్ నెఞ్జిల్ = నా మనస్సులో, పొరున్దప్పడాతు = నిలచి ఉండదు.

భగవద్రామానుజులు తమను సంస్కరించడంకోసం పడిన పాట్లను గూర్చి ప్రస్తావించి పల్కి, "ఈ విధంగా నన్ను సంస్కరించి తమకు ఉద్దేశ్యం అయిన భగవద్విషయంలో సేవకునిగా చేసిన తరువాత ఇక వేఱు ఏవిషయం అయినా నా మనస్సుకు అంగీకార్యం కాదు"- అని అంటున్నారు.

"స్వామీ! "మనం దూరంగా ఉంటే ఇతనిని సంస్కరించడం వీలు కాదు"- అని, "ఇతనికి తెలిసేటట్లుగా దగ్గరనే ఉంటే ఇతడు తప్పుకొని పోతాడు"- అని

మీరు భావించి నాకు తెలియకుండా నా మనస్సులో ప్రవేశించి మఱుగుపడి నిలచి, అహంకారం మమకారాది మనస్సులోని దోషాలను అన్నిటిని పోగొట్టి. ఈ రీతిలో మెల్లగా సంస్కరించి, దేవరవారికి భోగ్యమైన భగవద్విషయంలో కింకరునిగా చేశారు. ఈ విధంగా సంస్కరింపబడ్డ నేను ఇక స్వరూపవిరుద్ధాలైన విషయాలను మనస్సులో భావించను - అని భావం.

**79. పొయ్యై చ్చురక్కుమ్ పొరుళై త్తురన్దు, ఇన్ద ప్పూతలత్తే**
**మెయ్యై ప్పురక్కు మిరామానుశన్ నిఱ్క, వేఱు నమ్మై**
**ఉయ్యక్కొళ్ళవల్ల తెయ్‌వమ్ ఇఙ్గు యాతెన్ఱులర్‌న్దు అవమే**
**ఐయప్పడానిఱ్పర్, వైయత్తుళ్ళోర్ నల్లఱివిழన్దే.**

ఇన్ద పూతలత్తే =ఈభూమిలో, పొయ్యై = అసత్యమైన విషయాన్నే, శురక్కుమ్ = ఇకా ఇంకా అధికంగా వ్యక్తం చేసే, పొరుళ్ =(బాహ్యమతస్థులు పలికే) అర్థాలను, తురన్దు = ఖండించి, మెయ్యై = సత్యాన్ని, పురక్కుమ్ = రక్షించే, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, నిఱ్క = వేంచేసి ఉండగా, (వీరిని లెక్కించకుండా), వైయత్తు ఉళ్ళోర్ = ఈ భూమిలో ఉండేవారు, నమ్మై = మనలను, ఉయ్య కొళ్ళవల్ల = ఉజ్జీవింపచేయగల్గిన, వేఱు దెయ్‌వమ్ = వేఱు ఏదయినా దైవం, ఇఙ్గు = ఈ లోకంలో, యాతు ఎన్ఱు = ఏది! అని, (విచారిస్తూ), ఉలర్‌న్దు= మనఃక్లేశంతో శరీరం ఎండిపోయి (కృశించి), నల్ అఱివు = (భగవద్రామానుజుల శ్రీచరణాలనే శరణం అని నమ్మి ఉండడమనే) మంచి జ్ఞానాన్ని, ఇழన్దు = కోల్పోయి (పొందలేక), అవమే = వ్యర్థంగా, ఐయమ్ పడా నిఱ్పర్ = సందేహ పడుతున్నారే! అయ్యో!

లోకంలో మానవులు పలు విధాలుగా ఉంటారు. "శాస్త్రాలు లేవు; పరలోకం లేదు''- అని నాస్తికులై సంచరించేవారు పలువురు. "సన్మార్గంలో నిలచి ఉజ్జీవించే రీతిని అన్వేషించాలి''- అని భావించి ఆస్తికులై ఉంటారు కొందఱు. మొదట పల్కిన నాస్తికవాదులనుగూర్చి మనకు చింత లేదు. ఆస్తికులై ఉండేవారు "ఏవిధంగా అయినా ఉజ్జీవించాలి'' అనే ఆశను కల్గినవారై భగవద్రామానుజుల దివ్యప్రభావాలను దర్శించి, వారి శ్రీచరణాలను ఆశ్రయించి సులభంగా ఉజ్జీవించకుండా, "ఏ దైవాన్ని ఆశ్రయించి మనం ఉజ్జీవించవచ్చు ?'' అనే విచికిత్సను చేసి వ్యర్థంగా కాలాన్ని గడుతుపున్నారే ! అయ్యో ! ఇది ఏమి అవివేకం ! అని అముదనార్ ఇందులో జాలిపడుతున్నారు.



"పొయ్యై శురక్కుమ్ పొరుళ్" అనే ప్రయోగానికి అసత్యం తప్ప వేఱేమీ లేని అర్థం- అని భావం. "సర్వమ్ అసత్యమ్" అనేవారు కనుక వారికి అంతా అసత్యమయం. "మెయ్యై ప్పురక్కు మిరామానుశన్" - శ్రీరామానుజులు యథార్థం సర్వవిజ్ఞానమ్" అని స్థాపించినవారు. పురత్తల్ - కాపాడడం.

**80. నల్లార్ పరవు మిరామానుశన్, తిరునామమ్ నమ్బ**
**వల్లార్ తిఱత్తై మఱవాతవర్‌కళ్ యవర్, అవర్‌క్కే**
**ఎల్లా విడత్తిలు మెన్ఱు మెప్పోతిలు మెత్తొழుమ్బుమ్**
**శొల్లాల్ మనత్తాల్, కరుమత్తినాల్ శెయ్‌వన్ శోర్విన్ఱియే.**

నల్లార్ =సత్పురషులచే, పరవుమ్ కీర్తింపబడే, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, తిరు నామమ్ = తిరునామాన్ని, నమ్బవల్లార్ తిఱత్తై = (తమకు రక్షకంగా) నమ్మగల్గినవారి రీతులను, మఱవాతవర్‌కళ్ ఎవర్ = మఱవ కుండా ఎల్లప్పుడు ధ్యానించేవారు ఎవరో, అవర్‌క్కే = అటువంటి శ్రీరామానుజభక్తులకే, ఎల్లా ఇడత్తిలుమ్ = సకలదేశాలలోను, ఎన్ఱుమ్ = సకలావస్థలలోను, ఎప్పోదిలుమ్ = అన్ని కాలాలలోను, ఎత్తొழుమ్బుమ్ = సకలవిధ కైంకర్యాలను, శొల్లాల్ మనత్తాల్ కరుమత్తినాల్= వాఙ్మనఃక్రియలనే త్రివిధకరణాలతో, శోర్వు ఇన్ఱి శెయ్‌వన్ = విశ్లేషించకుండా ఉండి చేస్తాను.

తమ స్థిరమైన నిష్ఠనుగూర్చి ఇందులో అముదనార్ పల్కుతున్నారు. "సత్పురుషులందఱు కీర్తించే రీతిలోని భగవద్రామానుజుల తిరునామాలనే తమకు రక్షకంగా నమ్మిన మహానుభావులనే ఎల్లప్పుడు చింతిస్తూ ఉండే శ్రీరామానుజ భక్తభక్తులకే దాసుడనైన నేను "**ఒழివిల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని వழువిలా అడిమై**" చేస్తాను'' అని అంటున్నారు. "**తొழుమ్బు**" -దాస్యం.

**81. శోర్విన్ఱి యున్దన్ తుణైయడిక్కీழ్, తొణ్డుపట్టవర్‌పాల్**
**శార్విన్ఱి నిన్ఱ ఎనక్కు, అరఙ్గన్ శెయ్యతాళిణైకళ్**
**పేర్విన్ఱి యిన్ఱు పెఱుత్తు మిరామానుశ! ఇని యున్**
**శీరొన్ఱియ కరుణైక్కు, ఇల్లై మాఱు తెరివుఱిలే.**

ఉన్‌తన్ = దేవరవారియొక్క, తుణై అడి కీழ్ = పాదద్వంద్వంకింద, శోర్వు ఇన్ఱి = విశ్లేషంలేకుండా, (నిరంతరంగా), తొణ్డుపట్టవర్ పాల్ = దాస్యాన్నిచేసే వారి విషయంలో, శార్వు ఇన్ఱి నిన్ఱ = పొందిక లేకుండా నిలచి ఉండే, ఎనక్కు =

నాకు, ఇన్ఱు = ఈ దినంలో, అరఙ్గన్ = శ్రీరంగనాథుని, శెయ్య తాళ్ ఇణైకళ్ = అందమైన ఎఱ్ఱని శ్రీచరణయుగాన్ని, పేర్వు ఇన్ఱి = ఏనాడూ విశ్లేషం లేని రీతిలో, పొఱుత్తమ్ = శిరోభూషణంగా అనుగ్రహించిన, ఇరామానుశ = భగవద్రామానుజా!, ఇని = ఈ విధంగా అయిన తరువాత, తెరివుఱిల్ = విచారించినట్లయితే, ఉన్= దేవరవారియొక్క, శీర్ ఒన్ఱియ కరుణైక్కు = గొప్ప కరుణకు, మాఱు ఇల్లై = సాటి లేదు.

"శ్రీరామానుభక్తులకే కైంకర్యం చేస్తాను'' అని గడచిన పాశురంలో పల్కిన అముదనార్, "ఇటువంటి స్థిరనిశ్చయం నాకు ఈనాడు కల్గినదే తప్ప, దీనికి ముందు ఈ నిశ్చయం లేదు. ఆ విధంగా ఉండే నన్ను దేవరవారి దివ్యకృపతో సంస్కరించి దేవరవారు మెచ్చిన విషయానికి (భగవద్విషయానికి) కింకరుని చేశారు కదా! ఇది ఏమి సాటి లేని కరుణ!'' అని ఆశ్చర్యపడుతున్నారు.

"స్వామీ! దేవరవారికి దాసులైన మహానుభావులకు ఒక క్షణం అయినా సేవచేయకుండా, సంసారంలోనే పడి ఉన్న నన్ను దేవరవారి నిర్హేతుకకృపతో శ్రీరంగనాథుని శ్రీచరణాలకు సేవకునిగా చేశారు. ఇటువంటి తమ కరుణకు సాటి లేదు''- అని భావం.

**82.** **తెరివు*ఱ్ఱ* ఞానమ్ శెఱియ ప్పెఱాతు, వెమ్ తీవినైయాల్**
**ఉరువ*ఱ్ఱ* ఞానత్తు*ఴ*ల్కిన్ఱ ఎన్నై, ఒరు పొ*ఴు*తిల్**
**పొరువ*ఱ్ఱ* కేళ్వియనాక్కి నిన్ఱా నెన్న పుణ్ణియనో**
**తెరివు*ఱ్ఱ*కీర్త్తి, ఇరామానుశ నెన్నుమ్ శీర్ముకిలే.**

తెఱివు ఉ*ఱ్ఱ* = తేటపడిన, ఞానమ్ = జ్ఞానాన్ని, శెఱియ పెఱాతు = పొందలేకుండా, వెమ్ తీ వినైయాల్ = చాలా కఠినమైన కర్మలవల్ల, ఉరు ఉ*ఱ్ఱ* = ఉపయోగం లేని, ఞానత్తు = జ్ఞానాన్ని కలవాడనై, ఉ*ఴ*ల్కిన్ఱ = దేనిలోను స్థైర్యం లేక పరిభ్రమించే, ఎన్నై = నన్ను, ఒరు పొ*ఴు*తిల్ = ఒక్క క్షణంలో, పొరువు అ*ఱ్ఱ* = సాటి లేని, కేళ్వియన్ ఆక్కి నిన్ఱాన్ = బహుశ్రుతునిగా చేసి, అనుగ్రహించినవారు, తెఱివు ఉ*ఱ్ఱ* =ప్రసిద్ధమైన, కీర్త్తి = కీర్తిని కలవారు, శీర్ ముకిల్ =(ఔదార్యంలో) గొప్ప మేఘమని చెప్పదగినవారు అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్న పుణ్ణియనో = ఏమి ధార్మికులోకదా ! (సాటి లేని ధర్మిష్ఠులనిభావం).



"ఇది మంచి, ఇది చెడు'' అని వివేకించి తెలియలేక, మహాపాపంవల్ల విపరీతజ్ఞానాన్ని కల్గి, సంసారంలో ఉన్నచోట ఉండకుండా నిరంతరం పరిభ్రమిస్తున్న నాకు ఒక్క క్షణంలో భగవద్రామానుజులు అరుదైన గొప్ప అర్థవిశేషాలను ఉపదేశించి, **"బహుశ్రుతుడు"** అనే రీతిలో నన్ను చేశారే ! ఈ విధంగా ఇనుమును బంగారంగా చేసే మహానుభావులు వేతెవ్వరున్నారు ? - అని అంటున్నారు.

**"పొరువ*ఱ్ఱ* కేళ్వియనాక్కి నిన్ఱాన్"**- అముదనార్వలె విషయాలను విన్నవారు ఈలోకంలో ఎవరూ లేరు- అనే రీతిలో చేశారు. బహుశ్రుతులంటే పలువురు పెద్దలవద్ద పలుమార్లు పలు విషయాలను పలు రీతులలో విన్నవారని అర్థం. **"పొరువు"** -సాటి.

**83.** **శీర్ కొణ్డు పేరఱమ్ శెయ్తు, నల్ వీడు శెఱితు మెన్నుమ్**
**పార్కొణ్డ మేన్మైయర్ కూట్టనల్లేన్, ఉన్పతయుకమామ్**
**ఏర్కొణ్డ వీట్టై ఎళితినిలెయ్తువన్ ఉన్నుడైయ**
**కార్కొణ్డ వణ్మై! ఇరామానుశా! ఇతు కణ్డుకొళ్ళే.**

ఇరామానుశా = భగవద్రామానుజా !, శీర్ కొణ్డు = శమం, దమం మొదలైన గుణాలను కలవారై, పేర్ =గొప్ప, అఱమ్ శెయ్తు = ధర్మమైన శరణాగతి యోగాన్ని అనుష్ఠించి, నల్ వీడు = పరమపురుషార్థం అయిన మోక్షాన్ని, శెఱితుమ్ ఎన్నుమ్= పొందగలం అని ఉన్న, పార్ కొణ్డ మేన్మైయర్ = ప్రసిద్ధమైన ప్రభావాన్ని కల్గిన ప్రపన్నుల, కూట్టన్ అల్లేన్= గోష్ఠిలో నేను చేరినవాడను కాను, ఉన్ పద యుకమ్ ఆమ్ = దేవరవారి ఉభయపాదాలనే, ఏర్ కొణ్డ = పరమవిలక్షణమైన, వీట్టై = మోక్షాన్ని, ఎళితినిల్ = సులభంగా, ఎయ్తువన్=పొందుతాను, కార్ కొణ్డ = (ఔదార్యంలో) మేఘాన్ని మించిన, ఉన్నుడైయ = దేవరవారియొక్క, వణ్మై ఇతు= ఔదార్యం ఇటువంటిది, కణ్డుకొళ్ = దేవరవారే దీనిని గమనించవచ్చు. (దాసుడు చెప్పాలా!)

"చరమశ్లోకంలో శ్రీకృష్ణభగవానుడు నియమించిన రీతిలోనే మనం శరణాగతిని అనుష్ఠించాము కనుక, మనకు మోక్షం కైవసమైనదే''- అని నిశ్చయించు కొని ఉండే మహాత్ములలో నేను చేరినవాడను కాను. ఆ విధంగా దాసుడనైన నేను దేనినీ అనుష్ఠించలేదు., తమ శ్రీచరణాలనే మోక్షాన్ని పొందడంలో అడ్డు లేదు -అనే మనఃస్థైర్యం దాసునకు ఉన్నది- అని అముదనార్ అంటున్నారు.

"ప్రపత్తిః పరమో ధర్మః" అని శాస్త్రాలు పల్కుతున్నందున "పేరఱమ్" అని అన్నారు. "వీడు" అని కైవల్యానికికూడా పేరున్నందున పరమపదమనే వ్యత్యాసం స్ఫురించేటట్లు "నల్వీడు" అని అన్నారు. 'పదయుకమ్' -సంస్కృతపదం. "యుగమ్" అంటే రెండు. "ఇతు కణ్డుకొళ్" -ఔదార్యంయొక్క గొప్పతనం ఉదారులకు తెలియదు. యాచకునికే తెలుస్తుంది. కనుక నేను చెప్పగా నీవు తెలియాలి- అని (హార్ద) భావం.

**84.** కణ్డుకొణ్డే నెమ్మిరామానుశన్దన్నై, క్కాణ్డలుమే
తొణ్డుకొణ్డే నవన్తొణ్డర్ పొఱ్ఱాళిల్, ఎన్తొల్లై వెన్నోయ్
విణ్డుకొణ్డేన్ అవన్ శీర్వెళ్ళవారియై వాయ్ మడుత్తిన్ఱు
ఉణ్డుకొణ్డేన్, ఇన్నముఱ్ఱన వోతిల్ ఉలప్పిల్లైయే.

ఎమ్ ఇరామానుశన్తన్నై = స్వామి భగవద్రామానుజులను, ఇన్ఱు = ఈనాడు, కణ్డుకొణ్డేన్ = (యథాతథంగా దర్శించాను, కాణ్డలుమే = ఈ విధంగా దర్శించినంతనే, అవన్తొణ్డర్ = వారి భక్తుల, పొన్ తాళిల్ = అందమైన శ్రీచరణాలలో, తొణ్డు కొణ్డేన్ = దాసుడనయ్యాను, (అందువల్ల), ఎన్ = నా యొక్క, తొల్లై = ప్రాక్తనాలైన, వెమ్ నోయ్ = క్రూర కర్మలను, విణ్డుకొణ్డేన్ = పోగొట్టుకొన్నాను, అవన్ శీర్ వెళ్ళమ్ = వారి కల్యాణగుణప్రవాహమనే, వారియై = సముద్రాన్ని, వాయ్ మడుత్తు = నోరార అనుభవించి, ఉణ్డుకొణ్డేన్ = పొందాను, ఇన్నమ్ ఉఱ్ఱన = ఈవిధంగా ఇంకా నేను పొందిన హితాలనుగూర్చి, ఓతిల్ = చెప్పడం ఆరంభిస్తే, ఉలప్పు ఇల్లై = (దానికి) ఒక అంతం లేదు.

ఇకపైకూడా భగవద్రామానుజుల కరుణవల్ల నేను పొందబోయే హితాలు అంతు లేకుండా ఉన్నాయి. అయినా, ఈనాటివరకు నేను పొందిన ప్రయోజనాలకు అంతు ఉన్నదా! అని ఇందులో అముదనార్ అంటున్నారు.

భగవద్రామానుజులు మనవలె ఒక మానవులేనని సామాన్యులు తలుస్తున్నా, దాసుడనైన నేను ఆ విధంగా భావించలేదు. వీరు మానవులు కారు, లోకాన్ని ఉద్ధరించడంకోసం శ్రీవైకుంఠంనుండి వచ్చి అవతరించిన నిత్యసూరులలో ఒకరు అని తెలిసికొన్నాను. ("ఇరామానుశన్తన్నై క్కణ్డుకొణ్డేన్" అనేదానికి ఇదే తాత్పర్యం) ఆ విధంగా తెలిసికొన్న వెంటనే వారిపట్ల కల్గి ఉండే భక్తి వారి దాసుల పర్యంతం అనువర్తించి, వారి భక్తుల శ్రీచరణాలకు సేవను చేయగలిగాను. ఇందువల్ల నా



పాపాలన్నిటినీ తీర్చుకొనగలిగాను. ఇటువంటి నాకు ఆ భగవద్రామానుజుల దివ్యగుణానుసంధానమే "ఉణ్ణుమ్ శోఱు పరుకుమ్ నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్" అనే రీతిలో సర్వస్వంగా కల్గినవాడనయ్యాను. ఈ విధంగా నేను పొందిన హితాలలో ఇవి కొన్ని. అన్నిటిని పూర్తిగా చెప్పినట్లయితే మహాభారతమే కాగలదు - అని భావం. "ఉలప్పు"- పూర్తి. ముగింపు.

**85.** ఓతియ వేతత్తినుట్పొరుళాయ్, అతనుచ్చి మిక్క
శోతియై నాతనెన అఱియాతుఴల్కిన్ఱ తొణ్డర్,
పేతైమై తీర్త్త ఇరామానుశనై త్తొఴుమ్ పెరియోర్
పాతమల్లా లెన్తన్నారుయిర్క్కు, యాతొన్ఱుమ్ పఱ్ఱిల్లైయే.

ఓదియ = అధ్యయనం చేయబడే, వేదత్తిన్ = వేదాలలోని, ఉళ్ పొరుళ్ ఆయ్ = అంతరార్థమై, అతన్ = ఆ వేదంయొక్క, ఉచ్చి = శిరస్సులైన (అంతాలైన) ఉపనిషత్తులలో, మిక్క = మిక్కిలి వెలిగే, శోతియై = జ్యోతిస్స్వరూపుడైన శ్రీమన్నారాయణుని, నాతన్ ఎన = సర్వశేషి అని, అఱియాతు = తెలిసికోలేక, ఉఴల్కిన్ఱ తొణ్డర్ = కనబడినచోట అంతా దాస్యంచేస్తూ తిరిగే పామరులయొక్క, పేతైమై = అవివేకాన్ని, తీర్త్త = పోగొట్టిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, తొఴుమ్ =సేవించే, పెరియోర్ = మహాత్ములయొక్క, పాతమ్ అల్లాల్ = శ్రీచరణాలు తప్ప, ఎన్తన్ ఆర్ ఉయిర్క్కు = నా అరుదైన (అపురూపమైన) ఆత్మకు, యాతు ఒన్ఱుమ్ = వేఱ ఏ ఒక్క, పఱ్ఱు ఇల్లై = ఆశ్రయం లేదు.

గడచిన పాశురంలో "అవన్ శీర్వెళ్ళవారియై వాయ్మడుత్తు ఉణ్డుకొణ్డేన్" అని, "అవన్ తొణ్డర్పొఱ్ఱాళిల్ తొణ్డుకొణ్డేన్" అని పల్కిన రెండు విషయాలలో మొదట పల్కిన విషయమే (అంటే- శ్రీరామానుజులకు భక్తులై ఉండడమే) నాకు గొప్ప ఉద్దేశ్యం- అని ఇందులో అంటున్నారు.

సకలవేదాలచేత ప్రతిపాదింపబడేవాడు, కర్మకాండలలోవలె ఇంద్రుడు, అగ్ని, వరుణుడు మొదలైన శబ్దాలను ప్రయోగించి ఆ దేవతలకు అంతర్యామి అని పరోక్షంగా ప్రతిపాదించడం కాకుండా, వేదాంతాలనబడే ఉపనిషత్తులలో సాక్షాత్తుగా ప్రతిపాదింపబడేవాడైన సర్వేశ్వరుని సర్వశేషి అని తెలిసికోలేక, దేవతాంతరాలను కొలిచే నీచులైన రాజులను సేవించే, సంసారంలో మునిగి ఉండే సంసారుల

అజ్ఞానాన్ని పోగొట్టిన భగవద్రామానుజుల శ్రీచరణాలను సేవించిన మహానుభావులే నాకు శరణ్యులు- అని భావం.

"వేదత్తిన్ నుణ్‌పొరుళ్" అని కూడా పదవిభాగాన్ని చేయవచ్చు.

**86.** **పఱ్ఱా మనిశరై ప్పఱ్ఱి, అప్పఱ్ఱు విడాతవరే**
**ఉఱ్ఱారెన ఉఴన్ఱోడి నైయేనిని, ఒళ్ళియనూల్**
**కఱ్ఱార్ పరవు మిరామానుశనై క్కరుతు ముళ్ళమ్**
**పెఱ్ఱార్ యవర్, అవరెమ్మై నిన్ఱాళుమ్ పెరియవరే.**

పఱ్ఱా = ఉపయోగం లేని, మనిశరై = మానవులను, పఱ్ఱి = ఆశ్రయించి, అప్పఱ్ఱు విడాదు = ఆ ఆశ్రయణాన్ని విడువకుండా, అవరే = వారే, ఉఱ్ఱార్ ఎన = బంధువులు అనితలచి, ఉఴన్ఱు = వారి వెంట తిరిగి, ఓడి = వారు నియోగించిన కార్యాల నిర్వహణకోసం పరుగుతీసి, ఇని నైయేన్ = ఇకపై బాధపడను, ఒళ్ళియ నూల్ = గొప్ప శాస్త్రాలను, కఱ్ఱార్ = అధ్యయనం చేసినవారిచే, పరవుమ్ = కీర్తింపబడుతున్న, ఇరామానుశనై = భగవద్రామానుజులను, కరుతుమ్ = అనుసంధించే, ఉళ్ళమ్ పెఱ్ఱార్ = మనస్సును కలవారు, యవర్ = ఎవరో, అవర్ = ఆ మహాత్ములే, ఎమ్మై =మనలను, నిన్ఱు ఆళుమ్ = శాశ్వతంగా పాలించే, పెరియవర్ = మహానుభావులు.

నిన్నటివరకు నేను ఉపయోగం లేని అల్పమానవులను అందఱిని శరణు పొంది, వారే నాకు రక్షకులు- అని తలచి, వారి ఇంటి గడపవద్ద పడి ఉండి బాధపడ్డాను. ఇకపై ఏనాడూ ఆ విధంగా చెడిపోను. పలువురు పండితులచే కీర్తింపబడుతున్న భగవద్రామానుజులను ధ్యానించేవారెవరో, ఆ రామానుజభక్తులకే నేను విధేయుడను అయినందువల్ల **"పఱ్ఱా మనిశరై ఉఱ్ఱార్"** అని తలచి పరిభ్రమించి క్లేశపడను- అని భావం.

**"పఱ్ఱా మనిశర్"**- ఏ ఆపదను పోగొట్టడానికైనా, సంపదను ఇవ్వడానికైనా శక్తి చాలనివారని భావం. **"అప్పఱ్ఱు విడాతవరే"** అనేచోట **"విడాతు, అవరే"** అని రెండు పదాలుగా విడదీయకుండా **"విడాతవరే"** అని ఒకే పదంగా గ్రహించి వివరించవచ్చు. ఉపయోగం లేని మానవులను కాదు నేను ఆశ్రయించినది; ఉపయోగం లేని మానవులను ఆశ్రయించి, ఆ ఆశ్రయణాన్ని విడువనివారు కొందఱున్నారు. వారిని నేను బంధువులు- అని ఆశ్రయించాను- అని భావం.



దీనివల్ల మూర్ఖులలో మిక్కిలి మూర్ఖుడను- అనే అర్థం వ్యక్తమవుతున్నది. **"ఒళ్ళియ నూల్"- "శుడర్ మిక శురుది"** అని ఆழ్వార్లుకూడా అన్నారు.

**87.** **పెరియవర్ పేశిలుమ్ పేతైయర్ పేశిలుమ్, తన్‌కుణఙ్గట్కు**
**ఉరియ శొల్లెన్ఱు ముడైయవనెన్ఱెన్ఱు, ఉణర్విల్ మిక్కోర్**
**తెరియుమ్ వణ్‌కీర్త్తి యిరామానుశన్ మఱైతేర్‌న్దులకిల్**
**పురియునన్ ఞానమ్, పొరున్దాతవరై ప్పొరుమ్ కలియే.**

పెరియవర్ = జ్ఞానశక్తులలో నిండిన మహాత్ములు, పేశిలుమ్ =పల్కినా, పేతైయర్ = ఏమీ తెలియనివారు, పేశిలుమ్ = పల్కినా, తన్ కుణఙ్గట్కు = తన కల్యాణగుణాలకు, ఉరియ శొల్ =తగిన పల్కులను, ఎన్ఱుమ్ =ఎల్లప్పుడు, ఉడైయవన్ = కలవారు, ఎన్ఱు ఎన్ఱు = అని పలుమార్లు పల్కి, ఉణర్‌విల్ మిక్కోర్= గొప్ప జ్ఞానులు అనుసంధించే, వణ్ కీర్త్తి =దివ్య కీర్తిని కలవారైన, ఇరామానుశన్= భగవద్రామానుజులు, మఱై తేర్‌న్దు = వేదాలను పరిశీలించి, ఉలకిల్ = ఈ లోకంలో, పురియుమ్ = ఉపదేశించిన, నల్ ఞానమ్ = మంచి జ్ఞానంలో, పొరున్దాతవరై = చేరనివారిన, కలి = కలిపురుషుడు, పొరుమ్ =పీడిస్తాడు.

గడచిన పాశురంలో తెల్పిన అధ్యవసాయం (నిశ్చయం) నాకు కలిపురుషుని క్రౌర్యంవల్ల ఒక సమయంలో మాఱిపోవచ్చునని అనుకుంటున్నారా ! ఆవిధంగా భావించవద్దు. భగవద్రామానుజుల దాసుల విషయంలో కలిపురుషుడు ఏవిధమైన క్రౌర్యాన్ని చేయలేడు. మిగిలినవారినే అతడు చెడ్డగొట్టగలడు. నా అధ్యవసాయం చిరకాలపర్యంతం నిలుకడగా నిలువగల్గినదే సుమా ! అని అంటున్నారు.

**(పెరియర్ పేశిలుమ్-ఇత్యాది)** - దీని భావమేమి? అని అంటే, భగవద్రామానుజుల కల్యాణగుణాలను మహాజ్ఞానులు తాము పల్కి ముగించ గలరు - అన్నది కాని, అల్పజ్ఞానులు మనకు పల్కడానికి సాధ్యం కాదని వెనుకంజ వేయవలసిన వారు- అన్నది కాని సరి కాదు. **"తఙ్గళన్బార <u>త్తమ</u>తు శొల్‌వలత్తాల్ <u>త్తలైత్తలై</u> చ్చిఱన్దు పూశిప్ప"** అని, **"పేశువార్ ఎవ్వళవు పేశువర్ అవ్వళవే వాశమలర్ త్తుழాయ్ మాలైయాన్.... వడివు"** అని పల్కినట్లు పెద్దలు కీర్తించినా, అల్పజ్ఞులు కీర్తించినా, వారి వారి యోగ్యతలకు తగినట్లు పల్కి స్తుతించదగినవారు- భగవద్రామానుజులు - అని పెద్దలు గ్రహించి, "మనం మన శక్తికి తగినట్లు స్తోత్రం చేద్దాం" అని స్తుతిస్తున్నారని భావం. ఆవిధంగా స్తుతింపబడుతున్న భగవద్రామానుజులు

ఉపదేశించిన జ్ఞానాన్ని అనాదరించి, ఆ ఉపదేశానుసారం నడవనివారే కలిదోషంవల్ల బాధపడతారని భావం.

**88.** కలిమిక్క శెన్నెల్ కழని క్కుఱైయల్, కలైప్పెరుమాన్
ఒలిమిక్క పాడలై యుణ్డు తన్నుళ్ళమ్ తడిత్తు, అతనాల్
వలి మిక్క శీయ మిరామానుశన్ మఱై వాతియరామ్
పులి మిక్కతెన్ఱు, ఇప్పువనత్తిల్ వన్దమై పోఱ్ఱువనే.

కలి మిక్క = నీటిసారం మిక్కిలిగా కల, శెన్నెల్ కழని = ఎఱ్ఱని ధాన్యం పండే క్షేత్రాలను కల్గిన, కుఱైయల్ = తిరుక్కుఱైయిలూర్ అనే దివ్యదేశంలో అవతరించిన, కలై పెరుమాన్ = శాస్త్రాలు అనదగిన దివ్యప్రబంధాలను అనుగ్రహించిన గొప్పతనాన్ని కల తిరుమఙ్గైయాழ్వార్లయొక్క, మిక్క ఒలి పాడలై= అతిశయించిన రాగాలను కల పెరియ తిరుమొழి దివ్యప్రబంధాన్ని, ఉణ్డు = అనుభవించి, తన్ ఉళ్ళమ్ తడిత్తు = తన మనస్సుల ఉబ్బి తబ్బిబ్బై, అతనాల్= అందువల్ల, వలి మిక్క = బలాన్ని పొందిన, శీయమ్= సింహంవంటి, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, మఱై వాదియర్ ఆమ్ = వేదాలలో దుర్వాదాలను చేసే కుదృష్టులు అనే, పులి = పులులు, మిక్కతు = అధికమైనవి, (విజృంభిస్తున్నాయి) ఎన్ఱు =అని, (వాటిని దండించడంకోసం), ఇప్పువనత్తిల్= ఈ భూలోకంలో, వన్దమై = వచ్చి అవతరించిన రీతిని, పోఱ్ఱువన్ = పొగడగలను.

తిరుక్కుఱైయలూర్ అనే దివ్యదేశంలో అవతరించి, పెరియతిరుమొழి మొదలైన ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించిన తిరుమఙ్గైమన్నన్‌యొక్క శ్రీసూక్తులను అనవరతం అనుసంధిస్తూ, దానివల్ల మనస్సులో ఆనందాన్ని పొందే భగవద్రామానుజులు ఈ లోకంలో కుదృష్టిమతాలను ఖండించడంకోసం అవతరించారు. ఏ విధంగా అవతరించారు ? అని అంటే, కుదృష్టులనే పులులను కబళీకరించడంకోసం వచ్చిన సింహమా ? అనే రీతిలో అవతరించారు. ఈ విధంగా అవతరించిన రీతిని నేను కీర్తిస్తాను- అని తాత్పర్యం.

**(కలిమిక్క శెన్నెల్ కழని)- "కలి"** -అంటే కోలాహలం. దున్నడం (పైరు), నాటడం, కోయడం- అనే రీతిలో ప్రవర్తించే కోలాహలం. తిరుమఙ్గైయాழ్వార్ల అవతారస్థలం తిరుక్కుఱైయలూర్ అని పిలువబడుతుంది. **"కలిపెరుమాన్"** అని గొప్పగా పల్కడం, వారి వాక్సామర్థ్యాన్ని ప్రకాశింపజేయడంకోసం. **"పువనమ్"** - ఇది సంస్కృతపదం.



**89.** **పోఱ్ఱరుమ్ శీలత్తిరామానుశ!, నిన్పుకழ్ తెరిన్దు**
**శాఱ్ఱువనేల్ అతు తాழ్వతు తీరిల్, ఉన్‌శీర్‌తనక్కోర్**
**ఏఱ్ఱమెన్ఱే కొణ్డిరుక్కిలు మెన్ మనమేత్తి యన్ఱి**
**ఆఱ్ఱకిల్లాతు, ఇతఱ్కు ఎన్నినవాయ్ ఎన్ఱిట్టఞ్జువనే.**

పోఱ్ఱు అఱు = కీర్తించి పూర్తి చేయడానికి సాధ్యం కాని, శీలత్తు = శీలగుణాన్ని కల, ఇరామానుశ = భగవద్రామానుజా !, నిన్ పుకழ్ = దేవరవారి కల్యాణగుణాలను, తెరిన్దు = తెలిసికొని, శాఱ్ఱువనేల్ = పల్కినవాడనైతే, అతు = నీచుడనైన నేను) పల్కడం అనేది, తాழ్వు = (దేవరవారికి) అవద్యమే, అతు తీరిల్ = ఆవిధంగా నేను పల్కడం మానివేస్తే, ఉన్ శీర్ తనక్కు = దేవరవారి కల్యాణగుణాలకు, ఓర్ ఏఱ్ఱమ్ = అద్వితీయమైన అతిశయం కాగలదు, ఎన్ఱే కొణ్డు ఇరుక్కిలుమ్ =అని నేను తెలిసికొని ఉన్నా, ఎన్ మనమ్ = నా మనస్సు, ఏత్తి అన్ఱి = (తమ కల్యాణగుణాలను) కీర్తిస్తే తప్ప, ఆఱ్ఱకిల్లాతు = ధరించ లేదు (నిలువలేదు), అదఱ్కు = ఈ విషయంలో, ఎన్ నినైపా = దేవరవారు ఏమి తలుస్తున్నారో! ఎన్ఱిట్టు = అని, అఞ్జువన్ = భయపడుతున్నాను.

గడచిన పాశురంలో **"పోఱ్ఱువనే"** అని అనగానే భగవద్రామానుజులను కీర్తించడానికి తగిన యోగ్యత మనకు ఉన్నదా? అని అముదనార్ పరిశీలించి చూచారు. యోగ్యత కొంచెంకూడా లేదు- అని తెలిసికొన్నారు. యోగ్యత లేని మనం ఈ సాహసంలో ప్రవర్తించడం (చేయిపెట్టడం) వారిని నిందించడంలోకే పర్యవసిస్తుంది తప్ప, పొగడడం కాబోదు. అందువల్ల మనం నోరు మూసికొని ఉండడమే మంచిది- అని తలచి మౌనంగా ఉండాలని చూచారు. కాని, మనస్సు వినలేదు. భగవద్రామానుజుల విషయంగా ఏదయినా పల్కిన తీరాలని మనస్సు తహతహలాడుతున్నందున నోటిని మూసికోవడం సాధ్యం కాలేదు. "అయ్యో! ఏమి చేయను ? కీర్తించడానికి యోగ్యత లేదు. పొగడకుండా ఉండాలంటే మనస్సు ఊరుకోవడంలేదు. కీర్తించే తీరవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. ఇతడు ఆర్తివల్ల కీర్తిస్తున్నాడు'' అని దేవరవారు తలుస్తున్నారా ? లేక, అహంకారంతో కీర్తిస్తున్నాడని భావిస్తారా? ఏమని తలుస్తారు ? అని నేను చాలా భయపడుతున్నాను స్వామీ! అని అంటున్నారు.

**90.** నినైయార్ పిఱవియై నీక్కుమ్ పిరానై, ఇన్నీణిలత్తే
ఎన్నై యాళవన్ద ఇరామానుశనై, ఇరుఙ్కవికళ్

పునైయార్ పునైయుమ్ పెరియవర్తాళ్కళిల్ పూన్దొడైయల్
వనైయార్, పిఱప్పిల్ వరున్దువర్ మాన్దర్ మరుళ్ శురన్దే.

పిఱవియై = సంసారాన్ని, నీక్కుమ్ = పోగొట్టే, పిరానై = ఉపకారకులు, ఇ నీళ్ నిలత్తే = ఈ విశాలమైన భూమిలో, ఎనై ఆళ = నన్ను దాసునిగా చేసికోవడం కోసం (పాలించడం కోసం), వన్ద = అవతరించినవారు అయిన, ఇరామనుశనై = భగవద్రామానుజులను, నినైయార్ = చింతించనివారు, ఇరు = (వారి విషయంగా) మంచి, కవికళ్ = పాశురాలను, పునైయార్ = కూర్చనివారై (పాడనివారై), పునైయుమ్ = (ఏదో భాగ్యవశంచేత), పాశురాలను కూర్చే, పెరియవర్ తాళ్కళిల్ = మహాత్ముల శ్రీచరణాలలో, పూ తొడైయల్ = పూలమాలికలను, వనైయార్ = సమర్పించనివారై ఉండే, మాన్దర్ = మానవులు, మరుళ్ శురన్దు = అజ్ఞానాన్ని అధికంగా పొంది, పిఱప్పిల్ = సంసారంలో పడి ఉండి, వరున్దువర్ = దుఃఖపడతారు.

గడచిన పాశురంలో **"అఞ్జువనే"** అనే వీరి భయం తీరేటట్లు చల్లగా భగవద్రామానుజులు కటాక్షించారు. ఆ కటాక్షప్రభావంవల్ల భయం తీరి, తేటపడి, మనోవాక్కాయాలలో దేనితో అయినా భగవద్రామానుజుల విషయంలో ఏదయినా కైంకర్యాన్ని చేసి ఉజ్జీవించవలసి ఉండగా, పాపిష్ఠివారు ఆ పనిని చేయకుండా పాడయిపోతున్నారే ! ఏమి ! అని అనుతపిస్తున్నారు- ఇందులో.

సంసారంలో జన్మను పోగొట్టేవారై, విశేషించి దాసుని ఏలడంకోసంగా ఈలోకంలో అవతరించినవారైన భగవద్రామానుజులను ఈ పాడు సంసారులు మనస్సులో ధ్యానించనైనా ధ్యానించవచ్చు. లేక, వాక్కుతో నోటికి సాధ్యమైన రీతిలో కొన్ని మాటలను పల్కి స్తుతించనైనా స్తుతించవచ్చు. అంతేకాక, వారిని స్తుతించే మహాత్ముల శ్రీచరణాలలో పూవులను సమర్పించి, నమస్కరించడమైనా చేయవచ్చు. ఇటువంటి మనోవాక్కాయాల కార్యాలలో దేనినీ చేయకుండా సంసారబంధాన్ని దృఢంగా మఱింత బలపఱచుకొంటున్నారే! అయ్యో! ఈ పాపిష్ఠివారు- అని భావం. **"పునైతల్"**- కూర్చడం. **"వనైతల్"** - సమర్పించడం.

**91.** మరుళ్ శురన్దు ఆకమవాతియర్ కూఱుమ్, అవప్పొరుళామ్
ఇరుళ్ శురన్దెయ్త్త వులకిరుళ్ నీఙ్గ, త్తన్నీణ్డియ శీర్
అరుళ్ శురన్దు ఎల్లావుయిర్కట్కుమ్ నాత నరఙ్గ నెన్నుమ్
పొరుళ్ శురన్దాన్. ఎమ్మిరామానుశన్ మిక్క పుణ్ణియనే.



ఆకమమ్ వాతియర్ = (శివుడు పల్కిన) శైవాగమాన్ని ప్రమాణంగా గ్రహించి వాదించే పాశుపతులు, మరుళ్ శురన్దు = అజ్ఞానాన్ని పొంది, కూఱుమ్ = (శివుని పరత్వవిషయంగా) పలికే, అవమ్ పొరుళ్ ఆమ్ = అవద్యాలైన అర్థాల రూపంలోని, ఇరుళ్ = చీకటి, శురన్దు = (వెలువడి) కమ్ముకొని, (అందువల్ల), ఎయ్త్త = పాడయిపోయిన, ఉలకు = లోకం (లోనివారి) యొక్క, ఇరుళ్ = అజ్ఞానాంధకారం, నీఙ్గ = తొలగిపోయేటట్లుగా, తన్ = తనయొక్క, ఈణ్డియ శీర్ = విలక్షణమైన, అరుళ్ = కరుణను (కృపను), శురన్దు = ప్రవహింపజేసి, ఎల్లా ఉయిర్కట్కుమ్= ఆత్మలన్నిటికి, నాతన్ = స్వామి, అరఙ్గన్ =శ్రీరంగనాథుడే, ఎన్నుమ్ పొరుళ్ = అనే అర్థాన్ని, శురన్దాన్ = వ్యక్తం చేసినవారైన, ఎమ్ ఇరామానుశన్ = స్వామి భగవద్రామానుజులు, మిక్క పుణ్ణియన్ = గొప్ప పుణ్యాత్ములు.

ఈ సంసారులు ఈ విధంగా విముఖులై ఉన్నా వీరిని స్వప్రయోజనంగా తలచి తరింపజేయడంకోసం భగవద్రామానుజులు ప్రయత్నించడాన్నిగూర్చి అముదనార్ తలచి వారిని ఇందులో కీర్తిస్తున్నారు.

ఆసురస్వభావాన్ని కలవారిని మోహింపజేయడంకోసం రుద్రుడు ఉపదేశించిన శైవగమాన్నే ప్రధానంగా గ్రహించి పాశుపతులు పలికే అపార్థాలను విని, లోకంలోనివారు దిగ్భ్రమను చెంది సంసారంలో పరిభ్రమిస్తూ ఉండగా, అపుడు భగవద్రామానుజులు అవతరించి ఆ అపార్థాలను ఖండించి, తమ కృపతో శ్రీరంగనాథుడే సర్వస్వామి అనే తత్త్వార్థాన్ని ఉపదేశించారు. ఓ జనులారా ! ఆ మహాధర్మిష్ఠులనే మీరుకూడా ఆశ్రయించి ఉజ్జీవించండి- అని అంటున్నారు.

"గొప్ప పుణ్యాత్ములైన భగవద్రామానుజులు .... శ్రీరంగనాథుడే సర్వస్వామి అనే అర్థాన్ని వ్యక్తం చేశారు'' అని, "శ్రీరంగనాథుడే సర్వస్వామి అనే అర్థాన్ని వెలువరించిన మన స్వామి భగవద్రామానుజులు గొప్ప పుణ్యాత్ములు'' అని రెండు విధాలుగా అన్వయించవచ్చు.

**92.** పుణ్ణియ నోన్బు పురిన్దుమిలేన్, అడి పోఱ్ఱి శెయ్యుమ్
నుణ్ణరుమ్ కేళ్వి నువన్దుమిలేన్, శెమ్మైనూల్ పులవర్క్కు
ఎణ్ణరుమ్ కీర్త్తి యిరామానుశ! ఇన్ఱు నీ పుకున్దు ఎన్
కణ్ణుళ్ళుమ్ నెఞ్జుళ్ళుమ్ నిన్ఱ, ఇక్కారణమ్ కట్టురైయే.

శెమ్మై నూల్ పులవర్క్కు = చక్కని శాస్త్రాలను అధ్యయనం చేసి, కవిత్వాన్ని చెప్పగల్గినవారికికూడా, ఎణ్ అరు కీర్త్తి = (ఏతావన్మాత్రం అని) పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కాని కీర్తిని కల, ఇరామానుశా = ఓ భగవద్రామానుజా!, పుణ్ణియమ్ నోన్బు = పుణ్యమైన ఏ నోమును, పురిన్దుమ్ ఇలేన్ = దాసుడనైన నేను అనుష్ఠించలేదు, అడి = దేవరవారి శ్రీచరణాలను, పోఱ్ఱి శెయుమ్ = కీర్తించడానికి తగిన, నుణ్ = సూక్ష్మమైన, అరు =అరుదైన, కేళ్వి = శ్రవణాన్ని, నువన్దుమ్ ఇలేన్ = (చేయాలి అని నోరారా) పలుకలేదు (నేను ఈ విధంగా ఉండగా), ఇన్డు = ఇపుడు, ఈనాడు, ఎన్ కణ్ణుళ్ళుమ్ = నా కన్నుల లోపల, నెఞ్జుళ్ళుమ్ = నా మనస్సు లోపల, పుకున్దు నిన్ఱ = ప్రవేశించి అధిష్ఠించి ఉండడానికి, ఇక్కారణమ్ = ఈ కారణాన్ని, కట్టురై = వివరించాలి.

స్వామీ! గొప్ప కవులకుకూడా దేవరవారి దివ్యయశస్సులు పరిచ్ఛేదించి కీర్తించ సాధ్యమైనవి కావు. అందువల్ల, దేవరవారి మాహాత్మ్యం అంతు లేనిది. ఇటువంటి తమరు పాపిని అయిన నా మనస్సులో, నేత్రాలలో విడిచిపోకుండా ఉంటూ ఎల్లప్పుడు దాసుని అనుగ్రహించడానికి ఏమి కారణం? అని నేను ఎంతగా ఆలోచించగా ఆ కారణం బోధపడలేదు. దాసుడనైన నేను ఏదైనా మంచి పనిని చేసి ఉన్నవాడనైతే అది కారణంగా ఉండి ఉండవచ్చు- అని భావించే అవకాశం ఉన్నది. ఆ విధంగా ఏ సత్కార్యాన్ని చేయనివాడను నేను. తమ శ్రీచరణాలను కీర్తించడానికి తగిన విషయాలను శ్రవణం చేసినవాడను అయినా కాను. వినాలనే ఆశ కల్గిఉన్నట్లుగా నోరు తెఱచి ప్రస్తావాన్ని కూడా చేయలేదు. ఇటువంటి నన్ను ఈనాడు దేవరవారు అనుగ్రహించడం ఏమి ఆశ్చర్యం! అని అంటున్నారు. నిర్హేతుక కృపవల్ల అనుగ్రహించారని భావం. **"కట్టురై"**- ఇది ఒకే పదం. 'చెప్పండి' - అని అర్థం.

**93.** కట్ట ప్పొరుళై మఱైప్పొరుళెన్డు, కయవర్ శొల్లుమ్
పెట్టై క్కెడుక్కుమ్ పిరానల్లనే, ఎన్ పెరువినైయై
క్కిట్టిక్కిழజ్గొడు తన్నరుళెన్ను మొళ్వాళురువి
వెట్టిక్కళైన్ద, ఇరామానుశనెన్నుమ్ మెయ్త్తవనే.

కిట్టు = దాసుని వద్దకు వచ్చి చేరి, తన్ అరుళ్ ఎన్నుమ్ = తమ కృప అనే, ఒళ్ = అందమైన, వాళ్ = ఖడ్గాన్ని, ఉరువి = ఒఱనుండి బయటకు తీసి, ఎన్ పెరు వినైయై = నా మహాపాపాలను, కిழఙ్గొడు వెట్టి కళైన్ద = సమూలంగా ఖండించి వేసిన, ఇరామానుశన్ ఎన్నుమ్ = భగవద్రామానుజులనే, మెయ్ తవన్ = మహామునులు (ఎటువంటివారు ? అని అంటే), కయవర్ = దుష్టులైన కుదృష్టులు, కట్టమ్ పొరుళై = అపార్థాలను, మఱై పొరుళ్ ఎన్డు = వేదాలలోని అర్థాలు అని, శొల్లుమ్ పెట్టై = పలికే ఉన్మత్తవాదాలను, కెడుక్కుమ్ పిరాన్ అల్లనే= ఖండించివేసిన మహానుభావులు కదా !

గడచిన పాశురంలో - **"ఇరామానుశ! ఇన్డు నీ పుకున్దు ఎన్ కణ్ణుళ్ళుమ్ నెఞ్జుళ్ళుమ్ నిన్ఱ ఇక్కారణమ్ కట్టురైయే"** "ఓ శ్రీరామానుజా! ఈనాడు నీవు ప్రవేశించి కన్నులలో, మనస్సులో నిలచి ఉండే ఈ కారణాన్నిగూర్చి పల్కు" అనే మాటకు వారు ఏ సమాధానాన్ని చెప్పకపోవడంవల్ల, నిర్హేతుకకృపతోనే అనుగ్రహించారు- అని తామే తెలిసికొని "నా బలమైన పాపాలను తమ కరుణతో ఖండించి వేసిన భగవద్రామానుజులు, ఎవరూ అపేక్షించకపోయినా, తామే వచ్చి కుదృష్టిమతాలను ఖండించిన మహానుభావులుకదా ! వారు చేసేవి అన్నీ నిర్హేతుకంగానేకదా ఉంటాయి- అని అముదనార్ అంటున్నారు.

**"కట్టమ్"** - కష్టం. **"కట్టప్పొరుళ్"** -అనే ప్రయోగానికి కష్టపడి పలికే అర్థాలు- అని భావం. మంతాతరస్థులు చెప్పే అర్థాలు అస్వరసాలు కనుక క్లిష్టాలుగా ఉంటాయి - అని భావం. **"కోయవర్"** -నీచులు, దుష్టులు, **"పెట్టు"**- ఇతురులను వంచించడంకోసం పలికే అసత్యవచనాలు. **"మెయ్త్తవన్"** -తపస్సు అనే శరణాగతియోగం.

**94.** తవన్దరుమ్ శెల్వమ్ తకవుమ్ తరుమ్, శరియా ప్పిఱవి
ప్పవన్దరుమ్ తీవినై పాఱ్ఱి త్తరుమ్, పరన్దామ మెన్నుమ్
తివన్దరుమ్ తీతిలిరామానుశన్ తన్నై చ్చార్న్దవర్కట్కు
ఉవన్దరున్దేన్, అవన్శీరన్డి యానొన్డు ముణ్ మకిழ్న్దే.

తీతు ఇల్ = ఏవిధమైన దోషం లేనివారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, తన్నై శార్న్దవర్కట్కు = తమను చేరి ఆశ్రయించినవారికి, తవమ్ = శరణాగతినిష్ఠను, తరుమ్ = అనుగ్రహిస్తారు, శెల్వమ్ = భక్తి అనే సంపదను, తకవుమ్ = తమ కృపను, తరుమ్ = అనుగ్రహిస్తారు, శరియా = నివర్తింప జేయడానికి సాధ్యం కాని, పిఱవి పవమ్ = జన్మరూపసంసారాలను, తరుమ్ = కల్గించే, తీ వినై = క్రూరకర్మలను, పాఱ్ఱి తరుమ్ = పోగొడతారు, పరమ్

తామమ్ ఎన్నుమ్ = పరమపదమని చెప్పబడే, తివమ్ = ఉత్తమలోకాన్ని, తరుమ్ = అనుగ్రహిస్తారు, (అందువల్ల), యాన్ = నేను, అవన్ శీర్ అన్ఱి = ఆ భగవద్రామానుజుల కల్యాణగుణాలను తప్ప, ఒన్ఱుమ్ = వేఱు దేనినీ, ఉళ్ మకి*ழ*్న్దు వన్దు = మనస్సులో ఆనందించి, ఆశపడి, అరున్దేన్ = అనుభవించను.

నేను ఇకపై భగవద్రామానుజుల దివ్యకల్యాణగుణాలను తప్ప, వేఱు దేనినీ అనుభవించను. ఆ భగవద్రామానుజులకు ఏమి విశేషం? అని అడుగుతున్నారా! వారు తమను ఆశ్రయించిన భక్తజనులకు ప్రారంభంలోనే శరణాగతినిష్ఠను కల్గించి, ఆ పిమ్మట స్వరూపాను రూపం అయిన భక్తిని కల్గించి, జనన మరణ రూపమైన సంసారానికి హేతువైన అనాదిపాపాలను అన్నిటినీ పోగొట్టి, చివరలో శ్రీవైకుంఠాన్ని కూడా అనుగ్రహిస్తారు. అందువల్ల వారి దివ్యగుణాలే నాకు సర్వదా భోగ్యాలు.

ఈ పాశురంలో **"తరుమ్"** అనే పదం అయిదుచోట్ల వస్తున్నది. రెండవ పాదంలో మొదట ఉండే **"తరుమ్"** అనే పదంమాత్రం దుష్కర్మకు (**"తీవినై"** అనే పదానికి) విశేషణం. మిగిలిన నాల్గు భగవద్రామానుజులపక్షంలో అన్వయించే సమాపకక్రియారూపాలు.

"శవియా ప్పిఱవి, శరియా ప్పిఱవి" అని పాఠభేదాలు "పవమ్"- సంస్కృత పదం. "పరన్దామ" - సంస్కృతపదం "తివమ్"- సంస్కృతపదవికృతి.

**95.** **ఉణ్ణిన్ఱుయిర్‌కళుక్కు*ఱ్ఱ*నవే శెయ్‌తు, అవర్‌క్కుయవే**
**పణ్ణుమ్ పరనుమ్ పరివిలనామ్బడి, పల్లుయిర్‌క్కుమ్**
**విణ్ణిన్ తలైనిన్ఱు వీడళిప్పాన్ ఎమ్మిరామానుశన్**
**మణ్ణిన్ తలత్తుతిత్తు, ఉయ్ మఱై నాలుమ్ వళర్‌త్తననే.**

ఉయిర్‌కట్కు = ఆత్మలన్నిటికి, ఉళ్ నిన్ఱు = అంతర్యామిగా లోపల నిలచి ఉండి, ఉ*ఱ్ఱ*నవే శెయ్‌తు = హితాలనే ప్రవర్తింపజేసి, అవర్‌క్కు = ఆ ఆత్మలకు, ఉయవే = ఉజ్జీవనాన్నే, పణ్ణుమ్ = చేస్తున్న, పరనుమ్ = భగవానుడుకూడా, పరివు ఇలన్ ఆమ్ పడి = (ఆత్మల విషయంలో భగవద్రామానుజులవలె) ప్రీతిని కలవాడు కాడు- అని చెప్పవలసి వచ్చేటట్లుగా, పల్ ఉయిర్‌క్కుమ్ = సకలాత్మలకు, వీడు = మోక్షాన్ని, అళిప్పాన్ = అనుగ్రహించడంకోసం, ఎమ్ ఇరామానుశన్ = స్వామి భగవద్రామానుజులు, విణ్ణిన్ తలై నిన్ఱు = శ్రీవైకుంఠంలో నుండి, మణ్ణిన్ తలత్తు = భూతలంలో, ఉదిత్తు = అవతరించి, ఉయ్ మఱై నాలుమ్ = అందఱికి



ఉజ్జీవించడానికి హేతువైన నాల్గు వేదాలను, వళర్‌త్తనన్ = ఏ కొఱత లేకుండా వర్ధిల్లజేశారు.

సకలాత్మలయొక్క హృదయాలలో ఎల్లప్పుడు నిలచి ఉండి, వారిని సన్మార్గంలో ప్రవర్తింపజేయడానికి తగిన కార్యాలను చేసి ఉజ్జీవింపజేసే భగవానుని రీతిని, ఈ భగవద్రామానుజుల రీతిని గమనిస్తే, ఈ ఇరువురిలో భగవద్రామానుజులే సంసారుల విషయంలో అధికమైన ప్రేమను కలవారు; భగవానునకు ఇంతటి ప్రేమ లేదు- అనే రీతిలో వీరు అందఱికి మోక్షాన్ని అనుగ్రహించడంకోసం పరమపదంలోనుండి భూలోకానికి అవతరించి, వేదమార్గాన్ని సుప్రతిష్ఠితం చేశారు- అని భావం. భగవానుడు స్వతంత్రుడు కనుక నిగ్రహానికి, అనుగ్రహానికి సాధారణుడు. భగవద్రామానుజులు ఆ విధంగా కాదు. అనుగ్రహమే రూపాన్ని పొందింది- అనేటట్లు ఉన్నవారై, అందఱికి ముక్తిని అనుగ్రహిస్తారు- అన్నది స్ఫుటమైన భావం.

ఈ పాశురంలోని చివరి పాదాన్ని- **"మణ్ణిన్ తలత్తుదిత్తు మఱై నాలుమ్ వళర్‌త్తననే"** అనే అధ్యాపకులు అనుసంధిస్తున్నారు. **"నేర్ పదినాలే"** అనే కట్టళైక్కలిత్తుఱై లక్షణాన్నిబట్టి పదహాఱు అక్షరాలు సరిపోయినా, దళభంగంవల్ల, శ్రీవరవర మునుల వ్యాఖ్యలోని "సర్వోజ్జీవనశాస్త్రమాన" అనే ఒక వాక్యం వ్యర్థంగా కావలసి వస్తున్నందున, ఈరెండు లోపాలకు చోటులేనట్లుగా **"ఉయ్‌మఱైనాలుమ్"** అనే ప్రాచీనపాఠమే గ్రాహ్యం. **"ఉయ్ మఱైనాలుమ్"** అనే పదానికి భావంగానే / శ్రీవరవరమునులు 'సర్వోజ్జీవనశాస్త్రమాన"అనే వ్యాక్యాన్ని అనుగ్రహించారు.

**96.** **వళరుమ్ పిణికొణ్డ వల్వినైయాల్, మిక్కనల్ వినైయిల్**
**కిళరుమ్ తుణివు కిడైత్తఱియాతు, ముడైత్తలైయూన్**
**తళరు మళవుమ్ తరిత్తుమ్ వి*ழ*ున్దుమ్ తని తిరివేఱ్కు**
**ఉళరెమ్మిఱైవన్, ఇరామానుశన్దన్నై యు*ఱ్ఱ*వరే.**

వళరుమ్ పిణి కొణ్డ =అంతు లేని, సదా వృద్ధి చెందే క్రూరకర్మలవల్ల, మిక్క నల్ వినైయిల్ = పరమధర్మం అయిన శరణాగతిలో, కిళరుమ్ తుణివు = (సదా వృద్ధిచెందే) మహావిశ్వాసం, కిడైత్తఱియాతు = లభించదు, కనుక, ముడై తలై = చెడ్డవాసనలకు స్థానమైన, ఊన్ = శరీరం, తళరుమ్ అళవుమ్ = శరీరం పతనం చెందనంతవరకు, తరిత్తుమ్ = ఒక రీతిలో ధరించి ఉండి, వి*ழ*ున్దుమ్ =

(శబ్దాదిలౌకిక విషయాలలో) పడి ఉండి, తని తిరివేఱ్కు = తోడులేకుండా ఒంటరిగా తిరిగే నాకు, ఇత్తైవర్ = స్వాములు (ఎవరు? అంటే), ఎమ్ ఇరామానుశన్ తన్నై = మన భగవద్రామానుజులను, ఉఱ్ఱవర్ = ఆశ్రయించిన మహాత్ములు, ఉళర్ = ఉన్నారు.

"మత్తై నాలుమ్ వళర్త్తవన్" అని పల్కిన అముదనార్‌ను చూచి కొందఱు "భగవద్రామానుజులు నాల్గు వేదాలను వర్ధిల్లజేయడం నిజమే. వారు చేతనులను ఉజ్జీవనోపాయంగా వేదాంతప్రక్రియలో అనుగ్రహింపబడినవి భక్తి, ప్రపత్తి. వీటిలో మీకు ఏ ఉపాయంలో ఊనిక ఉన్నది?'' అని ప్రశ్నించగా, నాకు ఆ రెండూ ఉపాయాలు కావు; శ్రీరామానుజభక్తుల అభిమానంలో ఒదిగి ఉండి ఉజ్జీవించేవాడను నేను- అని అంటున్నారు.

నా అనాదిపాపాలవల్ల నా మనస్సులో భక్తి కలుగలేదు. ప్రపత్తికి కావలసిన మహావిశ్వాసంకూడా కలుగలేదు. అత్యంతం హేయమైన శరీరాన్ని పోషించుకొంటూ శబ్దాదివిషయాలలో ఊనికను కలవాడనై ఉన్నాను. ఆ విధంగా ఏ గతిలేని నాకు భగవద్రామానుజుల అంతరంగభక్తులే రక్షకులు కాగలరు. కనుక, నేను తదీయాభిమాననిష్ఠుడనై ఉన్నాను- అని భావం.

"మిక్క నల్ వినై" -"వినై, నల్ వినై, మిక్క నల్ వినై" మూడుగా విడదీసి, "వినై" - అనే పదం సామాన్య భక్తిని తెలుపుతున్నదని, "నల్‌వినై" అనే ప్రయోగం విశేషభక్తిని తెల్పుతున్నదని, "మిక్క నల్‌వినై" అనేది ప్రపత్తిని తెల్పుతున్నదని పెద్దలు అంటారు. "ముడైత్తలైయూన్" -"తలై" అంటే చోటు, "ముడై"- దుర్వాసనకు, దుర్గంధానికి ఆశ్రయం అయిన శరీరం- అని భావం. '**తీణ్డా వఴుమ్బుమ్ శెన్నీరుమ్ శీయుమ్ నరమ్బుమ్ శెఱి దశైయుమ్ వేణ్డా నాఱ్ఱముమ్ మికుముడల్" (తిరువరఙ్గక్కలమ్బకమ్)** అని అన్నారు వీరి కుమారులు. (పిళ్ళైప్పెరుమాళ్ అయ్యఙ్గార్)

97. తన్నైయుఱ్ఱాట్చెయ్యుమ్ తన్మైయినోర్, మన్ను తామరైత్తాళ్
తన్నైయుఱ్ఱాట్చెయ్య ఎన్నై యుయ్‌ఱ్ఱా నిన్ఱు, తన్‌తకవాల్
తన్నైయుఱ్ఱారన్ఱి తన్మైయుఱ్ఱారిల్లై ఎన్ఱఱిన్దు
తన్నైయుఱ్ఱారై, ఇరామానుశన్ కుణమ్ శాఱ్ఱిడుమే.



ఇరామానుశన్ = భగవద్రామానుజులు, తన్నై ఉఱ్ఱార్ అన్ఱి = తమను ఆశ్రయించినవారున్నారే తప్ప, తన్నై ఉఱ్ఱారై = తమను ఆశ్రయించినవారియొక్క, కుణమ్ శాఱ్ఱిడుమ్ తన్మై = గుణకీర్తనాన్ని చేసే స్వభావాలను కల, ఉఱ్ఱార్ = స్వభక్తభక్తులు, ఇల్లై ఎన్ఱు = ఎవరూలేరు అని, అఱిన్దు = భావించి, ఎన్నై = దాసుడనైన నన్ను, ఇన్ఱు = ఈనాడు, తన్ తకవాల్ = తన కృపతో, (ఏమి చేశారు? అని అంటే), తన్నై ఉఱ్ఱు = తమను ఆశ్రయించి, ఆళ్ శెయ్యుమ్ = కైంకర్యాన్ని చేసే, తన్మైయినోర్ = స్వభావాన్ని కలవారైన స్వభక్తులయొక్క, మన్ను తామరై తాళ్ తన్నై = ఒకదానితో ఇంకొకటి చేరి పొందికగా ఉండే శ్రీచరణపద్మాలను, ఉఱ్ఱు ఆళ్ శెయ్య = నేను ఆశ్రయించి, సేవచేసేటట్లు, ఉయ్‌త్తాన్ = చేశారు.

భగవద్రామానుజులు నన్ను తమకు దాసునిగా చేసికోకుండా, తమను ఆశ్రయించినవారికి నన్ను దాసునిగా చేశారు. దీనికి ఏమి కారణం? అని అడుగుతున్నారా! "అందఱు మనలనే నేరుగా వచ్చి ఆశ్రయిస్తున్నారు తప్ప, నన్ను ఆశ్రయించినవారిని ఆశ్రయించేవారెవరూ లేరే! ఈ అముదనార్ నన్ను ఆశ్రయించినవారిని ఆశ్రయించే అధికారిగా కానీ !'' అని మనస్సులో సంకల్పించి చేశారు.

ఈ పాశురంలోని అన్వయక్రమం కొంచెం క్లిష్టం. జాగ్రత్తగా అన్వయించుకోవాలి. '**తన్నై యుఱ్ఱారన్ఱి, త్తన్నై యుఱ్ఱారై క్కుణమ్ శాఱ్ఱిడుమ్ తన్మై యుఱ్ఱారిల్లై యెన్ఱఱిన్దు, ఇరామానుశన్, తన్నై యుఱ్ఱాట్చెయ్యుమ్ తన్మైయినోర్ మన్ను తామరైత్తాళ్తన్నై యుఱ్ఱు ఆట్చెయ్య త్తన్ తకవాల్ ఇన్ఱు ఎన్నై ఉయ్‌త్తాన్**"- అని అన్వయం.

"**శాఱ్ఱిడుమ్**" - అనే విశేషణపదం పాశురం చివరలో ఉండడం ఒక అపూర్వప్రయోగమని అంటారు. రెండవ పాదంలో "**ఎన్నై యుఱ్ఱాన్**" అని అనుసంధిస్తారు (అధ్యాపకులు).

98. ఇడుమే యినియ శువర్క్కత్తిల్, ఇన్నుమ్ నరకిలిట్టు
చ్చుడుమే యవఱ్ఱై త్తొడర్ తరు తొల్లై, శుఴల్ పిఱప్పిల్
నడుమే యిని నమ్మిరామానుశన్ నమ్మై నమ్‌వశత్తే
విడుమే శరణ మెన్ఱాల్, మనమే! నైయల్ మేవుతఱ్కే.

నమ్ ఇరామానుశన్ = మన భగవద్రామానుజులు, శరణమ్ ఎన్రాల్ = తమ శ్రీచరణాలనే శరణం అని మనం పల్కినట్లయితే, ఇనియ = (కొందఱికి) మధురంగా తోచే, శువర్క్కత్తిల్ = స్వర్గంలోకి, ఇడుమే = మనలను కొనిపోయి చేరుస్తారా ? ఇన్నమ్ =లేక, నరకిల్ ఇట్టు = నరకంలోకి తీసికొనిపోయి, శుడుమే = దహింపజేస్తారా ?, అవఱ్ఱై = ఆ స్వర్గనరకాలను, తొడర్ తరు = అనువర్తించి ఉండే, తొల్లై = అనాదియైన శుழల్ = పరిభ్రమిస్తున్న, పిఱప్పిల్= జన్మలలో, నడుమే = నిలుపుతారా ?, ఇని= ఇంకాపైన గల కాలంలో, నమ్మై = మనలను, నమ్ వశత్తే = మనం పోయే దారిలోనే, విడుమో = విడిచిపెడతారా ? (వీటిని వేటినీ చేయనివారైనతరువాత), మనమే = ఓ మనసా, మేవుదఱ్కు = ప్రయోజనాన్ని పొందే విషయంగా, నైయల్ = నీవు శ్రమపడవద్దు.

ఓ మనసా! ఇక నీవు "మనకు ప్రాప్యసిద్ధి కలుగుతుందా ?" అని ఆ విషయలో కొంచెం అయినా కలవరపడవద్దు. మనం "స్వర్గలోకానికి పోవడం సంభవిస్తుందా ? నరకానికి పోవడం తటస్థిస్తుందా ? ఈ సంసారంలోనే ఉండి పరిభ్రమించడమే సంభవిస్తుందా?" అని చింతించి ఇక నీవు బాధపడవద్దు. **"భగవద్రామానుజుల శ్రీచరణాలే శరణం"** అని ఒకసారి పల్కితే ఆ భగవద్రామానుజులు మనలను విడచిపెడతారా? కొన్నాళ్ళు ఉండి, ఆనందాన్ని పొంది, వెనుకకు రావలసి ఉండే స్వర్గంలో మనలను తీసికొనిపోవాలని తలుస్తారా? దుఃఖాలనే అనుభవించవలసిన చోటు అయిన నరకంలోకి మనలను కొనిపోయి, హింసించాలని చూస్తారా? సుఖదుఃఖాలను మాఱి మాఱి అనుభవించే చోటు అయిన ఈ **"ఇరుళ్ తరు మాఞాలమ్"**లోనే నిలిపి ఉంచుతారా? ఈ లోకంలో కొన్నినాళ్ళు మనలను నిలిపి ఉంచినా, మన శిరస్సును మనమే ఖండించుకొనే రీతిలో మనలను విడుస్తారా? మఱి ఏమి చేయదలచారు? తమ పాదాలలో చేరేటట్లుగా తామే అంగీకరిస్తారు! అందుకోసం నీవు నూవుగింజ అంతకూడా శ్రమపడవద్దు- అని తమ మనస్సును ఉపదేశించి పలికారు.

**(అవఱ్ఱై త్తొడర్ తరు తొల్లై శుழల్ పిఱప్పు)**- స్వర్గానికి పోయినా, నరకానికి పోయినా మాఱి మాఱి పలు జన్మలు జన్మించవలసి ఉన్నందున స్వర్గనరకాలను అనువర్తిస్తూనే ఉంటాయి జన్మలు. **"నైయల్"**- ఇది మధ్యమపురుష వ్యతిరేకార్థక సమాపకక్రియ.



**99.** తఱ్కచ్చమణరుమ్ శాక్కియ ప్పేయ్‌కళుమ్, తాழ్శడైయోన్
శొఱ్కఱ్ఱ శోమ్బరుమ్ శూనియవాతరుమ్, నాన్మఱైయుమ్
నిఱ్క క్కుఱుమ్బు శెయ్ నీశరుమ్ మాణ్డనర్ నీణిలత్తే
పొఱ్కఱ్పకమ్, ఎమ్మిరామానుశముని పోన్ద పిన్నే.

తఱ్కమ్ శమణరుమ్ = తర్కాలను చేసే శ్రమణులు, (తార్కికులు), పేయ్ = పిశాచంవలె పట్టినపట్టు విడువకుండా ఉండే, శాక్కియర్‌కళుమ్ = బౌద్ధులు, తాழ్ శడైయోన్ శొల్ = రుద్రుని పల్కులైన శైవాగమాన్ని, కఱ్ఱ = అభ్యసించిన, శోమ్బరుమ్ = తామసులైన శైవులు, శూనియ వాదరుమ్ = శూన్యవాదులు, నాల్ మఱైయుమ్ నిఱ్క = నాల్గు వేదాలు ప్రకాశిస్తూ ఉండగానే, కుఱుమ్బు శెయ్ = (వాటికి పొసగని) అపార్థాలను పలికే, నీశరుమ్ = కుదృష్టులు, మాణ్డనర్ = నశించారు, ఎపుడు ? అని అంటే, పొన్ కఱ్పకమ్ = గొప్ప కల్పవృక్షంవలె ఉదారులైన, ఎమ్ ఇరామానుశన్ ముని = స్వామి రామానుజులు, నీళ్ నిలత్తే = విశాలమైన ఈభూమిలో, పోన్ద పిన్ = అవతరించిన తరువాత.

సకలమైన అర్థాలను అనుగ్రహించగల్గిన భగవద్రామానుజులు ఈ లోకంలో అవతరించిన తరువాత, జైనులు, బౌద్ధులు, చార్వాకులు, పాశుపతులు, అద్వైతులు మొదలైన మతాంతరస్థులు అందఱు నశించారు. ఇకవారిచే ఏవిధమైన హాని లోకానికి కలుగదు- అని అంటున్నారు.

**"శమణర్"**- 'ఆర్హతర్' అని వ్యవహరింపబడే జినమతస్థులు. **"శాక్కియర్"**- బౌద్ధమతస్థులు. వీరికి పట్టిన పట్టు విడువకపోవడం అనే మొండి వాదం అధికం కనుక, **"శాక్కియ ప్పేయ్‌కళుమ్"** అని అన్నారు. **"శూనియ వాతర్"**- **"సర్వం శూన్యమ్"** అని వాదించేవారు.

**100.** పోన్దతెన్నెఞ్జెన్నుమ్ పొన్ వణ్డు, ఉనతడిప్పోతిలొణ్‌శీ-
రాన్దెళితేనుణ్డమర్న్దిడ వేణ్డి, నిన్పాలతువే
ఈన్దిడ వేణ్డు మిరామానుశ! ఇతు వన్ఱి యొన్ఱుమ్
మాన్దకిల్లాతు, ఇని మఱ్ఱొన్ఱు కాట్టి మయక్కిడలే.

ఇరామానుశ = భగవద్రామానుజా!, ఎన్ నెఞ్జు ఎన్నుమ్ = నా మనస్సు అనే, పొన్ వణ్డు = అందమైన తుమ్మెద, ఉనతు = దేవరవారి, అడి పోదిల్ = శ్రీచరణపద్మాలలో, ఒణ్ శీర్ ఆమ్ = అందమైన కల్యాణగుణాలనే, తెళి తేనై =

స్వచ్ఛమైన తేనెను, ఉణ్డు =భుజించి, అమర్న్దిడ వేణ్డి = నిత్యావాసం చేయాలని కోరి, నిన్ పాల్ = దేవరవారివద్ద, పేర్న్దతు = వచ్చి చేరింది, అతువే = ఆ కల్యాణగుణాలనే, ఈన్దిడవేణ్డుమ్= అనుగ్రహించాలి, అతు అన్ఱి = ఆ కల్యాణ గుణాలే కాక, ఒన్ఱుమ్ = వేఱు దేనినీ, మాన్దకిల్లాతు = (మనస్సు) భుజించదు (అనుభవించదు), ఇని = ఈ విధంగా ఉన్న తరువాత, మ*ర్ఱు* ఒన్ఱు = వేఱొక విషయాన్ని, కాట్టి =చూపి, మయక్కిడల్ = మోహింపజేయవద్దు.

స్వామీ ! దాసుని మనస్సు తమ కల్యాణగుణలనే ఎల్లప్పుడు అనుభవించాలని ఆశపడుతూ గొప్ప అభినివేశంతో తమ దరికి చేరింది. ఇది ఇంకొక విషయాన్ని కోరదు. దేవరవారుకూడా ఇక దీనిని సంసారంలో ఇంకొక విషయంవైపు పోనివ్వకుండా దేవరవారివద్దనే స్థిరంగా నిలచి ఉండేటట్లు చేయాలి.

అముదనార్ తమ మనస్సును ఒక తుమ్మెదగా రూపణం చేసినందులకు తగినట్లు భగవద్రామానుజుల దివ్యగుణాలను మధువుగా రూపణం చేశారు. ఈ తుమ్మెదకు ఆ తేనె తప్ప వేఱేమీ రుచించదు.

"మయక్కిడిల్" -ఇది మధ్యమపురుషవ్యతిరేకార్థక సమాపక్రియ.

**101.** మయక్కు మిరువినై వల్లియిఱ్పూణ్డు, మతి మయఙ్గి
త్తుయక్కుమ్ పిఱవియిల్ తోన్ఱియ ఎన్నై, త్తుయరక*ర్ఱి*
ఉయక్కొణ్డు నల్కు మిరామానుశ! ఎన్ఱతున్నై యున్ని
నయక్కుమవర్క్కితు ఇ*ఴు*క్కెన్బర్, నల్లవరెన్ఱు నైన్దే.

మయక్కుమ్ = అజ్ఞానాన్ని కల్గించగల్గిన, ఇరు వినై = పుణ్యాపాలనే ద్వివిధకర్మలనే, వల్లియిల్ = సంకెలలో, పూణ్డు = చిక్కుకొని, మతి మయఙ్గి = జ్ఞానాన్ని కోల్పోయి, తుయక్కుమ్ = భ్రమింపజేస్తున్న, పిఱవియిల్ = సంసారంలో, తోన్ఱియ ఎన్నై = జన్మించిన నన్ను, తుయర్ అక*ర్ఱి* = దుఃఖాలను పోగొట్టి, ఉయ కొణ్డు = ఉజ్జీవింపజేసి, నల్కుమ్ = అనుగ్రహిస్తున్న, ఇరామానుశ = భగవద్రామానుజా !, ఎన్ఱతు ఇతు = అని దేవరవారి పావనత్వాన్నిగూర్చి పల్కడమనే ఇది, ఉన్నై = దేవరవారిని, ఉన్ని = అనుసంధించి, నైన్దు = ద్రవించి, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడు, నయక్కుమవర్క్కు = ఆశతో ఉండేవారికి, ఇ*ఴు*క్కు ఎన్బర్ నల్లవర్ = తగదు అని సత్పురుషులు అంటారు.



భగవద్రామానుజులకు పావనత్వమని, భోగ్యత్వమని రెండు గుణాలున్నాయి. పావనత్వమంటే- భక్తుల పాపాలను పోగొట్టి పరిశుద్ధులనుగా చేయడం. భోగ్యత్వమంటే ఎల్లప్పుడు అనుభావ్యులుగా ఉండడం. ఈ రెండిటిలో పావనత్వంకంటే భోగ్యత్వమే గొప్పది. ఎందుకు ? అని అంటే, మన పాపాలను పోగొట్టారు- అనే కారణంవల్ల వారిని "పావనులు" అని అనుసంధించాలి. ఇది ఒక ఉపాధినిబట్టి వస్తున్నది. భోగ్యత్వాన్ని అనుసంధించడం ఇటువంటిది కాదు. అది స్వరూపప్రయుక్తం. అందువల్ల పావనత్వాన్ని అనుసంధించడంకంటే భోగ్యత్వాన్ని అనుసంధించడమే గొప్పది. ఆ విధంగా ఉండగా, అముదనార్ ఈ ప్రబంధంలో మాటిమాటికి అముదనార్ భగవద్రామానుజుల పావనత్వాన్ని అనుసంధించారు. "నా పాపాలను అన్నిటినీ పోగొట్టారు, నా దోషాలను అన్నిటినీ పోగొట్టారు" అని మాటిమాటికి అంటున్నారు. ఆవిధంగా పల్కినందుకు ఈ పాశురంలో అముదనార్ అనుతపిస్తున్నారు. భోగ్యతలో అభినివేశాన్ని పొంది పలుకవలసి ఉండగా, పావనత్వంలో అభినివేశాన్ని పొందడాన్ని స్ఫురించేటట్లుగా పలుకడం తగదు -అని పెద్దలు అంటారు- అని తాత్పర్యం.

**102.** నైయుమ్ మన మున్కుణఙ్గళై యున్ని, ఎన్నా విరున్దెమ్
ఐయనిరామానుశన్ ఎన్ఱ*ఴై*క్కుమ్, అరువినైయేన్
కైయున్తొ*ఴు*మ్ కణ్ కరుతిడుమ్ కాణ క్కడల్పుడైశూ*ఴ్*
వైయమితనిల్, ఉన్ వణ్మై ఎన్బాలెన్ వళర్న్దతువే.

(భగవద్రామానుజా !), మనమ్ = నా మనస్సు, ఉన్ కుణఙ్గళై =దేవరవారి కల్యాణగుణాలను, ఉన్ని = ధ్యానించి, నైయుమ్ = ద్రవిస్తున్నది, ఎన్ నా = నా జిహ్వా, ఇరున్దు = స్థిరంగా ఉండి, ఎమ్ ఐయన్ = నాకు స్వామి అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజా!, ఎన్ఱు = అని, అ*ఴై*క్కుమ్ = పిలుస్తున్నది, అరు వినైయేన్ = మహాపాపి అయిన నాయొక్క, కైయుమ్ = చేతులుకూడా, తొ*ఴు*మ్ = అంజలి చేస్తున్నవి, కణ్ = నేత్రాలు, కాణ =దేవరవారిని సేవించాలని, కరుతిడుమ్ = ఆశపడుతున్నవి, కడల్ పుడై శూ*ఴ్* = చుట్టు సముద్రం పరివేష్ఠితమైన, వైయమ్ ఇతనిల్ = ఈ భూమండలంలోపల, ఉన్ వణ్మై = దేవరవారి ఔదార్యగుణం, ఎన్బాల్ = దాసునిపై, వళర్న్దతు ఎన్ = (ఈ విధంగా) వృద్ధి చెందడానికి ఏమి కారణం ?

స్వామీ ! దాసుని మనస్సు దేవరవారి గుణానుభవంలో ఊనికను కల్గినదై, "ఈ విధంగాకూడా శీలగుణం ఉంటుందా?" అని ద్రవిస్తున్నది. నా వాక్కు దేవరవారి తిరునామసంకీర్తనంలో లోతుగా మునిగిపోయింది. నా చేతులు దేవరవారి అంజలిని చేయడంలో నిమగ్నమయ్యాయి. నా కన్నులు దేవరవారికి ఎల్లప్పుడు సేవిస్తూ ఉండేటట్లుగానే ఏనాటికీ సేవించాలనే తహతహను పొందుతున్నవి. అందువల్ల ఈ విధంగా నా కరణాలు అన్నీ దేవరవారిపట్ల ఊనికను కల్గి ఉండేటట్లుగా దేవరవారి ఔదార్యం దాసుని ఒక్కనిపై ప్రవహించడాన్నిగూర్చి మాటలతో వర్ణించడం సాధ్యం కాదు -అని భావం.

**"ఐయన్ ఇరామానుశన్"** - ఇది సమీపంలోని సంబోధన. ప్రథమావిభక్తి రూపంగానే గ్రహిస్తే **"అఱైక్కుమ్"** అనే పదానికి "వ్యవహరిస్తున్నది'' అని అర్థం.

**103.** **వళర్న్ద వెఙ్గోప మడఙ్గలొన్ఱాయ్, అన్ఱు వాళవుణన్**
**కిళర్న్ద పొన్నాకమ్ కిழிత్తవన్, కీర్త్తిప్పయిరెழுన్దు**
**విళైన్దిడుమ్ శిన్దై యిరామానుశన్ ఎన్ఱన్ మెయ్‌వినైనోయ్**
**కళైన్దు నన్ఞాన మళిత్తనన్, కైయిల్ కని యెన్నవే.**

అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, వళర్న్ద =వృద్ధిచెందిన, వెమ్ కోపమ్ = కఠినమైన కోపాన్ని కల, మడఙ్గల్ ఒన్ఱు ఆయ్ = అద్వితీయ నృసింహ మూర్తియై, వాళ్ అవుణన్ = ఖడ్గాన్ని కల్గిన హిరణ్యకశిపునియొక్క, కిళర్న్ద = మదంతో బాగా బలిసిన, పొన్ ఆకమ్ = బంగారంవంటి వక్షస్సును, కిழிత్తవన్= చీల్చివేసినవాడైన భగవానునియొక్క, కీర్త్తి పయిర్ = కీర్తులనే పైరు, ఎழுన్దు = పెరిగి, విళైన్దిడుమ్ = ఫలించే, శిన్దై = మనస్సును కల, ఇరామానుశన్ = భగవద్రామానుజులు, ఎన్ తన్ మెయ్ = నా శరీరాన్ని ఆశ్రయించి ఉండే, వినై నోయ్ = పాపాల (వల్ల కలిగే) వ్యాధులను అన్నిటినీ, కళైన్దు = పోగొట్టి, కైయిల్ కని ఎన్న = చేతిలో వెలిగే ఉసిరికపండువలె సులభంగా, నల్ ఞానమ్ = విలక్షణమైన జ్ఞానాన్ని, అళిత్తనన్ = అనుగ్రహించారు.

గడచిన పాశురంలో పల్కిన రీతిలోనే, తమ కరణాలు భగవద్రామానుజుల విషయంలో ఆసక్తిని కల్గి ఉండడానికి కారణం ఏమి? అని అడిగినవారికి సమాధానాన్ని పల్కుతున్నట్లున్నది - ఈ పాశురం. నృసింహరూపాన్ని ఎత్తి హిరణ్యుని వక్షస్సును భేదించిన స్వామియొక్క కల్యాణగుణాలను ఎల్లప్పుడు



ధ్యానిస్తూ ఉండే భగవద్రామానుజులు నా పాపాలను పోగొట్టి మంచి జ్ఞానాన్ని అనుగ్రహించారు. అందుచేతనే నాకరణాలు అన్నీ వారి విషయంలో గాఢంగా ఆసక్తాలు అయినవి- అని భావం.

**"మడఙ్గల్"**- మగసింహం. హిరణ్యుడు భగవానునివరకు ఎంతగా అపచారాలను చేసినా భగవానునకు కోపం కలుగలేదు. పరమభాగవతుడైన ప్రహ్లాదునిపట్ల అంతులేని అపచారాలను చేసినందువల్ల **"వళర్న్ద వెమ్ కోప మడఙ్గల్ ఒన్ఱాయ్"** గా అవతరించాడని భావం. **"కీర్త్తి ప్పయిర్ ఎழுన్దు విళైన్దిడుమ్ శిన్దై"**- భగవద్గుణాలనే పైరు భగవద్రామానుజుల చిత్తం అనే క్షేత్రంలో గొప్పగా మొలిచి వృద్ధి చెందుతున్నది- అనడానికి భగవద్రామానుజులవలె భగవద్గుణానుభవాన్ని పొంది ఆనందించేవారు వేఱెవరూ లేరు- అని భావం.

**"కైయిఱ్కని యెన్నవే"**- స్పష్టంగా అని భావం. **"కరతలామలకమ్"** అని దీనినే సంస్కృతజ్ఞులు అంటారు.

**104.** **కైయిల్ కని యెన్న క్కణ్ణనై క్కాట్టి త్తరిలుమ్, ఉన్‌తన్**
**మెయ్యిల్ పిఱఙ్గియ శీరన్ఱి వేణ్డిలన్ యాన్, నిరయ**
**త్తొయ్యిల్ కిడక్కిలుమ్ శోతివిణ్ శేరిలు మివ్వరుళ్ నీ**
**శెయ్యిల్ తరిప్పన్, ఇరామానుశ ! ఎమ్ శెழுఙ్కొణ్డలే.**

శెழு కొణ్డల్ = ఔదార్యంలో విలక్షణమైన మేఘంవంటి, ఎన్ ఇరామానుశ = మా భగవద్రామానుజా! (దేవరవారు), కణ్ణనై = భగవానుని, కైయిల్ కని ఎన్న = అరచేతిలోని ఉసిరిక పండువలె (సులభంగా), కాట్టి తరినుమ్ = దర్శింపజేసి అనుగ్రహించినా, ఉన్‌తన్ = దేవరవారి యొక్క, మెయ్యిల్ = తిరుమేనిలో, పిఱఙ్గియ = ప్రకాశిస్తున్న, శీర్ అన్ఱి = సౌశీల్యాదికల్యాణగుణాలను తప్ప వేఱు దేనిలోను, యాన్ = నేను, వేణ్డిలన్ = కోరను, (దృష్టి పెట్టను), నిరయమ్ తొయ్యిల్= సంసారనరకమనే గోతిలో (బురదలో), కిడక్కిలుమ్ = మునిగి ఉన్నా, శోది విణ్ శేరిలుమ్ = జ్యోతిర్మయమైన పరమపదాన్ని చేరినా, ఇవ్వరుళ్ =(దేవరవారి తిరుమేని అందాన్ని అనుభవించడానికి తగిన) ఈ కృపను, నీ శెయ్యిల్ = దేవరవారు చూపిస్తేనే, తరిప్పన్ = (సంసారంలో కాని మోక్షంలోకాని) కాలు నిలిపి ఉండగలను.

దాసుడనైన నేను అపేక్షించినవానిని అన్నిటినీ ఏకొఱత లేకుండా ఉండేటట్లు అనుగ్రహిస్తున్న స్వామీ! దేవరవారు దాసునకు భగవానుని సులభంగా దర్శింప

జేసినా, దేవరవారి తిరుమేనిసౌందర్యాన్ని అనుభవించడంలో నా మనస్సు ఆసక్తిని కల్గి ఉన్నదే తప్ప ఆ భగవానుని కోరనే కోరదు. దేవరవారి తిరుమేని అనుభవం దాసునకు సిద్ధించినట్లయితే ఈ తమోమయజగత్తులో ఉండడం కూడా నాకు దుఃఖాన్ని కల్గించదు. ఈ అనుభవం లేకపోతే పరమపదంకూడా నాకు ఆనందాన్ని కలుగజేయను. ఈ అనుభవం మాఱకుండా నిరంతరం సిద్ధించే చోటే నాకు పరమభోగ్యమైనది. అది సంసారమండలమైనా సరే; నరకమైనా సరే; పరమపదమైనా సరే; అందువల్ల దాసునకు దేవరవారి దివ్యమంగళవిగ్రహానుభవమే నిరంతరం కలిగేటట్లు అనుగ్రహించాలి- అని ప్రార్థించారు.

"నిరయత్తొయ్యిల్" -నిరయమంటే నరకం. ఈ సంసారమండలమే నరకమనబడుతుంది. **"తొయ్యిల్"** - పంకం, బురద. ఇక్కడ సప్తమీవిభక్తి వచ్చి లోపించింది. **"తొయ్యల్"** అని అనుసంధించేవారుకూడా ఉన్నారు.

105. **శెழுన్దిరై ప్పాఱ్కడల్ కణ్డుయిల్ మాయన్, తిరువడిక్కీழ்**
**విழுన్దిరుప్పార్ నెఞ్జిల్ మేవు నన్ఞాని, నల్వేతియర్కళ్**
**తొழுన్దిరుప్పాత నిరామానుశనై త్తొழுమ్ పెరియోర్**
**ఎழுన్దిరైత్తాడుమిడమ్, అడియేనుక్కిరుప్పిడమే.**

శెழு తిరై = అందమైన అలలను కల, పాల్ కడల్ = క్షీరాబ్ధిలో, కణ్ తుయిల్ = పరుండి ఉండే, మాయన్ = సర్వేశ్వరునియొక్క, తిరు అడి కీழ் = శ్రీచరణాలకింద, విழுన్దు ఇరుప్పార్= పడి ఉండే మహానుభావులయొక్క, నెఞ్జిల్ మేవుమ్= హృదయంలో పొందికగా వేంచేసి ఉండే, నల్ ఞాని = గొప్ప జ్ఞానిగా, నల్ వేదియర్కళ్ = గొప్ప వైదికులచే, తొழுమ్ = సేవింపబడ్డ, తిరు పాదన్ = శ్రీచరణాలను కలవారై ఉండే, ఇరామానుశనై = భగవద్రామానుజులను, తొழுమ్ =సేవించే, పెరియోర్ = మహాత్ములు, ఎழுన్దు = దేహం ఉన్నచోట ఉండలేకుండా పైకి లేచి, ఇరైత్తు = ఘోషించి, ఆడుమ్ = నర్తనం చేసే, ఇడమ్ = చోటు, అడియేనుక్కు = దాసునకు, ఇరుప్పు ఇడమ్ = నివసించే చోటు.

గడచిన పాశురంలో **"నిరయ తొయ్యిల్ కిడక్కిలుమ్ శోది విణ్ శేరిలుమ్"** అని సంసారాన్ని, పరమపదాన్ని రెండిటిని సమానంగా, వైలక్షణ్యం లేనట్లుగా పల్కిన అముదనార్‌ను చూచి కొందు, "లోకంలో అందఱు సంసారాన్ని గర్హించి, పరమపదాన్ని ఆశపడుతూ ఉండగా, మీరు సంసారాన్ని, పరమపదాన్ని తుల్యంగా భావించి



పల్కుతున్నారే! మీకు ఉద్దేశ్యమైన స్థానం ఏది? చెప్పండి" అని అనగా, శ్రీరామానుజ భక్తులు ఆనందించి నర్తించే చోటే నాకు పరమోద్దేశ్యమైన స్థానమని అంటున్నారు.

క్షీరాబ్ధినాథుడైన శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను సేవించేవారు సైతం, ఆ స్వామిని ఉపేక్షించి, భగవద్రామానుజులనే తమ మనస్సులో ధ్యానిస్తారు. అటువంటి భగవద్రామానుజులను ఆశ్రయించిన మహానుభావులు ఆ భగవద్రామానుజులను అనుభవించినందువల్ల కలిగే ఆనందం ఉన్మస్తకమై, శరీరం ఉన్న చోట ఉండ లేక పైకి లేచి, సముద్రం ఘోషించేటట్లుగా ఘోషిస్తూ తల, కాళ్ళు ఏవో తెలియనట్లు ఎక్కడెక్కడో నర్తనం చేస్తారో, అక్కడ అక్కడ అంతా నేను ఆనందంతో ఉంటాను. ఆ చోటే నాకు ముక్తిస్థానమని తాత్పర్యం.

## శాఱ్ఱుముఱై పాశురాలు

106. **ఇరుప్పిడమ్ వైకున్దమ్ వేఙ్గడమ్, మాలిరుఞ్జోలై యెన్నుమ్**
**పొరుప్పిడమ్ మాయనుక్కెన్బర్ నల్లోర్, అవై తన్నొడుమ్ వన్దు**
**ఇరుప్పిడమ్ మాయనిరామానుశన్ మనత్తిన్నవన్వ**
**న్దిరుప్పిడమ్, ఎన్దనితయత్తుళ్ళే తనక్కిన్బుఱవే.**

మాయనుక్కు = సర్వేశ్వరునకు, ఇరుప్పు ఇడమ్ = వాసస్థానాలు (ఏవి ? అని అంటే), వైకున్దమ్ = పరమపదం, వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలం, మాలిరుమ్ శోలై = తిరుమాలిరుమ్ శోలై, ఎన్నుమ్ పొరుప్పు = అనే పర్వతం (అనే ఇవి అన్నీ), ఎన్బర్ నల్లోర్ = అని సత్పురుషులు అంటారు, మాయన్ =(వీటిని వాసస్థానాలుగా కల్గిన) సర్వేశ్వరుడు, అవై తన్నొడుమ్ = ఆ వైకుంఠం మొదలైనవానితోకూడ, వన్దు ఇరు ప్పిడమ్ =వచ్చి వేంచేసి ఉండే చోటు, ఇరామానుశన్ మనత్తు = భగవద్రామానుజుల మనస్సులోనే, అవన్ = ఆ భగవద్రామానుజులు, ఇన్ఱు = ఇపుడు, వన్దు = వచ్చి, తనక్కు అన్బు ఉఱ = తమకు ఆనందంగా వేంచేసి ఉండే, ఇడమ్ =చోటు, ఎన్‌తన్ ఇదయత్తుళ్ళే = దాసుడనైన నా హృదయంలోనే.

గడచిన పాశురంలో పల్కిన రీతిలోనే అముదనార్‌యొక్క అవధి లేని ప్రావణ్యాన్ని తెలిసికొన్న భగవద్రామానుజులు "మనపై ఇంతటి ప్రేమను కల్గి ఉన్న వీరి మనస్సును మనం విడిచిపోకూడదు" అని తలచి, అముదనార్ హృదయాన్ని చాలా అభిలషించగా, దానిని చూచి ఆనందించి పల్కుతున్నారు.

భగవానుడు ఎక్కడ వేంచేసి ఉంటాడు? అని అంటే, శ్రీవైకుంఠం తిరువేఙ్గడ మలై, తిరుమాలిరుమ్శోలై పర్వతం- మొదలైన ప్రదేశాలలో వేంచేసి ఉంటాడని సత్పురుషులు అంటారు. అటువంటి భగవానుడు ఆ శ్రీవైకుంఠం మొదలైన దివ్యదేశాలను తనతో చేర్చుకొని (కలుపుకొని) భగవద్రామానుజుల హృదయంలోకి వచ్చి నిత్యవాసం చేస్తున్నాడు. అటువంటి శ్రీరామానుజులు నా మనస్సులో నిత్యవాసం చేస్తున్నారు.

పెరియతిరువన్దాది ప్రబంధంలో **"పువియుమ్ ఇరువిశుమ్బుమ్ నిన్నకత్త, నీ యెన్ శెవియిన్ వ*ழி* పుకున్దు ఎన్నుళ్ళాయ్, అవివిణ్ణి యాన్ పెరియాన్ నీ పెరియై ఎన్బదనై యారఱివార్ ? ఊన్ పరుకు నేమియాయ్ ! ఉళ్ళు"** అనే పాశురం ఇక్కడ అనుసంధేయం. ఉభయవిభూతివిశిష్టుడైన భగవానుడు శ్రీరామానుజుల హృదయంలో ఉన్నాడు. ఉభయవిభూతివిశిష్టుని కబళీకరించిన ఆ భగవద్రామానుజులను (ఉడైయవర్ను) దాసుడనైన నేను కబళీకరించాను- అని భావం. **"పొరుప్పు"** - పర్వతం.

**107. ఇన్బు*ఱ్ఱ* శీలత్తిరామానుశా! ఎన్ఱు మెవ్విడత్తుమ్**
**ఎన్బు*ఱ్ఱ* నోయుడల్ తోఱుమ్ పిఱన్దిఱన్దు, ఎణ్ణరియ**
**తున్బు*ఱ్ఱు* వీయినుమ్ శొల్లువతొన్ఱుణ్డున్ తొణ్డర్కట్కే**
**అన్బు*ఱ్ఱి*రుక్కుమ్బడి ఎన్నై యాక్కి యఙ్గాట్పడుత్తే.**

ఇన్బు ఉ*ఱ్ఱ* = ఆనందపూర్ణులై వేంచేసి ఉండే, శీలత్తు = సౌశీల్యగుణాన్ని కల్గిన, ఇరామానుశా = భగవద్రామానుజా!, శొల్లువతు =దేవరవారివద్ద దాసుడు విజ్ఞాపనం చేసే విషయం, ఒన్ఱు = ఒకటి, ఉణ్డు = ఉన్నది, (అది ఏమి ? అంటే), ఎన్బు ఉ*ఱ్ఱ* నోయ్ = ఎముకలను పట్టి బాధించగల్గిన వ్యాధులకు, ఉడల్ తోఱుమ్ = స్థానమైన శరీరాలు అన్నిటిలో, పిఱన్దు = జన్మించి, ఇఱన్దు = మరణించి, ఎణ్ణ అరియ = లెక్కించడానికి సాధ్యం కాని, తున్బు ఉ*ఱ్ఱు* = దుఃఖాలను అనుభవించి, వీయినుమ్ = నశించిపోయినా, ఎన్ఱుమ్ = అన్ని కాలాలలోను, ఉన్ తొణ్డర్కట్కే = దేవరవారి భక్తుల విషయంలోనే, అన్బు ఉ*ఱ్ఱి* ఇరుక్కుమ్బడి = భక్తిని కలవారై ఉండేటట్లు, ఎన్నై ఆక్కి = నన్ను చేసి, అఙ్గు = ఆ భక్తులపట్ల, ఆళ్ పడుత్తు = దాసుని కింకరునిగా చేసి, దయచూపాలి, (ఇదే దాసుని విన్నపం).



గడచిన పాశురంలో పల్కిన రీతిలోనే తమపట్ల వ్యామోహాన్ని కల్గి ఉండే భగవద్రామానుజులను చూచి, "స్వామీ! దేవరవారికి దాసుడు విన్నపించవలసిన విషయం ఒకటి ఉన్నది. అది ఏమంటే- పలువిధాలైన వ్యాధులకు ఆశ్రయం అయిన శరీరంలో జన్మించి నశిస్తూ ఎన్నో దుఃఖాలను అనుభవించేస్థితి నాకు సంభవించినా, సంభవించనీ. ఏస్థితిలో అయినా దాసుడు దేవరవారి అంతరంగ భక్తులకే కైంకర్యం చేయగల్గినవాడనైతే, అదే చాలు. అంతకంటే దాసుడు వేఱు దేనినీ ప్రార్థించడంలేదు. ఎన్ని జన్మలు సంభవించినా ఆస్తితులలో అంతటా దాసుని దేవరవారి భక్తులనే దాస్యంచేసేటట్లుగా చేయాలి. అనే ఒక్కటిని మాత్రం ప్రార్థిస్తున్నాను - అని భావం.

**108. అఙ్గయల్ పాయ్ వయల్ తెన్నరఙ్గన్, అణియాక మన్నుమ్**
**పఙ్గయమామలర్ ప్పావైయై ప్పో*ఱ్ఱు*తుమ్, పత్తి యెల్లామ్**
**తఙ్గియతెన్న త్త*ழై*త్తు నెఞ్జే ! నన్తలైమిశైయే**
**పొఙ్గియ కీర్త్తి! ఇరామానుశనడిప్పూ మన్నవే.**

నెఞ్జే = ఓమనసా!, పత్తి ఎల్లామ్ = భక్తి అంతా, తఙ్గియతు ఎన్న = నాపట్లనే గూడుకట్టుకొని ఉన్నది అని చెప్పే రీతిలో, త*ழై*త్తు = చిగిర్చి వర్ధిల్లి, పొఙ్గియ కీర్త్తి = పొంగిన(విస్తరించిన) కీర్తిని కలవారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, అడి పూ = శ్రీచరణపద్మాలు, నమ్ తలై మిశైయే మన్న = మన శిరస్సులపై నిత్యవాసం చేసేటట్లుగా (మనం చేయవలసిన కార్యం ఏది ? అని అంటే) అమ్ = అందమైన, కయల్ = ముత్యాలు, పాయ్ = తుళ్ళిపడే, వయల్ = సస్యక్షేత్రాలు (చేలు) చుట్టి ఉండే, తెన్ అరఙ్గన్= దక్షిణదిక్కులో శ్రీరంగంలో నిత్యవాసం చేసే భగవానునియొక్క, అణి = అందమైన, ఆకమ్ = వక్షఃస్థలంలో, మన్నుమ్ = నిత్యవాసం చేస్తున్నది, పఙ్గయమ్ మా మలర్ = గొప్ప తామరపూవులో, జన్మించినది, పావైయై = అందమైన బొమ్మవంటిది అయిన లక్ష్మిని, పో*ఱ్ఱు*తుమ్ = మంగళాశాసనం చేద్దాం.

ఈ ప్రబంధం ప్రారంభంలో **"ఇరామానుశన్ శరణారవిన్దమ్ నామ్ మన్ని వా*ழ*"** అని భగవద్రామానుజుల శ్రీచరణపద్మాల సన్నిధిలో పొందికగా ఉండి ఉజ్జీవించడమే తమకు పరమపురుషార్థంగా అనుగ్రహించినవారు కనుక, ఆ పురుషార్థం మనకు యావజ్జీవం సిద్ధించే రీతిలో, అన్ని సంపదలను అనుగ్రహించ గల్గిన లక్ష్మీదేవిని ప్రార్థిద్దాం- అని ఈ చివరి పాశురంలో అంటున్నారు.

పొంగిన కీర్తిని కల్గిన భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలు మన శిరస్సులపై నిత్యవాసం చేయడంకోసం భక్తి అంతా మనవద్దనే గూడుకట్టుకొని ఉన్నది- అని చెప్పే రీతిలో చిగిర్చి వర్ధిల్లడంకోసం పద్మనివాసిని అయిన లక్ష్మిని కీర్తిద్దాం- అని అంటున్నారు. భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలలో మనకు అంతు లేని భక్తి కల్గి ఉండడంకోసం, ఆ శ్రీచరణాలు మనకు శిరోభూషణంగా కావడంకోసం తగినట్లుగా పిరాట్టిని (లక్ష్మీదేవిని) ప్రార్థిద్దాం - అని భావం. లోకంలో సామాన్య సంపదను అనుగ్రహించగల్గిన లక్ష్మీదేవియే ఈ విశేషమైన సంపదను కూడా అనుగ్రహించగలదు- అని తాత్పర్యం.

**ఇరామానుశనూఱ్ఱన్దాతి దివ్యార్థదీపికా వాఖ్యానానికి**

**ఆంధ్రానువాదం ముగిసింది.**

**ఎమ్బెరుమానార్ తిరువడికళే శరణమ్**

**తిరువరఙ్గత్తముతనార్ తిరువడికళే శరణమ్**





## పాశురసూచి

